# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

ఆగస్ట్ 2007 73 రు. 10

- ఫోకస్ : అరవై సంవత్సరాల స్వాతంత్ర్యం
- బాక్సైట్ తవ్వకాలు - ఆదివాసుల జీవన విధ్వంసం
- చేనేత కార్మికుల ఆకలిచావులు
- భారత ఆర్థిక వ్యవస్థ స్వరూప స్వభావాలు
- కీలుబొమ్మ సరసన రబ్బర్ స్టాంప్
- డి డి కోశాంబి శత జయంతి
- చారిత్రక సాక్షిగా తెలుగు కథ

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

ఆగస్ట్ 2007
సంచిక : 73

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ





**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**



**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com




**సంపాదకీయ వ్యాఖ్యలు**

## ఏం గొనేటట్ల లేదు...

ఇటీవలి కాలంలో నిత్యావసర సరుకుల ధరలు, ముఖ్యంగా పప్పుదినుసులు, నూనెలు, చింతపండు, కూరగాయల ధరలు చుక్కలనంటుతున్నాయి. రాష్ట్రంలోని మార్కెట్లలోకి కూరగాయలను సరఫరా చేసే ప్రాంతాల్లో సాధారణం కన్న ఎక్కువగా కురిసిన వర్షాలతో కూరగాయల ఉత్పత్తి తగ్గిపోవడం ఒక కారణం కాగా, ప్రభుత్వానికి, పౌరసరఫరాల శాఖకు కూరగాయల గిరాకీ – సరఫరాలమీద ఒక ప్రణాళికాబద్ధమైన వ్యూహం లేకపోవడం మరొక కారణం. వ్యవసాయ భూములను ఇతర వినియోగాల కొరకు మళ్లించడం, కూరగాయల దిగుమతులు ప్రోత్సహించడం, కొత్తరకం కూరగాయల వాడకంపై మోజు పెంచడం వంటి ఎన్నో కారణాలు కూడా ఉన్నాయి. ప్రభుత్వ గణాంకాలను పరిశీలించినా రాష్ట్రంలో కూరగాయల పంటల విస్తీర్ణంలో ఏడాదికేడాదికీ తరుగుదలనో, యథాస్థితినో కనబడుతున్నది తప్ప పెరుగుదల ఉండడం లేదు. కనీసం జనాభా పెరుగుదలతో సమన్వయంలోనైనా కూరగాయల పంటల విస్తీర్ణం, దిగుబడి ఉండేలా చూడవలసిన బాధ్యత ప్రణాళికా, వ్యవసాయ, పౌరసరఫరా శాఖలమీద ఉంది. ఇక మిగిలిన సరుకుల విషయానికి వస్తే రానున్న గిరాకీని గుర్తించడం, ఆ గిరాకీకి తగినట్టుగా సరఫరా చేయడం కొరకు నిలువ ఉంచుకోవడం, ప్రైవేటు వ్యాపారస్తుల దగ్గరి నిలువలను పర్యవేక్షించడం ధరలు నియంత్రించడం ప్రభుత్వ విధులు. ఆ విధులలో ప్రభుత్వం విఫలమైనందువల్ల ఆయా సరుకుల గిరాకీకి, సరఫరాకు మధ్య కృత్రిమ అంతరం ఏర్పడింది. లాభార్జన దృష్టితో వ్యాపారులు నిత్యావసర సరుకులను అక్రమంగా నిల్వ చేయడం వల్ల ధరలు సాధారణ ప్రజానీకానికి అందనంత ఎత్తుకు ఎగిరిపోయాయి. అక్రమ నిల్వదారులమీద దాడులు చేసి ధరలను నియంత్రిస్తామని జూన్ చివరి వారంలోనే పౌరసరఫరాల శాఖ, సంబంధిత మంత్రి, ముఖ్యమంత్రి ప్రకటించినప్పటికీ, నెల రోజులు గడిచినా ఆ ప్రకటనలు నిజరూపం దాల్చలేదు. ఈలోగా వర్షాలవల్ల కూరగాయల సరఫరా కూడా సంక్షోభంలో పడి దాదాపు అన్ని కూరగాయల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ఉల్లిపాయల ధరలో 100 శాతం, టమాటా, బంగాళాదుంప వంటి కూరగాయల ధరలలో 200 శాతం కన్న ఎక్కువ పెరుగుదల కనబడుతున్నది. వంకాయ, బెండకాయ, ఆకుకూరలు వంటివాటి ధరల్లో కూడ గణనీయమైన పెరుగుదల ఉన్నది. ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని, వ్యాపారుల దురాశలను దెబ్బతీయగల ప్రజాఆగ్రహాన్ని సమీకరించే దిశలో ప్రతిపక్షాలు కూడ పనిచేయడం లేదు. తామే శాసనసభ ప్రాంగణంలోనో, ఇతర చోట్లనో చౌకధరల కూరగాయల దుకాణాలు తెరవడం వంటి చర్యల ద్వారా వార్తల్లో నానడానికే ప్రయత్నిస్తున్నారు గాని, అధికధరల సమస్యపై ప్రజలను కదిలించి అధికారులను, వ్యాపారులను నిలదీసే వైఖరి తీసుకోవడంలేదు. ప్రజలందరూ ఎదుర్కొంటున్న ఈసమస్య ప్రజలందరి భాగస్వామ్యం ఉన్న ఉద్యమాలద్వారా మాత్రమే పరిష్కారమౌతుంది.

## ఎవరికోసమీ ఉక్కు పరిశ్రమ?

బ్రహ్మణి స్టీల్స్ అనే సంస్థ కడపలో ఏర్పాటు చేయనున్న ఉక్కు కర్మాగారం ఉక్కు ఉత్పత్తి ఎప్పుడు మొదలుపెడుతుందో తెలియదు గాని ప్రస్తుతానికి మాత్రం విరివిగా వివాదాలను ఉత్పత్తి చేస్తున్నది. ఆ సంస్థ అధిపతుల గత జీవితం నుంచి ఆ సంస్థకు అందిన అనుమతుల దాకా అనేక విషయాలలో అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. ఆ అనుమానాలలో కొన్ని వాస్తవికమైనవి కావచ్చు. కొన్ని కాకపోవచ్చు. కాని ఆ అనుమానాల, ఆరోపణల, ప్రత్యారోపణల గందరగోళంలో అవసరమైన కొన్ని ప్రశ్నలు వినబడకుండా పోతున్నాయి. రాష్ట్రంలో అసలు ఒక కొత్త ఉక్కు కర్మాగారం రావలసిన అవసరం ఉందా, ఒక కొత్త ఉక్కు కర్మాగారమంటూ వస్తే అది ఎవరికోసం రావాలి, ఇప్పుడు ఏర్పాటు చేసేచోట దానికి తగిన వనరులున్నాయా, ఆ కర్మాగారపు ఉత్పత్తులు దేశీయ అవసరాలు తీర్చడానికా, బహుళజాతి సంస్థలకొరకా, ఇప్పటికే ప్రభుత్వరంగంలో పనిచేస్తున్న ఉక్కుకర్మాగారాలను దివాళా తీయిస్తూ ఈ కర్మాగారాన్ని ప్రోత్సహించడంలోని ఔచిత్యం ఏమిటి, అది స్థానికంగా ఎంతమందిని నిరాశ్రితులను చేస్తుంది, వారికి ప్రత్యామ్నాయ ఉపాధి అవకాశాలు కలగజేస్తుందా లేదా, అసలు

అది స్థానిక ప్రజాజీవితాన్ని ఒక మెట్టు పైకి ఎక్కించగలుగుతుందా, దిగజారుస్తుందా, అలా పైకి ఎదిగించడమో, దిగజార్చడమో ఏయే వర్గాలమీద ఎటువంటి ప్రభావం చూపుతాయి, కర్మాగారం ఏర్పడనున్న ప్రాంతంలో రైతులకు ఏమవుతుంది, భూమిలేని నిరుపేదలకు ఏమవుతుంది, ఇవాళ అంతర్జాతీయంగా ఉక్కుపరిశ్రమలో నెలకొని ఉన్న సాంకేతిక పరిజ్ఞానం వల్ల ఈ కర్మాగారం ఉపాధికల్పనకు దారితీయగలుగుతుందా, ప్రభావిత ప్రాంతపు జనాభాలో ఎంత శాతానికి ఆ ఉపాధి దొరుకుతుంది, ఏ స్థాయిలో ఆ ఉపాధి దొరుకుతుంది లాంటి అనేక ప్రశ్నలకు సమాధానం రావలసే ఉంది. ప్రైవేట్ పెట్టుబడిదారులకు తమ మదుపు, దానిపై లాభం అనేవే తప్ప ఈ సామాజిక ప్రశ్నలను పట్టించుకునే అవసరం గాని, అవకాశం గాని లేవనే మాట నిజమే. కాని ఆ సంస్థ కొరకు వేలాదిఎకరాల భూమిని చౌకగానో ఉచితంగానో ఇస్తున్న ప్రభుత్వం, అనేక రాయితీలు, మినహాయింపులు ఇస్తున్న ప్రభుత్వం, ఒక ప్రైవేట్ పెట్టుబడిదారు తన లాభాలకొరకు ఒక సంస్థ పెట్టుకుంటుంటే దానికి వందలకోట్ల రూపాయల ప్రజాధనాన్ని అప్పనంగా ఇస్తున్న ప్రభుత్వం జవాబు చెప్పక తప్పని ప్రశ్నలివి.

## హత్యలే హత్యలు, విచారణ కూడాలేదు

రాష్ట్రంలో ఎన్‌కౌంటర్ల పేరిట ఉద్యమకారులను, సానుభూతిపరులను, సాధారణ ప్రజలను హత్యచేయడం నిరాటంకంగా జరిగిపోతున్నది. హతుల రాజకీయ అభిప్రాయాల మీద, ఆచరణ మీద ఎవరికి ఎటువంటి అభిప్రాయం ఉన్నప్పటికీ, వారిమీద ఒక రాజకీయ విధానంగా అమలవుతున్న హత్యాపరంపరను ఖండించవలసి ఉంది. ఆ హత్యలను ఖండించడం వారి అభిప్రాయాలనూ ఆచరణనూ సమర్థించడం కోసం కూడ కానక్కర్లేదు. ఈ దేశ రాజ్యాంగం మీద గౌరవంతో, చట్టబద్ధపాలన నడవాలనే ఆధునిక ప్రజాస్వామ్య నాగరిక ఆలోచనతో కూడ ఈ హత్యలను ఖండించవలసి ఉంది. కనీసం ఆ హత్యలకు బాధ్యులు హత్యానేరంపై విచారణ ఎదుర్కొని తాము అవతలి మనిషిని కేవలం ఆత్మరక్షణ కొరకు మాత్రమే చంపామని రుజువు చేసుకోవాలని అడగవలసి ఉంది. ఈ దేశ రాజ్యాంగం ప్రతి మనిషికీ జీవనస్వేచ్ఛను హామీ ఇచ్చింది. చట్టం నిర్దేశించిన పద్ధతిలో తప్ప మరొకరకంగా ఒకరి ప్రాణాన్ని హరించడం హత్య అవుతుందని, దాన్ని భారత శిక్షాస్మృతి సెక్షన్ 302 కింద విచారించి తగిన శిక్ష వేయాలని చట్టం చెపుతుంది. కారణాలేవయినప్పటికీ దేశంలో ప్రతిరోజూ వందలాది హత్యలు జరుగుతూనే ఉన్నాయి. వాటిమీద విచారణలు జరిగి హంతకులకు శిక్షలు పడుతూనే ఉన్నాయి. కాని విచిత్రంగా ఎంతమందిని చంపినా అసలు హత్యానేరం మీద విచారణకు బోనుకూడ ఎక్కనవసరంలేని బృందం ఒకటి ఈ దేశంలో తయారయింది. రక్షకభటులమనీ, శాంతిభద్రతల నిర్వాహకులమనీ పేరుపెట్టుకున్న ఆ బృందం మనుషుల ప్రాణాలు తీసి వాటిని హత్యలుగా పరిగణించగూడదనీ, విచారణ జరపగూడదనీ అంటున్నది. తమ మనుగడకోసం, తమ అక్రమార్జనల కోసం ఆ బృందం మీద ఆధారపడిన మన పాలకులు ఆ బృందానికి ఈ శిక్షాతీత, విచారణాతీత ప్రవర్తన సాగించడానికి అవకాశం ఇస్తున్నారు. ఈ విధంగా కొందరి నేరాలకు న్యాయవిచారణ నుంచి మినహాయింపు దొరకడమనేది, అంతిమంగా సమాజంలో ఎవరు ఏ నేరంచేసినా అడగడానికి ఎవరికీ అధికారం లేని ఒక అరాచకస్థితికి దారితీస్తుంది. ఆ అరాచకత్వం నుంచి, అధికారవర్గపు బాధ్యతారహిత ప్రవర్తననుంచి సమాజాన్ని కాపాడడానికే ఆధునిక వ్యవస్థలు స్వతంత్ర న్యాయ వ్యవస్థను సృష్టించుకున్నాయి. ప్రస్తుతం న్యాయవ్యవస్థ కూడ తన స్వాతంత్ర్యాన్ని వదిలి ఆ విచారణాతీత నేరప్రవర్తనను సమర్థించడం, కొన్ని హత్యలు హత్యలు కావని ప్రకటించడం తెలుగు సమాజ దుస్థితికి నిదర్శనం.

## బలపడుతున్న రూపాయి

గత రెండు మూడు నెలలుగా అమెరికన్ డాలర్‌తో పోల్చినప్పుడు భారత రూపాయి విలువ పెరుగుతున్నది. ఒక డాలర్ కొనడానికి మార్చ్ 5న రు. 44.43 అవసరమై ఉండగా, జూలై 19న అది రు. 40.26కు చేరింది. మరో మాటలో చెప్పాలంటే మార్చ్ 5న ఒక రూపాయికి 0.0225 డాలర్లు కాగా, జూలై 19న 0.0248 డాలర్లు వస్తున్నాయి. ఇది చిన్న మొత్తంగా కనబడవచ్చు గాని, రెండు వేల కోట్ల డాలర్ల భారత–అమెరికా వాణిజ్యాన్ని చూసినప్పుడు ఈ తేడా ఎనిమిదివేల కోట్ల రూపాయల పై చిలుకు అవుతుంది. మరోమాటలో చెప్పాలంటే మనం ఒక వెయ్యి డాలర్ల వస్తువును కొనుక్కోవాలంటే మూడు నెలల కింది రు. 44,430 అవసరం కాగా ఇప్పుడు రు. 40,260 చాలునన్నమాట. ఆమేరకు రూపాయి బలపడిందన్నమాట. రూపాయి విలువ ఇలా పెరుగుతుండడం పట్ల సహజంగానే భారతీయ పౌరులందరూ సంతోషపడతారు. ఇన్నాళ్లకు అమెరికన్ డాలర్ ఆధిపత్యాన్ని కొంతలో కొంతయినా దెబ్బతీస్తూ మన రూపాయి తన శక్తిని చాటుతున్నదనుకుంటారు. అయితే ఈ మార్పు దిగుమతుల బిల్లులో మనకు ఎంత ప్రయోజనకరంగా ఉంటుందో, ఎగుమతుల బిల్లులో అంత నష్టం కలిగిస్తుంది. అంటే పైలెక్కనే మళ్లీ చూస్తే ఇదివరకు మనకు రు. 44,430 వచ్చే చోట, ఇప్పుడు రు. 40,260 మాత్రమే వస్తాయి. అందువల్లనే విప్రో, ఇన్ఫోసిస్, సత్యం వంటి ప్రధాన సాఫ్ట్‌వేర్ ఎగుమతి ఆధార సంస్థలన్నీ ఈ పరిణామాన్ని నష్టదాయకమైనదిగా పేర్కొంటున్నాయి. దేశంలోని ఆర్థిక, ద్రవ్య పత్రికలన్నీ ఈ పరిణామాన్ని ఖండిస్తున్నాయి. రూపాయి విలువ పెరిగినందువల్ల దిగుమతులు పెరిగిపోయి చెల్లింపుల సంక్షోభం ఏర్పడుతుందనీ, దేశీయ ఎగుమతులు తగ్గిపోతాయనీ, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల ప్రవాహంలో అవకతవకలు జరుగుతాయనీ ఆ పత్రికలు రాస్తున్నాయి. తాము తమ కుటుంబాలకు పంపే డాలర్లకు ఇదివరకు వచ్చినదానికన్న తక్కువ రూపాయలు వస్తున్నాయని ప్రవాస భారతీయులు వాపోతున్నారు. ద్రవ్య వ్యవహారాల నిపుణులు సంక్లిష్టమైన గణితశాస్త్ర సమీకరణాలతో ఈ పరిణామాన్ని అర్థం చేసుకోవడం మరింత క్లిష్టంగా మారుస్తున్నారు. ఆయా అంకెల గారడీలు ఏమైనా, వేరువేరు దేశాల మారకద్రవ్యాలమధ్య ఇప్పుడు కొనసాగుతున్న కృత్రిమ చలామణీ రేటును మార్చవలసిన, అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడి నిర్దేశిస్తున్న అక్రమ ఆట సూత్రాలను మార్చవలసిన అవసరం ఎంతో ఉన్నదనేది రూపాయి బలపడడం ద్వారా మరొకసారి రుజువవుతున్నది. ◆

# లోపలి పేజీల్లో...



## అరవై సంవత్సరాల స్వాతంత్ర్యం

మన భారతదేశ భవిష్యత్తు - సామాన్యుని భవిష్యత్తుపై, అభివృద్ధిపై ఆధారపడి ఉంది. రాజ్యాంగంలో పొందుపర్చుకున్న పౌరులందరూ సమానమన్న భావనను కార్యాచరణలో ప్రజలంతా భావించాలి. సర్వసత్తాక లౌకిక ప్రజాస్వామ్య దేశంగా, సమానత్వం ధ్యేయంగా స్వతంత్ర భారతదేశం మరింత వేగంగా ముందడుగులు వేయాలి. లేని పక్షంలో సముపార్జించిన స్వాతంత్ర్యం ఉన్నత, ధనార్జనవర్గాలకే పరిమితమై, మరో స్వాతంత్ర్య పోరాటానికి సామాన్య ప్రజలు, అణగారిన వర్గాలు, పీడిత ప్రజలు ఉద్యుక్తులు కాక తప్పదు.

### ఫోకస్ : అరవై సంవత్సరాల స్వాతంత్ర్యం


*పరాధీనత... స్వాతంత్ర్యం.... పరాధీనత - వి. హనుమంతరావు - 18* · *పొంచి ఉన్న ప్రమాదం - యలమంచిలి శివాజీ - 20*

*మరో స్వాతంత్ర్య పోరాటం - కె. శ్రీనివాస రెడ్డి - 21* · *ఆరుపదుల స్వాతంత్ర్యం - ఎగుడు దిగుళ్లు - ఎస్. శివరామిరెడ్డి - 23*

| | | | |
|---|---|---|---|
| ❖ ప్రాంతీయం | | | 8 |
| ❖ వర్తమానం | : కీలుబొమ్మ సరసన రబ్బరు స్టాంపా? | - మాడభూషి శ్రీధర్ | 9 |
| ❖ వర్తమానం | : బాక్సైట్ తవ్వకాలు - ఆదివాసుల జీవన విధ్వంసం | - జి. రమేష్ | 11 |
| ❖ విశ్లేషణ | : భారత దేశ ఆర్థిక వ్యవస్థ స్వరూప స్వభావాలు | - ఎం. కోదండరాం | 13 |
| ❖ వ్యాఖ్య | : జర్నలిజానికీ మంచి రోజులు రావాలి | - సవ్యసాచి | 16 |
| ❖ సంస్మరణ | : డి. పున్నారావు | | 17 |
| ❖ కథా సాహిత్యం - పరామర్శ | : చారిత్రక సాక్షిగా తెలుగు కథ | - బి.వి.ఎన్. స్వామి | 26 |
| ❖ మీడియా - బాలలు | : బాలల బుల్లితెర ఎక్కడ? | - నాగులపల్లి భాస్కరరావు, నాగసూరి వేణుగోపాల్ | 29 |
| ❖ చర్చ | : ఇటీవలి ప్రపంచ పరిణామాలు | - మిత్ర | 31 |
| ❖ విధాన విమర్శ | : చేనేత కార్మికుల ఆకలి చావులను ఆపలేమా ? | - బండారు జ్వాలా నరసింహం | 33 |
| ❖ విలువలు - సంస్కృతి | : పోటీపడుతున్న విషసంస్కృతులు | - సత్యనారాయణ | 35 |
| ❖ డి.డి. కోశాంబి శతజయంతి | : మార్క్సిస్ట్ చరిత్ర రచనా వైతాళికుడు | - వకుళాభరణం రామకృష్ణ | 37 |
| ❖ డి.డి. కోశాంబి శతజయంతి | : చరిత్ర అధ్యయనం - డి.డి. కోశాంబి | - ఆశాలత, నరేశ్ | 39 |
| ❖ చరిత్ర | : జాతీయతత్వం ఒళ్లో మతతత్వం - కొమర్రాజు రచనల పరిశీలన | - ఎస్. మహబూబ్ బాషా | 41 |
| ❖ విధాన విమర్శ | : శాసనమండలి - ఒక పరిశీలన | - పి. శ్రీనివాసరావు, పుల్లా శ్రీనివాస్, భూక్యా శ్రీనివాస్ | 46 |
| ❖ దేశీయం | | | 48 |
| ❖ అంతర్దేశీయం | | | 49 |
| ❖ అసహజ మరణాల సూచి | | - రాంకి, వై. రామచంద్రం | 50 |


'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028

# కొత్తపుస్తకాలు












- **పహెచాన్** – ముస్లిం స్త్రీల అస్తిత్వ పోరాట కథలు – డా. భారతి (గీతాంజలి) – మట్టి ముద్రణలు ప్రచురణ, 177 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : పుట్ట పుస్తక శిబిరం, ఆలగడప, మిర్యాలగూడ – 508 207. నల్లగొండ, తెలంగాణ.
- **అన్నంగుడ్డ** – సుంకోజి దేవేంద్రాచారి కథలు – యుక్త ప్రచురణలు, 194 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు – ఎస్. దేవిక, 6–76, మిద్దెపైన, సాయినగర్, తిరుచానూరు పోస్టు, తిరుపతి. ఫోన్ : 9949118082, హైదరాబాద్‌లో దిశ, సహచర, నవోదయ, తెలుగు బుక్‌స్టాల్, మణి బుక్ స్టాల్ నెల్లూరు, విశాలాంధ్ర, ప్రజాశక్తి అన్ని బ్రాంచీలలో.
- **మాటల్లేని వేళ** – పలమనేరు బాలాజి కవితలు – పవిత్ర & ప్రణీత ప్రచురణలు, 83 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : కె.ఎన్. జయమ్మ, 6–219, గుడియాత్తం రోడ్, పలమనేరు – 517 408. చిత్తూరు జిల్లా. ఫోన్ : 9440995010, ఆర్.ఆర్. బుక్ సెంటర్ – పలమనేరు, మణి బుక్‌స్టాల్ నెల్లూరు, దిశ, సహచర, నవోదయ, విశాలాంధ్ర, ప్రజాశక్తి పుస్తకాల షాపుల్లో.
- **మీ ఊరిని మీరే అధ్యయనం చేయండి** – తెలంగాణ రాష్ట్ర ఉద్యమం – నడుస్తున్న చరిత్ర – ఆరవ పుస్తకం – బి.ఎస్. రాములు, తెలంగాణ కళాకారుల, రచయితల, మేధావుల ఐక్యవేదిక ప్రచురణ, 96 పేజీలు, 1/8 డెమీ, రు. 20. ప్రతులకు : తెలంగాణ కళాకారుల, రచయితల, మేధావుల ఐక్యవేదిక, 2–2–647/ఎ/57, సాయిబాబా నగర్, శివం రోడ్, హైదరాబాద్ – 500 013. ఫోన్ నెం. 9391036987
- **ఎన్నార్ పాటలు** – ఎన్. ఆర్. (నరసింహ) – మార్పు కళామండలి ప్రచురణ, 194 పేజీలు, 1/8 డెమీ, రు. 30 , ప్రతులకు : ఎచ్.ఎమ్. హేమలత, 6–69, బ్యాంక్ కాలనీ, పి.ఆర్.పల్లి, సంగారెడ్డి, మెదక్ జిల్లా – 502 001. ఫోన్ : 9440927559. అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **అభివృద్ధి కల్లోలం** – ఎస్. సుధాకర్ – చూపు ప్రచురణలు, 78 పేజీలు – 1/8 డెమీ. రు.30, ప్రతులకు : చూపు ప్రచురణలు, జి–6, 'మేఘన', సెవెన్ హిల్స్ కాంప్లెక్స్, నిజాంపేట రోడ్, కూకట్‌పల్లి, హైదరాబాద్ – 500 072. ఫోన్ : 40068285. అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **జస్టిస్ రాజిందర్ సచార్ కమిటీ నివేదిక** – ఒక పరిశీలన – షంషీర్ అహ్మద్ – 35 పేజీలు – 1/8 డెమీ, ప్రతులకు : షంషీర్ అహ్మద్, స్పెషల్ కలెక్టర్ (ల్యాండ్ ఎక్విజిషన్) మహబూబ్‌నగర్.
- **చదువులసారం** – ఎ. రాజాహుస్సేన్ – చుక్కా రామయ్య విద్యాపీఠం ప్రచురణ, 164 పేజీలు, 1/8 డెమీ, రు. 75.
- **సంగీత శిఖరాలు** – డా. ఎస్. సదాశివ – రామయ్య విద్యాపీఠం ప్రచురణ, 183 పేజీలు, 1/8 డెమీ, రు. 80.
- **సిలబస్** – ఇంటి భాషపై వాదోపవాదాలు – చుక్కా రామయ్య – స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ, 112 పేజీలు, 1/8 డెమీ, రు. 50.

పై మూడు పుస్తకాల ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, జర్నలిస్టు, సంపాదకుడు, 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044.











## పాఠకుల వీక్షణం

ఎస్. నర్సింగరావు గారి వ్యాసం 'చరిత్ర అనుత్పాదకం కాదు' (జూన్ 2007) చాలా విలువైనది. చరిత్ర 'ఉత్పాదకత'కు సంబంధించీ, అంతకన్నా ముఖ్యంగా 'ఆధునికత' వైపు దూసుకొని పోతున్నదిగా పలువురు అనుకునే మన సమాజానికి చరిత్ర రిలవెన్స్‌కు సంబంధించి అనుమానాలు తలెత్తుతున్న 'ఆధునిక' సందర్భంలో ఇలాంటి వ్యాసాలు అత్యంత అమూల్యమైనవిగా స్థిరపడతాయి. జూనియర్ కళాశాలల్లో చరిత్రను చంద్రబాబు తొలగించినప్పుడు పలువురు నిరసన వ్యక్తం చేశారని చెబుతున్న సందర్భంలో నర్సింగరావు 'హిస్టరీ కాంగ్రెస్' ప్రస్తావన తెచ్చారు. 'నిరసన' విషయం వాస్తవమైనా ఆ చీకటి సందర్భంలో ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ స్పందించాల్సినంత స్థాయిలో స్పందించలేదనేది నిష్ఠుర సత్యం. నిరసనను తెలుపుతూ తీర్మానాలుచేసి ప్రభుత్వానికి పంపి చేతులు దులుపు కున్నారు. ఏ కొంతమందినో మినహాయిస్తే, చాలామంది 'మనకెందుకులేబ్బా' అనుకున్నారు. అనపర్తి సెషన్ (2002)లో 'పీపుల్ ఫర్ సోషల్ సైన్సెస్' తరపున ఈ లేఖా రచయిత చంద్రబాబు ధాష్టీకాన్ని ఖండించిన కరపత్రాన్ని పంచుతుంటే పలువురు పెద్ద మనుషులు కళ్లెర్ర చేశారు. 'ఆర్గనైజేషన్‌కు దెబ్బవస్తుంది' అని భయపెట్టారు. ఇంకొకరు 'అన్‌సివిలైజ్డ్‌గా ఉంది పాంఫ్లెట్' అన్నారు. బాగా బాధపెట్టే విషయమేమంటే ఎ.పి.ఎచ్.సి. ఒక చిన్న బుక్‌లెట్‌ను కూడా ప్రచురించ లేకపోయింది. (విశాలాంధ్ర వాళ్లు ప్రచురించిన 'సామాజిక శాస్త్రాలకు కాలం చెల్లిందా?', వివిధ పత్రికల్లో ప్రచురితమైన అరకొర వ్యాసాలొక్కటే ఎడారిలో ఒయాసిస్సు.) ఇదంతా ఎ.పి.ఎచ్.సి. ఒక ఉద్యమ స్థాయిలో స్పందించ లేకపోయిందనడానికి ప్రబల నిదర్శనాలు. కొంతమంది కన్‌సర్న్‌డ్ మేధావులను వదిలేస్తే విద్యావంతులైన ప్రజల స్పందన ఏమీ లేదు. తీవ్ర దిగ్భ్రాంతికరమైన విషయమేమంటే 'మానవేతిహాసం పై మహాకావ్యాన్ని'రాసి 'జ్ఞానపీఠ'ను పొందినవారు నిస్సిగ్గైన నిశ్శబ్దాన్ని పాటించడం. ఇంతకన్నా వెక్కిరింత (బ్లాక్ హ్యూమర్) తెలుగు ప్రజలకు మరొకటి లేదు. 'చరిత్ర చదివితే ఏమొస్తుంది?', 'చరిత్ర అంటే ఏముంది', 'అశోకుడు చెట్లు నాటెను', 'అక్బరు పుట్టలు తవ్వెను', 'ఔరంగజేబు దేవాలయములు కూల్చెను' ఇంతే కదా అని సాధారణ ప్రజాభిప్రాయం కలిగే స్థాయికి చరిత్ర స్టేటస్ దిగజారి ఉన్న ఈ సందర్భంలో చరిత్ర ప్రాధాన్యాన్ని తెలియజేస్తూ ఇప్పటికైనా ఒక చిరుపుస్తకాన్ని ఎ.పి.ఎచ్.సి. వెలువరించాలి. 'సమగ్ర ఆంధ్రప్రదేశ్ చరిత్ర' ప్రాజెక్ట్ ఎంత విలువైందో ఇది కూడా అంతే విలువైందనీ, ఇంకా గట్టిగా చెప్పాలంటే, అంతకంటే ముఖ్యమైందనీ బాధ్యులు గుర్తించాలి. ఎ.పి.ఎచ్.సి. ఇప్పటికైనా మేల్కొని ఒక ప్రజాపక్ష సంస్థగా రూపొందాలి.

గమనిక : లేఖా రచయిత ప్రస్తుతం ఎ.పి.ఎచ్.సి. జీవిత సభ్యుడిగానూ, కార్యనిర్వాహక సంఘం సభ్యుడిగానూ ఉన్నాడు. లేఖలో వ్యక్తమైన భావాలు పూర్తిగా వ్యక్తిగతమైనవే గానీ, ఎ.పి.ఎచ్.సి. కి వీటికి అస్సలు సంబంధం లేనేలేదు.

**– మహబూబ్ బాషా**
లక్నో

ప్రముఖ సాహితీకారుడు గుంటూరు శేషేంద్ర శర్మ మరణంపై ప్రగాఢ సంతాపం తెల్పుతూ వీక్షణం జూలై సంచికలో అందించిన సమాచారం ఎంతో విలువైంది. అది చదివాకే నాకు ఆయన పట్ల గౌరవం మరింత పెరిగింది. మీ పరిశోధనాత్మక సంతాపం ఆయన పట్ల నాకున్న కొంత దురభిప్రాయాన్ని తగ్గించింది. అందుకు వీక్షణం సంపాదకవర్గానికి నిండు కృతజ్ఞతలు.

**– శ్రీరామకవచం సాగర్**
ఒంగోలు

వీక్షణం జూలై సంచికలో వచ్చిన ఎస్. గోవిందరాజులు గారి వ్యాసం 'విద్యారంగాన్ని వధ్యశిలపై నిలిపిన రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వం' చాలా బాగుంది. రాష్ట్ర విద్యారంగం పరిస్థితిని విశ్లేషణతో వివరిస్తూ వర్తమాన స్థితిని మన కళ్లముందుంచింది. విద్యారంగంలో చోటు చేసుకుంటున్న అవాంఛనీయ మార్పులు, విధానాలు రచయిత పాఠకుల ముందుంచారు.

**– వరలక్ష్మి**
ప్రొద్దుటూరు

యోజన, ఇపిడబ్ల్యు పత్రికల్లాగ రచయితల గురించి వీక్షణంలో కూడా ఏకవాక్య పరిచయం ఇస్తే బాగుంటుంది.

**– భాస్కర్ సోల్తి**
హైదరాబాద్

మాడభూషి శ్రీధర్ రచించిన 'రాజ్యాంగానికీ నాగరికతకూ నిజమైన ఎన్‌కౌంటర్ – కౌసర్‌బీ, వ్యాసం (జూలై 2007) చాలా బాగుంది. మన రాష్ట్రంలో కూడ అటువంటి ఎన్‌కౌంటర్లు ఎన్నో జరిగిన దృష్ట్యా ఆ వ్యాసం మీరు ప్రచురించి నందుకు ధన్యవాదాలు. 'ఇది టెర్రరిస్టుల సమస్య కాదు. మన నాగరికతకు సంబంధించిన సవాల్' అని స్పష్టంగా తెలియజేసిన రచయితకు అభినందనలు.

**– ఎన్. వసంత్**
వరంగల్

జూలై సంచికలో 'కమ్యూనిస్టు ఉద్యమం – నందిగ్రామ్' అంటూ నెల్లూరి కృష్ణమూర్తి గారు ప్రకటించిన 'వృద్ధ హృదయపు ఆత్మఘోష' బాగుంది. ఆయన లేవనెత్తిన అనేక ప్రశ్నలు ఆలోచించవలసినవే. అయితే ఆయన కమ్యూనిస్టు పార్టీలుగా భావిస్తున్న సిపిఐ, సిపిఎంలు పేరుకే కమ్యూనిస్టులు కాని నిజంగా, ఆచరణలో కమ్యూనిస్టులుగా లేరని ఆయన గుర్తించినట్టు కనబడడంలేదు.

**– ఎస్. జనార్ధన్**
విజయవాడ

మిత్రుడు అమర్ రాసిన సుదీర్ఘ సంపాదక లేఖ చదివాను. ఇంతకు ముందు శ్రీనివాసరెడ్డి రాసిన లేఖకు నా స్పందనే అమర్ లేఖకు కూడా వర్తిస్తుంది. యూనియన్ కార్యదర్శిగా నేను నా వ్యాసంలో వెలిబుచ్చిన అభిప్రాయాలకు స్పందించటం తన బాధ్యతగా భావించి ఈ సుదీర్ఘ లేఖ రాసి ఉండవచ్చు. ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఏర్పాటు కాకముందే, ఢిల్లీ యూనియన్‌లో 1953లో చేరిన నాటి నుంచి అఖిల భారత స్థాయిలో, రాష్ట్ర స్థాయిలో పని చేసిన అధ్యక్షులు, కార్యదర్శుల జాతకాలన్నీ నాకు తెలుసు. ప్రస్తుత రాష్ట్ర కార్యదర్శి జాతకం కూడా నాకు క్షుణ్ణంగా తెలుసు. గాజు ఇళ్లల్లో నివసించే వారు ఇతరుల మీద రాళ్లు విసరరాదు. మిత్రుడు శ్రీనివాసరెడ్డి లేఖకు స్పందించిన తర్వాత కేంద్ర ప్రభుత్వం వేజ్‌బోర్డ్ నియామకం గురించిన ప్రకటన వెలువడింది. గ్రామీణ జర్నలిస్టుల సమస్యలను వేజ్‌బోర్డ్ దృష్టికి తీసుకొచ్చి బలమైన వాదన వినిపించాల్సి ఉంది. ఈ వ్యర్థ వాదప్రతివాదనలను పక్కనపెట్టి శక్తియుక్తులన్నీ కూడదీసుకొని గ్రామీణ జర్నలిస్టుల సమస్య పరిష్కారం మీద దృష్టి సారించాలి. యూనియన్ సభ్యత్వంలో సింహభాగం వారిదే. వారి రుణాన్ని యూనియన్ తీర్చుకోవాలి.

**– వి. హనుమంతరావు**
హైదరాబాద్

(ఈ విషయం పై చర్చను ఇంతటితో ముగిస్తున్నాం. – సం.)

**అడ్రస్ మార్పు**

ప్రధాన సంపాదకులు వి. హనుమంతరావుగారి మారిన అడ్రస్

**వి. హనుమంతరావు**
సి.ఆర్. ఫౌండేషన్ వృద్ధాశ్రమం, కొండాపూర్,
హైదరాబాద్ – 500 084.
ఫోన్ : 23118672

## భూ పోరాటం ...

రెండు నెలలకు పైగా (మే 6 నుండి) సి.పి.ఎం. రాష్ట్రవ్యాప్తంగా ఇళ్ల స్థలాల కోసం పోరాటం చేస్తోంది. తరువాత సి.పి.ఐ.తో కలిసి ఈ పోరాటం రాష్ట్రంలో వెయ్యి కేంద్రాలకు విస్తరించింది. మూడు నుంచి నాలుగు లక్షల మంది ప్రజలు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. దాదాపు 70 వేల ఎకరాలు స్వాధీనం చేసుకొనే ప్రయత్నం జరిగింది. అందోళనకారులపై 16 వేల కేసులు నమోదు చేశారని తెలుస్తోంది. కోనేరు రంగారావు నేతృత్వంలో ఏర్పడిన భూ కమిటీ సిఫారసులను యథాతథంగా బయట పెట్టాలని డిమాండ్ చేయటంతో ఈ పోరాటం మొదలైంది. చాపకింద నీరులా వ్యాపిస్తున్న ప్రత్యేక ఆర్థిక మండలుల (సెజ్)ల కోసం వేలాది ఎకరాల భూమి (సాగుభూములతో సహా) ఓ పక్క పోతుండగా, ఇళ్ల స్థలాలైనా ప్రజలకు దక్కితే మేలే. ఇదే క్రమంలో సి.పి.ఎం, సి.పి.ఐ. నేతలు జూలై 22 నుంచి నిరవధిక నిరాహార దీక్షను చేపట్టారు.

## 'గ్రామాలకు వెళ్లండి' రాష్ట్రపతి పిలుపు

జూన్ 29న హైదరాబాద్‌లోని వివేకవర్ధిని కళాశాల శతాబ్ది ఉత్సవాల్లో పాల్గొనడానికి వచ్చిన రాష్ట్రపతి అబ్దుల్ కలాం విద్యార్థులను ఉద్దేశించి "విద్యార్థులూ, గ్రామాలకు వెళ్లండి, వారికి చదవడం, రాయడం నేర్పించండి. అదే మీ జీవితానికి పరమార్థం" అని పిలుపునిచ్చారు. అలాగే విద్యార్థులకు ఒక ప్రాజెక్ట్‌ను నిర్దేశించారు. విద్యార్థులు గ్రూపులుగా ఏర్పడి మహబూబ్‌నగర్ జిల్లాలోని పది గ్రామాలను దత్తత తీసుకుని, ప్రజల సామాజిక, ఆర్థిక పరిస్థితులను, వారి స్థితిగతులను అధ్యయనం చేయాలన్నారు. ఆ గ్రామాల అభివృద్ధికై ఏమి చేయాలో సూచనలు చేస్తూ ప్రాజెక్ట్ రిపోర్ట్‌ను తయారు చేయాలన్నారు. ప్రజల అభ్యున్నతికి చదువులు ఉపయోగపడాలని కలాం చెప్పారు. ప్రత్యామ్నాయ ఉద్యమాలు ఎప్పటినుంచో అంటున్న మాటలే రాష్ట్రపతి కొద్ది కాలంలో పదవి విరమణ చేసే ముందు అనడం గమనార్హం. 'అభివృద్ధి' పేరుతో గ్రామీణ జీవితంలో వస్తున్న రాజకీయార్థిక సామాజిక మార్పులను నిజంగానే అధ్యయనం చెయ్యాల్సి ఉంది.

## ముస్లిం రిజర్వేషన్లు

ముస్లింలకు రిజర్వేషన్లు కల్పించే అంశంపై గత రెండు నెలలుగా అధ్యయనం చేసిన బి.సి. కమిషన్ తన నివేదికను జూలై 3న ముఖ్యమంత్రికి సమర్పించింది. ముస్లింలలో ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిన 14 తరగతులకు నాలుగు శాతం రిజర్వేషన్ కోటా కల్పించాలని సిఫారసు చేసింది. రాష్ట్ర జనాభాలో ముస్లింలు 9.2 శాతంగా ఉన్నారు. దామాషా పద్ధతిన ఏయేతెగకు ఎంత రిజర్వేషన్ కల్పించాలో కూడా సూచించింది. పేదరికం, ఆర్థిక సామాజిక నేపథ్యం, వెనుకబాటు తనం ఆధారంగా ముస్లిం తెగలకు రిజర్వేషన్లు కల్పించాలనీ, ఈ విద్యాసంవత్సరం నుంచే అమలు చేయాలనీ పేర్కొంది. ముస్లింలలో 85-90 శాతం మంది ఈ పరిధిలోకి వస్తారని మైనారిటీ సంక్షేమశాఖ మంత్రి షబ్బీర్ అలీ అన్నారు. ఈ జి.ఓ. ని వ్యతిరేకిస్తూ హైకోర్టులో పిటిషన్ దాఖలు అయింది.

## ఎస్సీ రిజర్వేషన్ వర్గీకరణ

హైదరాబాద్ కలక్టరేట్‌లో జూలై 15న ఎస్సీ వర్గీకరణ చైర్‌పర్సన్ జస్టిస్ ఉషామెహ్రా ప్రజాభిప్రాయ సేకరణ చేపట్టారు. బహిరంగంగా జరగాల్సిన అభిప్రాయ సేకరణను అడ్డుకుంటామని మాల సంఘాలు హెచ్చరించడంతో రహస్యంగా జరపాల్సి వచ్చింది. షెడ్యూల్డ్ కులాల్లోని దాదాపు 58 ఉపకులాలకు చెందినవారు వర్గీకరణపై తమవాదనలు వినిపించారు. బుడగజంగాలు, రెల్లి వంటి తక్కువ జనాభా ఉన్న ఎస్సీ ఉపకులాలు వర్గీకరణవలన మాల, మాదిగలే లబ్ధిపొందారని తమ దాకా రిజర్వేషన్‌లు అందడం లేదని అన్నారు. వివిధ పార్టీలు, ప్రజా సంఘాలు, మేధావులు కమిషన్ ముందు తమవాదనలు వినిపించారు.

## ఆమ్‌వే మోసం

రాష్ట్రంలో అనేకమంది అమాయకులను మోసం చేస్తున్న ఆమ్‌వే సంస్థ కార్యకలాపాలు చట్టవిరుద్ధమని హైకోర్టు జూలై 19న తీర్పు ఇచ్చింది. ఈ సంస్థ కార్యకలాపాలు ప్రైజ్‌మనీ, మనీ సర్క్యులేషన్ నిషేధ చట్టం పరిధిలోకి వస్తాయని సిఐడి శాఖ కేసు నమోదు చేసింది. దీనిని సవాల్ చేస్తూ పెట్టుకున్న పిటిషన్‌ను తొమ్మిది నెలల విచారణ సాగిన తర్వాత హైకోర్టు కొట్టివేసింది. ఆమ్‌వేకు వ్యతిరేకంగా తీర్పు రావడం ప్రపంచంలో ఇది మొదటిసారి. ఏ ఇద్దరు కలుసుకున్నా సబ్బులు, షాంపూలు అమ్ముకునేస్థాయికి మధ్యతరగతి మానవ సంబంధాలను దిగజార్చిన ఆమ్‌వే నుంచి ఇకనైనా విముక్తి జరుగుతుందా వేచిచూడాలి.

## పుర్రె గుర్తు అక్కర్లేదు

కరీంనగర్ ఎం.పి. ఉప ఎన్నిక తెలంగాణ ఆకాంక్షకు రెఫరెండంగా మారిపోవడం మనకు తెలిసిందే. అయితే ఒక పథకం ప్రకారం బీడీ ప్యాకెట్లపై పుర్రెగుర్తు అంశం ఆ ఉపఎన్నికలో బలంగా ముందుకు వచ్చింది. ఈ జూలై 20న కేంద్ర మంత్రివర్గం పొగాకు ఉత్పత్తుల ప్యాకెట్లపై పుర్రె-ఎముకలు తదితర గుర్తులను ముద్రించడం తప్పనిసరి చేయరాదనీ, చట్టబద్ధమైన హెచ్చరిక మాత్రమే ముద్రించాలనీ నిర్ణయించింది. వర్షాకాల సమావేశంలో బిల్లు పెట్టేందుకు ఆమోదముద్ర వేసింది.

## నిన్న వడదెబ్బ, నేడు అతిసార

నిన్నటి ఎండాకాలంలో రాష్ట్రంలో వందలాది మంది సామాన్యులు వడదెబ్బకు మృత్యువాతపడగా, ఇప్పుడు అతిసార వ్యాధికి బలౌతున్నారు. కిందటి ఏడాదిలో ఇదే జూలై నెలలో రాష్ట్రమంతటా 2501 అతిసార కేసులు నమోదు కాగా ఈ ఏడాది జూలై మధ్యకాలం నాటికే 5813 కేసులు నమోదయ్యాయి. హైదరాబాద్‌లో 1590, మహబూబ్‌నగర్‌లో 1157, మెదక్‌లో 764, నిజామాబాద్‌లో 249, నల్గొండలో 162 మంది ఇప్పటివరకు ఈ వ్యాధి బారినపడ్డారు. మరోపక్క పారిశుధ్య పనుల కోసం వెచ్చించవలసిన 46 కోట్ల రూపాయల నిధులు సర్పంచ్‌ల (ఒక్కొక్క సర్పంచ్‌కి ఇరవైవేల రూపాయల చొప్పున) ఖాతాల్లో మూలుగుతున్నాయి. ◆

**కీలుబొమ్మ ప్రధాని, రబ్బరుస్టాంప్ రాష్ట్రపతి అయితే తమపబ్బం గడుస్తుందనే రీతిలోనూ, విధేయతే కొలమానంగానూ ఈ పదవులకు ఎంపిక జరుగుతోందంటున్నారు మాడభూషి శ్రీధర్**

# కీలుబొమ్మ సరసన రబ్బరు స్టాంపా?

మన సంవిధానం ప్రకారం మన రాజకీయ విధానంలో ప్రధానమంత్రికి అపారమయిన అధికారాలున్నాయి. అవి రాష్ట్రపతి కన్న ఎక్కువ అధికారాలు. కానీ మొదటిసారిగా ప్రధాని మన్మోహన్‌సింగ్‌కు పూర్తి అధికారాలు అందుబాటులో లేవు. నెహ్రూ, ఇందిరాగాంధీ సంతతి తప్ప మరే ఇతర ప్రధానమంత్రి పూర్తి అధికారాలను వినియోగించుకో లేరనే పరిస్థితిలేదని అందరూ నమ్ముతున్న విషయమే. ఒక్క పి.వి. నరసింహారావు మాత్రమే అది తప్పని నిరూపించి నెహ్రూ, ఇందిర, రాజీవ్ కుటుంబ దయతో నిమిత్తం లేకుండా అయిదేళ్ల పాటు పదవిలో కొనసాగి రికార్డు నెలకొల్పారు. ప్రతిపక్షంలో వాజ్‌పేయి ఆ రికార్డును దాదాపు సమంచేసిన మరో ప్రధాని. చరణ్‌సింగ్ గానీ నిన్నమొన్న మరణించిన చంద్రశేఖర్ గానీ కేవలం కాంగ్రెస్ చేతిలో పనిముట్లుగా ఉపయోగపడి తరువాత పనికి రాకుండా పోయారు. మొరార్జీ దేశాయిని పూర్తికాలం పదవిలో ఉండనివ్వకుండా వారిని చీల్చి చెండాడిన ఘనత కూడా కాంగ్రెస్‌దే. తమ కుటుంబ రికార్డును బద్దలు కొట్టినందుకు మాత్రమే పి.వి. అంటే సోనియా కుటుంబానికి పడదు. కనుకనే ఆయనకు ఢిల్లీలో సమాధికి కూడా స్థలం లేకుండా చేసి హైదరాబాద్‌కు తరలించారు. అయిదారు నెల్లుకూడా సరిగా అధికారంలో ఉండకుండా కాంగ్రెస్ కీలుబొమ్మ ప్రధానిగా పేరు తెచ్చుకున్న చంద్రశేఖర్‌కు మాత్రం ఢిల్లీలోనే అంత్యక్రియలు చేసుకునేభాగ్యం దక్కింది. ఇదంతా సోనియాగాంధీ చలవే.

ఇక ప్రస్తుతం మన్మోహన్ సింగ్ గారి పాలన – ఆయన స్వతహాగా మంచివాడు. కాని ఏం లాభం? ప్రధాని కాలేకపోయినా సోనియాగాంధీ కోసం ఫైళ్లు పట్టుకుని ఎదురుచూడడం తప్ప వేరే నిర్ణయం తీసుకునే అవకాశం లేదు. అధికారం లేదు. వామపక్షాలతో సహా అనేక చిన్న పార్టీల ఒత్తిడులకు లొంగి ఆయన పనిచేయాలి. నిజానికి ప్రజాస్వామ్యం లో ప్రజల ఒత్తిడులు ఉంటేనే పాలన సక్రమంగా సాగుతుంది. ఒకరకంగా ఇది మంచిదే. కాని ప్రధాని అనేక రకాల పరిమితుల మధ్య పాలించే పరిస్థితి వచ్చింది. కీలుబొమ్మ ప్రధానిగా మారిపోయాడు. కీ సోనియా దగ్గర ఉంది. సోనియా పైన ఒత్తిడి తేగల వర్గాలు చాలా ఉన్నాయి. ఇటీవల ఉత్తరప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో, మరెన్నో ఇతర సందర్భాలలో రాహుల్ గాంధీ 'మాకుటుంబం నిర్ణయం ప్రకారం....' అనీ, 'ఒకసారి మేమంతా కలిసి (కుటుంబమంతా కలిసి) నిర్ణయించిన తరువాత మార్పు ఉండదు' అనీ ప్రకటించి నిర్ణయాధికారం ఎవరిదో రాష్ట్రపతి అభ్యర్థిని కూడా ఎవరు నిర్ణయిస్తారో నిరూపించారు.

రాష్ట్రపతి కూడా అటువంటి వారే అయితేనే సోనియాగాంధీకి గానీ ఆమె అనుచరగణానికి గానీ బాగుంటుంది. ఒక కీలుబొమ్మ ఒక రబ్బరు స్టాంపు మన పక్కన ఉంటే రాజ్యాంగబద్ధ పాలనకు ఢోకా లేదనే పూర్తి నమ్మకంతో వ్యవహారాలు నడుస్తున్నాయని సులువుగానే అర్థం చేసుకోవచ్చు. రాష్ట్రపతి అభ్యర్థి ఎంపిక గురించి అధికార సంకీర్ణం కానీ, ప్రతిపక్ష సంకీర్ణం కానీ అంత ప్రాధాన్యతతో వ్యవహరించలేదు. కనీసం సమష్టి అభిప్రాయాన్ని సేకరించడానికి యు.పి.ఎ. అధినాయకులు ప్రయత్నించలేదు. అంత ఉన్నత పదవికి ఎంపిక చేయడానికి ఒక విధానాన్నీ గానీ, ఒక పద్ధతిని గానీ అవలంబించలేదు. మతం పేరుతో, కులం పేరుతో, ప్రాంతం నెపంతో ఎంపిక జరిగింది ఇన్నాళ్లూ. ఓటు రాజకీయం తప్ప మరో కొలమానం లేదు. ఈసారి మాత్రం మహిళా అభ్యర్థిని ఎంపిక చేయడం ఒక గొప్ప వ్యూహంగా భావిస్తున్నారు. ఈ సంకుచిత రాజకీయం వెనుక విధేయతే అసలు కొలమానం. ఒకవైపు కీలుబొమ్మ ప్రధాని, మరొకవైపు రబ్బరు స్టాంప్ రాష్ట్రపతి అయితే ఇష్టారాజ్యానికి అడ్డుండదు.

ఎవరైనా సరే కళ్లుమూసుకుని సంతకాలు పెట్టడం అలవాటయితే ప్రమాదం. రాష్ట్రపతి స్థాయిలో కూడా అదే పద్ధతి అయితే దేశానికి మరీ ప్రమాదం. ఇందిరాగాంధీ 1975లో ఎమర్జెన్సీ విధించాలను కున్నప్పుడు ఆ విధంగా అత్యవసర పరిస్థితి ప్రకటించడం ద్వారా రాజ్యాంగ పాలనకు రక్షణ కలుగుతున్నదా లేక రాజ్యాంగ వ్యతిరేక నియంతృత్వ పాలనకు దారితీస్తున్నదా అని పరిశీలించవలసిన బాధ్యత రాష్ట్రపతి పైన ఉంది. కాని ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ అవేవీ పట్టించుకోలేదు. ఎందుకంటే ఇందిరాగాంధీ పట్ల అపారమయిన భయభక్తులు, తిరుగులేని విధేయత, తనకు అత్యున్నత పదవి కట్టబెట్టినందుకు అంతులేని కృతజ్ఞత. దీంతో రాష్ట్రపతి అంటే చాలు రబ్బరుస్టాంప్ అనే అభిప్రాయం జనంలో వ్యాపించిపోయింది.

ఇందిరాగాంధీ మొదట నీలం సంజీవరెడ్డిని రాష్ట్రపతి అభ్యర్థిగా ప్రకటించి తరువాత మనసు మార్చుకున్నారు. ఈయనగారు తనమాట వినరేమోనని ఆమెకు భయం పట్టుకుంది. సీనియర్ కాంగ్రెస్ నాయకుడు గా ఆయన వ్యక్తిత్వం ఎదిగింది కనుక వద్దనుకున్నారు. చెప్పినట్టు వింటాడనుకున్న వి.వి.గిరిని ఎన్నుకునేందుకు 'అంతరాత్మ ప్రబోధం' అనే కొత్త సూత్రాన్ని ప్రవేశపెట్టి తన పార్టీ ఎంపీలు ఎమ్మెల్యేల ద్వారానే ప్రతిపక్ష అభ్యర్థికి ఓటు వేయించుకున్నారామె. సొంత పార్టీ అభ్యర్థినే

ఓడించి, వి.వి. గిరిని గెలిపించుకున్నారు. అందుకు ఏ ఒప్పందాలు కుదిరాయో మనకు తెలియదు.

ఇప్పుడయితే విప్ జారీచేసి తమ పార్టీ అభ్యర్థికే ఓటు వేయాలని, వేయకపోతే అనర్హతవేటు పడుతుందని భయపెట్టకోవచ్చు. విప్ జారీ చేయకుండా ఆత్మప్రబోధం అనే సూత్రాన్ని ప్రవేశపెట్టడానికి చట్టపరమైన ఆటంకం ఏదీ లేదు. ప్రతిపక్షాల వారికి తమ అభ్యర్థి ఓటమి ముందే తెలుసుకనుక ఆత్మప్రబోధం పిలుపు ఇవ్వడం, అధికార పక్షం వారు విప్ జారీచేయడం జరుగుతూనే ఉంది. రబ్బర్‌స్టాంప్ కోసం ఇందిరా గాంధీ వలె ప్రతిపక్ష అభ్యర్థికి మద్దత్తు ఇచ్చే అవసరం ప్రస్తుతం లేదు. ఎందుకంటే అభ్యర్థి ఎంపికలోనే ఆ లక్ష్యం నెరవేర్చుకున్నారు.

“నేను ఇందిరాగాంధీ ఆదేశిస్తే నేల ఊడ్వమన్నా ఊడుస్తాను” అని జ్ఞానీ జైల్‌సింగ్ తన విధేయత చాటినట్టు విమర్శలు ఉన్నాయి. కాని ఆయనే ఆ తరువాత రాష్ట్రపతి పదవిలో చాలా హుందాగా వ్యవహరించినట్టు, ఇంగిత జ్ఞానంతో నిర్ణయాలు తీసుకున్నట్టు ప్రశంసలు కూడా వచ్చాయి. ఇందిర హత్య తరువాత స్వయంగా చొరవ తీసుకుని రాజీవ్ చేత పదవీ స్వీకారం చేయించిన ఘనత ఆయనకు దక్కింది. ఒక మంత్రి తనను కించపరిచినట్టు మాట్లాడినప్పుడు పట్టుబట్టి ఆయన్ను రాజీవ్‌గాంధీ చేత తొలగింప చేశారు. రాష్ట్రపతి హోదాలో ఆర్. వెంకట్రామన్, కె.ఆర్. నారాయణన్ ఇద్దరూ తమ వ్యక్తిత్వాన్ని చాటుకున్నారు. రాష్ట్రపతి పాలనను విధించాలన్న ఆదేశాన్ని రబ్బర్ స్టాంప్ వలె అంగీకరించలేదు. గుజరాత్ అల్లర్లు జరిగితే అందులో ప్రభుత్వ పాత్రను నిలదీసి అడుగుతూ లేఖాస్త్రాలను సంధించారు.

బి.జె.పి. నాయకత్వంలోని ఎన్.డి.ఎ. సంకీర్ణం తన అభ్యర్థిగా నిలబెట్టి గెలిపించుకున్న గొప్ప శాస్త్రజ్ఞుడు, భారతరత్న అబ్దుల్ కలాం యు.పి.ఎ. ప్రభుత్వం సిఫారస్‌లను కొన్నింటిని తిప్పి పంపారు. పునః పరిశీలన జరిపించే అధికారం తనకు ఉందని నిరూపించారు. ప్రధాని పదవికి సోనియాగాంధీని ఆహ్వానించకపోవడానికి కారణం పౌరసత్వ శాసనానికి సంబంధించి రాష్ట్రపతి అబ్దుల్ కలాం లేవనెత్తిన సందేహాలే అనే అభిప్రాయం ఉంది. రాష్ట్రపతి భవన్ ప్రకటన అదేమీ లేదని చెప్పినప్పటికీ ఆఫీస్ ఆఫ్ ప్రాఫిట్ బిల్లును ఒకసారి తిప్పి పంపి సంచలనం సృష్టించారు. ఆ స్వయం వ్యక్తిత్వమే ఆయనను మళ్లీ అభ్యర్థిగా ఎంపిక చేయడానికి అనర్హత అయి ఉంటుంది. వ్యక్తిత్వాన్ని చాటుకునే ఉన్నతుడయితే మన బిల్లులను మన సిఫారిస్‌లను, నియామకాలకు ప్రమాదం అని ఇప్పుడు అధికారంలో ఉన్న వారు భావించడం వల్లే అబ్దుల్‌కలాంను మళ్లీ అభ్యర్థిగా నిలబెట్టడానికి ప్రతిబంధకమయింది.

మూడోఫ్రంట్ నేతలు తనను కలిసినపుడు గెలవగలిగితే పోటీ చేస్తానని అన్నందుకు, అబ్దుల్ కలాంను ఉద్దేశించి “నీ గేమ్ అయి పోయింది, నీవు మర్యాదగా దిగిపోవడం మంచిది. మళ్లీ రాష్ట్రపతి అభ్యర్థి కావాలనే ఆశలు వదులుకో” వంటి మాటలు సీనియర్ మంత్రులయిన శరద్‌పవార్, ప్రియరంజన్‌దాస్ మున్షీ, లాలూ ప్రసాద్ యాదవ్ నుంచి రావడం, ఈ మాటలను ఎవరూ ఆపలేకపోవడం, లేదా ఖండించక పోవడం ఆ పదవి ఔన్నత్యాన్ని కించపరచడమే.

ఏం చెప్పినా మారు మాటాడకుండా వినే రాష్ట్రపతి కావాలని కోరుకుంటున్నారని, ఆ విధంగా ఒక రబ్బరు స్టాంప్‌ను వెతుక్కుంటు న్నారనే విమర్శించారు. శివరాజ్ పాటిల్ రబ్బరు స్టాంప్ కాబోదని అనుకుంటే నిజానికి అది ఆయన వ్యక్తిత్వానికి ప్రశంసే. సామాన్యురాలైన ప్రతిభా పాటిల్ ఒక మహిళా రాజకీయ వేత్తగా రాష్ట్రపతి పదవికి ఎంపిక కావడంలో సాధారణంగా అభ్యంతరం ఉండదు. రాష్ట్రపతి పదవికి పోటీ చేసే వ్యక్తి మచ్చలేని వారై ఉండాలి. మచ్చలు ఉండడం అనర్హత కాదు. నేరారోపణలు ఉండడం కూడా అనర్హత కాదు. కాని మచ్చలేని సచ్ఛీలురే ఆ పదవిని అలంకరించాలన్నదే రాజ్యాంగ లక్ష్యం.

రాజేంద్రప్రసాద్, సర్వేపల్లి రాధాకృష్ణ వంటి మహనీయులు అలంకరించిన ఆ పదవికి అంతటి మహోన్నతులను, లేదా గౌరవనీయ మైన గతం ఉన్నవారిని, నైతిక విలువలు ఉన్న సమున్నతులను ఎంపిక చేయడం ఒక బాధ్యత. ఒకటి రెండు గంటల్లో భూతద్దం వేసుకుని అభ్యర్థులను ఎంపిక చేయడం, ఇంత సువిశాల భారతాన్ని, నూరు కోట్లు దాటిన భారత ప్రజానీకాన్ని అవమానించడమే అవుతుంది. రాజకీయాలకు అతీతంగా దేశ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని పార్టీ సంకుచిత ధోరణులతో కాకుండా తగిన వ్యక్తిని వెతకవలసిన బాధ్యతను పూర్తిగా విస్మరించింది.

ప్రస్తుతం ప్రతిభా పాటిల్ సోనియా ఎంపిక చేసిన మహిళా నాయకురాలు. ఆమె ఎన్నిక కావడం ఖాయం. ఈ దేశానికి మొదటి మహిళా రాష్ట్రపతిగా ఆమె చరిత్రలో నిలిచిపోతారు. కాని ఆమె పేరు తెరమీదికి వచ్చిన తీరు, అందులో సాగిన వేగం, అంతకుముందు అనుకున్న శివరాజ్ పాటిల్‌నూ ప్రణబ్ ముఖర్జీనీ వ్యతిరేకించిన పద్ధతి సక్రమం కాదు. పత్రికలు, ఇతర మాధ్యమాలు ఆమె గతాన్ని తవ్వి ఆమె అధికారాల నిర్వహణ శైలి ఏమిటో జనం ముందు ఉంచారు. సహకార బ్యాంకు రుణాలు తన వారికి ఇప్పించుకున్న ఆశ్రిత పక్షపాతం గురించి రాసారు. ఆమె నామినేషన్ తిరస్కరించాలని సుప్రీంకోర్టులో ఆర్టికల్ 32 కింద వేసిన రిట్ పిటిషన్‌ను ఆరోపణలకు ఆధారాలు లేవని కొట్టివేసింది. ఇవి ఇప్పుడు కాకపోతే తరువాత రుజువు చేసుకునే అవకాశం ఉంది. కాని ఆ సమయానికి ఆమె రాష్ట్రపతి అవుతారు. అప్పుడు ఆమెపైన క్రిమినల్, సివిల్ కేసులు పెట్టడానికి వీలులేదు. ఆర్టికల్ 361(2) ప్రకారం అంతకుముందున్న క్రిమినల్ కేసులు కొనసాగవు. కొత్తవి పెట్టరాదు. 361(3) ప్రకారం అరెస్ట్ చేయడానికి వీల్లేదు. ఎందుకంటే రాష్ట్రపతి పదవిలో ఉండి కూడా క్రిమినల్ కోర్టుల చుట్టూ తిరిగుతూ ఉంటే అంతకన్నా దేశానికి మరో అప్రతిష్ఠ ఉండక పోవచ్చు. నిజానికి క్రిమినల్ కేసు పెట్టవలసిన పరిస్థితిలో రాష్ట్రపతి ఉంటే ఆ పదవినుంచి వెంటనే దిగిపోక తప్పదు. ఒకవేళ ప్రతిభాపాటిల్‌పై ఆరోపణలు రుజువైతే ఆమె ఆ పదవికి మినహాయింపును వాడుకోవడం కాదు. ఆ పదవిలో కొనసాగే నైతిక అర్హత కోల్పోతారు. ప్రజాభిప్రాయానికి తలొగ్గి రాజీనామా చేయక తప్పని పరిస్థితి వచ్చి తీరుతుంది. అప్పుడు రాష్ట్రపతి ఎన్నిక మళ్లీ జరిపించవలసి ఉంటుంది. అది అనవసరం వృథా ఖర్చు మాత్రమే కాదు తీవ్రమయిన అప్రతిష్ఠ. కాంగ్రెస్ కానీ, మిత్రపక్షాలు కానీ ఈ విషయం గమనించకపోవడం, సుప్రీంకోర్టు ముందుకు ఈ అంశాలు తీసుకు వెళ్లకపోవడం ఆశ్చర్యంగా ఉంది.

**దేశవ్యాప్తంగా గనుల తవ్వకాల పథకాల మూలంగా ఎంతో మంది ఆదివాసులు నిర్వాసితులయ్యారనీ, వీరెవ్వరికీ పునరావాసం కల్పించిన దాఖలాలు లేవనీ అంటున్నారు జి. రమేష్**

# బాక్సైట్ తవ్వకాలు - ఆదివాసుల జీవన విధ్వంసం

ఆదివాసీలు మైనింగ్ కంపెనీలను కోతులుగా చెప్పుకుంటారు. ఈ కొండల్లో గనులున్నంతకాలం పంటలు పాడుచేసే కోతుల్లా ఈ కంపెనీలు కూడా తమ వనరులను కాజేసి జీవన ప్రశాంతతను దెబ్బ తీసేందుకు ఎంత తరిమినా వస్తూనే ఉంటాయని వారి ఉద్దేశం. గతంలో బిర్లా కంపెనీ, దుబాయ్, ఇతర ప్రైవేట్ కంపెనీలూ విశాఖ మన్యంలో అడుగుపెట్టేందుకు ప్రయత్నించి ఆదివాసీల ప్రతిఘటనతో వెనుదిరిగాయి. తాజాగా జిందాల్ కంపెనీ విశాఖ మన్యంలోని బాక్సైట్ గనులపై కన్నేసింది. అధికారంలోకి వచ్చిన ఏ రాజకీయ పార్టీ అయినా విశాఖ మన్యంలోని బాక్సైట్ ఖనిజ నిల్వలను వెలికితీసి, ఖజానాలో కాసులు నింపాలని ప్రయత్నిస్తుంది. ఐదేళ్ల క్రితం తెలుగుదేశం ప్రభుత్వం దుబాయి కంపెనీకి ఇక్కడ బాక్సైట్ గనులు లీజుకిచ్చేందుకు ప్రయత్నించింది. అప్పట్లో ఆదివాసీలు, ప్రజాసంఘాలు సమైక్యంగా ఉద్యమించగా తెలుగుదేశం ప్రభుత్వం తన ప్రయత్నాలు విరమించుకుంది. ఇప్పుడు మళ్లీ కాంగ్రెస్ ప్రభుత్వం జిందాల్ కంపెనీతో కుదుర్చుకున్న ఒప్పందం మూలంగా ఏజెన్సీలోని ఆదివాసీలకు అభద్రతాభావం, చెప్పుకోలేని అయోమయం కలుగుతుంది. ఆదివాసీల హక్కుల సంరక్షణకు కవచంలా నిలుస్తున్న వన్ ఆఫ్ సెవంటీ చట్టాన్ని కాదని ప్రభుత్వం దొడ్డిదారిన జిందాల్‌కు ఇక్కడి వనరులను ధారాదత్తం చేసేందుకు ప్రయత్నిస్తోంది. తాత్కాలికమైన వాణిజ్య ప్రయోజనాల కోసం ఆదివాసీల దైనందిన జీవితంలో సామాజిక, ఆర్థిక, న్యాయ, పర్యావరణపరంగా అసమానతలను సృష్టించడానికి ప్రభుత్వం వెనుకాడడం లేదు. బాక్సైట్ తవ్వకాలు వేలమంది ఆదివాసీలను నిర్వాసితులుగా మార్చి పర్యావరణ సమతుల్యాన్ని దెబ్బతీస్తాయి. ఒక్క ఆదివాసీ ప్రాంతాలపై కాకుండా మైనింగ్ ప్రభావం దిగువ మైదాన ప్రాంతాలపైనా ఉంటుంది. బాక్సైట్ తవ్వకాల మూలంగా కొండల్లో నుంచి ప్రవహిస్తున్న మాచ్‌ఖండ్, గోస్తని, తాండవ, శారద తదితర నదులపై తీవ్ర ప్రభావం ఉంటుంది. ప్రభుత్వ ప్రయత్నం నేరవేరితే ఈ నదులపై ఆధారపడ్డ ప్రజలు సాగునీరు, తాగునీటి వనరులను శాశ్వతంగా కోల్పోయే ప్రమాదం ఉంది.

---

## రాష్ట్రపతి నిజానికి రబ్బర్ స్టాంప్ కాదు

ఎన్నికయ్యే రాష్ట్రపతి ఉండడమే రిపబ్లిక్ లక్షణం. రాజ్యాంగ సంవిధానాన్ని రక్షిస్తానని ప్రమాణం చేసే ఏకైక గణతంత్ర రాజ్యాధినేత రాష్ట్రపతి. మిగిలినవారు రాజ్యాంగం పట్ల విధేయులమని ప్రమాణం చేస్తారు. "నేను అత్యంత విశ్వాసపాత్రుడినై రాష్ట్రపతి విధులు నిర్వహిస్తాను. నా పూర్తి శక్తిని వినియోగించి రాజ్యాంగ సంవిధానాన్నీ, శాసనాన్నీ కాపాడి, రక్షించి, అండగా నిలబడతాను. భారత ప్రజల సంక్షేమానికీ సేవకూ నన్ను నేను అంకితం చేసుకుంటానని ప్రమాణం చేస్తున్నాను..." అంటూ రాష్ట్రపతి ప్రమాణం చేయాలని ఆర్టికల్ 60 స్పష్టంగా చెప్పింది.

మన సంవిధానం ప్రకారం, రాష్ట్రపతికి సమున్నతమైన అధికారాలు ఉన్నాయి. పార్లమెంట్‌కు అగ్రశిఖరం. ప్రధానిని, ప్రధాన న్యాయమూర్తిని నియమించి పదవీస్వీకారం చేయించే నేత, సర్వ సైన్యాధ్యక్షుడు. ఎంతటి నిర్ణయాన్నయినా సరే పునఃపరిశీలించమని తిప్పి పంపే అధికారాలున్నాయి. రాజ్యాంగ వివాదం ఏర్పడినప్పుడు సుప్రీం కోర్టు సలహా కోరే అధికారం, అంతకు ముందు తన అటార్నీ జనరల్‌ను అడిగే అధికారం, ప్రధాన మంత్రిని రప్పించి వివరాలు కోరే అధికారం, రాష్ట్రాలలో తన ప్రతినిధులయిన గవర్నర్‌ల నుంచి కావలసిన సమాచారం తెప్పించుకునే అధికారం రాష్ట్రపతికే ఉంది. అధికారాలున్నాయి. ఎదురులేని ఆధిపత్యం ఉంది. రాజ్యాంగ సూత్రాలనూ విలువలనూ రక్షించడానికి తగిన అవకాశాలు రాష్ట్రపతి అందిపుచ్చుకోవచ్చు.

అన్నింటికి మించి సంకీర్ణ ప్రభుత్వాల యుగంలో ప్రధానమంత్రిగా పదవీ స్వీకారం చేయడానికి ఆహ్వానించే అధికారం చాలా కీలకమయింది. మొరార్జీ దేశాయ్ నాయకత్వంలోని జనతా పార్టీ సంకీర్ణం నుంచి చీలిపోయిన చరణ్‌సింగ్‌ను 1979లో ప్రధానిగా ఆహ్వానించడం, జగ్‌జీవన్‌రాంకు ఆ అవకాశం నిరాకరించడం రాష్ట్రపతిగా శ్రీ నీలం సంజీవరెడ్డి పాత్రను ఇప్పటికీ వివాదాస్పదం చేసింది. ఇన్ని అధికారాలున్న ఒక మహోన్నతమయిన పీఠం గురించి సరైన ఆలోచన లేకపోవడం, కొలమానం లేకపోవడం, రాజ్యాంగం పట్ల రాజకీయ నాయకులు తీవ్రమైన అన్యాయం చేయడమే. ◆

బాక్సైట్ గనుల తవ్వకాలు కనుక జరిగితే ప్రతిపాదిత ఆదివాసీ ప్రాంతాల్లో గ్రామాలను పూర్తిగా తరలించాలి. అది వారి జీవనంపై తీవ్ర ప్రభావాన్ని చూపుతుంది. ఇప్పటికే దేశవ్యాప్తంగా మైనింగ్ ప్రాజెక్ట్‌ల మూలంగా 25.5 లక్షలమంది ఆదివాసీలు నిర్వాసితులయ్యారు. వీరెవరికీ పునరావాసం కల్పించిన దాఖలాలు లేవు. ప్రభుత్వం ఆదరాబాదరాగా ఏజెన్సీలో మైనింగ్ కాలేజీలను ఏర్పాటు చేస్తామని ప్రకటించడం ప్రజలను పూర్తిగా తప్పుదోవ పట్టించడమే. ఏజెన్సీలో ప్రభుత్వ నిర్లక్ష్యం మూలంగా నిరుపేద ఆదివాసీ నిరుద్యోగ యువత ఉపాధి కోసం ఏళ్ల తరబడి ఎదురుతెన్నులు చూస్తోంది. అలాంటప్పుడు పూర్తి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన మైనింగ్, ఇంజనీరింగ్ కోర్సులను పూర్తి చేసి మైనింగ్ కంపెనీలో ఉద్యోగాలు పొందడం జరిగే పనేనా? నాల్కోతో సహా ఇతర మైనింగ్ కంపెనీల్లో ఉద్యోగుల సంఖ్య మూడు వందలలోపు ఉంటుంది. అందులో ఇతర ప్రాంతాల నుంచి దిగుమతి చేసుకున్న ఇంజనీర్లు, టెక్నీషియన్లు, టిప్పర్, పొక్లెయిన్ డ్రైవర్లు మినహాయిస్తే స్థానిక ఆదివాసీ జనం ఎంతమందికి ఉద్యోగాలు వస్తాయి? ఈ లెక్కన పదివేల మందికి ఉద్యోగాలు వస్తాయని చెప్పే ప్రభుత్వం మాటలు గాలిలో మేడలు కట్టడమే.

ఈ బాక్సైట్ తవ్వకాలు స్థానిక ఆదివాసీల ఆర్థికాభివృద్ధికి దోహద మవుతుందని ప్రభుత్వం గోబెల్స్ ప్రచారానికి పూనుకుంది. దేశంలో బాక్సైట్‌గనుల పరిశ్రమలు ఉన్న ప్రాంతాల్లో స్థానికులు నిర్మాణ సమయం లో కేవలం రోజువారి కూలీలుగా జీవనం సాగించి, అనంతరం భూమి, గూడులేని వలసకూలీలుగా పట్టణాలకు తరలిపోతున్న పరిస్థితిఉంది. ఇప్పటికే మైనింగ్ ప్రాజెక్ట్‌ల మూలంగా ఒరిస్సా రాష్ట్రంలో ఆదివాసీల జీవనగమనంలో ఆర్థికంగా, సామాజికంగా ఎన్నో మార్పులు వచ్చిన అనేకమంది ఆదివాసీలు విశాఖ ఏజెన్సీకి వలసవచ్చి పోడుపై ఆధారపడి జీవనం సాగిస్తున్నారు. మైనింగ్ కంపెనీల మూలంగా ఇతర ప్రాంతాల నుంచి ఉద్యోగరీత్యా వలస వచ్చేవారి మూలంగా ఎచ్.ఐ.వి. వంటి భయంకరవ్యాధులు, మద్యపానం, సామాజిక అంతరాలు, హింస, అత్యాచారాలు వంటి సమస్యలు ఉత్పన్నమయ్యే అవకాశం ఉంది.

కొండల ఆరోగ్యమే పల్లపు ప్రాంతాల సౌభాగ్యం. విశాఖ జిల్లా కొండల్లో పుట్టి జిల్లాలో ప్రవహిస్తున్న మాచ్‌ఖండ్, సీలేరు, గోస్తని, తాండవ, శారద తదితర నదులు విశాఖ నగరంతోపాటు జిల్లా ప్రజలనూ, రైతులనూ ఆదుకుంటున్నాయి. బాక్సైట్ నిక్షిప్తమై ఉన్న కొండల్లో భూమి ఉపరితలంపై తవ్వకాల మూలంగా నీరు ఇంకేందుకు అనువుగా ఉన్న పై పొర పూర్తిగా తొలగిపోతుంది. దీంతో అవి నీరు ఇంకలేని నేలలుగా మారతాయి. అక్కడ నీరు ఇంకని పరిస్థితుల్లో నది పరీవాహకాల రూపురేఖలు మారి ఈ నదులన్నీ ఎండిపోవడంతో పాటు కాలుష్య జలాలు పెరిగిపోయే ప్రమాదం ఉంది. అదే జరిగితే ఇప్పటికే నీటి కష్టాలను ఎదుర్కొంటున్న విశాఖ, అనకాపల్లి, నర్సీపట్నం తదితర ప్రాంతాల ప్రజలు, రైతుల పరిస్థితి ఏంటి? మైనింగ్ మూలంగా తూర్పు కనుమల్లోని అరుదైన వన్యప్రాణులు, వృక్షజాతులు అంతరించే ప్రమాదమూ ఉంది.

బాక్సైట్ శుద్ధికర్మాగారాల్లో నీరు, విద్యుత్ అవసరం చాలా ఎక్కువ స్థాయిల్లో ఉంటుంది. దీని కోసం తాండవ, తాటిపూడి జలాశయాల నుంచి నీరు, సీలేరు, మాచ్‌ఖండ్ విద్యుత్‌కేంద్రాల నుంచి విద్యుత్ సరఫరా చేయొచ్చని ప్రభుత్వ ఆలోచన. రైతులకు, ప్రజలకు తాగునీటి అవసరాలకు నీరు, విద్యుత్ ఇప్పటికే సక్రమంగా అందని పరిస్థితుల్లో వారి వనరులను ప్రభుత్వం ప్రైవేట్ కంపెనీలకు ధారాదత్తం చేయడం న్యాయమా?

5వ షెడ్యూల్ ప్రాంతాల్లో మైనింగ్ లీజులు పొందే అర్హత కేవలం ప్రభుత్వానికీ ప్రభుత్వరంగ సంస్థలకూ, స్థానిక (ఆదివాసీ) సొసైటీలకూ మాత్రమే ఉందని రాజ్యాంగంలో పొందుపరచి ఉంది. ఈ హక్కులను సుప్రీం కోర్టు సమత జడ్జిమెంట్‌లో పునరుద్ఘాటించింది. అంతే కాకుండా ప్రభుత్వాన్ని కూడా ఆదివాసీ ప్రాంతాల్లో ప్రైవేట్ వ్యక్తిగానే అంటే ఆదివాసేతరుని గానే పరిగణించాలని తీర్పు చెప్పింది. ఈ లెక్కన ఆదివాసీ ప్రాంతంలో జిందాల్ కంపెనీ, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌కు చెందిన రస్-ఆల్-ఖైమా కంపెనీలు గనులు లీజు పొందే అవకాశం లేదు. కనుకనే ఆంధ్రప్రదేశ్ ఖనిజాభివృద్ధి సంస్థ (ఎ.పి.ఎం.డి.సి) ద్వారా మన్యంలో బాక్సైట్ తవ్వకాలను చేపట్టడానికి ప్రభుత్వం దొడ్డిదారిన ప్రయత్నిస్తోంది. ఎ.పి.ఎం.డి.సి ని అడ్డుపెట్టు కొని ప్రైవేట్ కంపెనీలే (జిందాల్, రస్-ఆల్-ఖైమా) మైనింగ్ చేస్తాయనడంలో ఎలాంటి సందేహంలేదు. ఈ తతంగమంతా ఆదివాసీ చట్టాల నుంచి తప్పించుకోవడానికి కాదా?

జిందాల్, రస్-ఆల్-ఖైమాలతో రాష్ట్ర ప్రభుత్వం ఒప్పంద పత్రం కుదుర్చుకున్న తీరు చూస్తుంటే ప్రభుత్వం పారదర్శకత లేకుండా వ్యవహరిస్తున్న విషయం స్పష్టమౌతుంది. ప్రజల మనోగతం తెలుసు కోకుండా, కనీస సమాచారంలేకుండా ప్రభుత్వం ఏకపక్షంగా వ్యవహరిం చడం అన్యాయం, అప్రజాస్వామికం. మైనింగ్ ఎంత విస్తీర్ణంలో ఎక్కడ చేస్తారో, పరిశ్రమ ఎక్కడ స్థాపిస్తారో చెప్పకుండా, ప్రాజెక్ట్ ప్రణాళిక లేకుండా, పర్యావరణ ప్రభావనివేదికలు రూపొందించకుండా, ఆదివాసీల నిర్వాసిత పునరావాస విషయాలు పరిగణనలోకి తీసుకోకుండా, పర్యావరణ అనుమతులు లేకుండా ప్రభుత్వం ఒప్పంద పత్రం కుదుర్చు కోవడం ఎవరిని ఉద్ధరించడానికి? ఈ ఒప్పందం ఆదివాసీలను నష్ట పెట్టడానికే కాని మేలు చేకూర్చేందుకు ఎంత మాత్రం కాదు. బాక్సైట్ తవ్వకాల మూలంగా సామాజిక, ఆర్థికపరిస్థితులరీత్యా, న్యాయ పర్యావరణపరంగా ప్రజలకు నష్టం కలిగే పరిస్థితి ఉన్నందున బాక్సైట్ తవ్వకాలను ఆదివాసీలంతా వ్యతిరేకిస్తున్నారు. బాక్సైట్ లాంటి వినాశకర ప్రాజెక్ట్‌ల విషయంలో ప్రజల అభిప్రాయాలను ప్రభుత్వాలు పరిగణనలోకి తీసుకోకుండా ప్రభుత్వం తన ఇష్టమొచ్చినట్టుగా వ్యవహరించడం అన్యాయం. ఇప్పటికైనా స్థానికులకు ప్రయోజనం చేకూర్చే అభివృద్ధే నిజమైన అభివృద్ధిగా ప్రభుత్వం గుర్తించాలి. ప్రగతి అంటే ప్రజలను నిర్వాసితులను చేయడం కానే కాదు. ఇప్పటి వరకూ వివిధ ప్రాజెక్ట్‌ల మూలంగా నిర్వాసితులయిన వారికి న్యాయమైన పునరావాసం కల్పించి ప్రభుత్వ చిత్తశుద్ధిని చాటుకుంటే మేలు. జిందాల్, రస్-ఆల్-ఖైమాలతో కుదుర్చుకున్న ఒప్పందాన్ని ప్రభుత్వం రద్దు చేసుకుని, స్థానికులు కోరుకున్న నిజమైన అభివృద్ధి ప్రాజెక్ట్‌లను అమలు చేయాలి. అప్పుడే ప్రకృతి సంపద మనతోపాటు భావితరాలను ఆదుకుంటుంది. వ్యవసాయ, సహజవనరుల ఆధారిత ప్రాజెక్ట్‌లు ఏర్పాటుచేస్తే పర్యావరణ నాశనం జరగకుండా స్థానికులు అభివృద్ధి చెందే అవకాశం ఉంది. ◆

సామాజిక, ఆర్థికవ్యవస్థ స్వరూప స్వభావాల మీద ఏర్పరచుకున్న అవగాహనను బట్టే రాజకీయ వ్యూహం నిర్ణయమవుతుందంటున్నారు **ఎం. కోదండరాం**

# భారత దేశ ఆర్థిక వ్యవస్థ స్వరూప స్వభావాలు

**భా**రత దేశ సామాజిక – ఆర్థిక వ్యవస్థ స్వభావం మీద 1947 నుండి చర్చ సాగుతున్నది. అయితే ఒక్కో దశలో ఒక్కో అంశానికి చర్చలో ప్రాధాన్యత లభించింది. భారతదేశంలో ఇంకా భూస్వామ్య సంబంధాలు కొనసాగుతున్నాయా లేక పెట్టుబడిదారీ సంబంధాలు అంకురించాయా అన్న విషయం పైన 1970 నుండి తీవ్రమైన వాదోపవాదాలు సాగుతున్నాయి.

ఇది మేధావులకు సంబంధించిన వివాదం కాదు, పండిత గోష్ఠి కాదు. వివిధ రాజకీయ కార్యకర్తలే చర్చలో కీలక పాత్ర వహించారు. ఎందుకంటే సామాజిక, ఆర్థిక వ్యవస్థ మీద ఏర్పరచుకున్న అవగాహనను బట్టే రాజకీయ వ్యూహం నిర్ణయమౌతుంది. అందుకే సామాజిక ఆర్థిక వ్యవస్థపైన చర్చ ఒక రాజకీయ వివాదంగానే సాగుతున్నది.

దేశాన్ని ఒక భూస్వామ్య వ్యవస్థ అనటానికి మూడు కారణాలను చూపిస్తున్నారు.

1. ఇంకా భారతదేశం వ్యవసాయ ప్రధాన దేశంగా ఉంది. భూమి కొద్దిమంది చేతిలో కేంద్రీకృతమైంది. భూస్వాములు ఆర్థికేతరమైన సాధనాల ద్వారా ఆధిపత్యాన్ని చెలాయిస్తున్నారు. భూస్వామ్య దోపిడీ రూపాలు కొనసాగుతున్నాయి. కొల్లగొట్టిన మిగులును పెట్టుబడిగా పెట్టడం లేదు. దాన్ని సౌఖ్యవంతమైన జీవనం కోసం ఖర్చు చేస్తున్నారు. పెట్టుబడిదారీ సంబంధాల విస్తృతికి పెట్టిన పెట్టుబడి దోహదపడటం లేదు.
2. ఉత్పత్తి సాంప్రదాయక పద్ధతుల్లో సాగుతోంది. ఆధునిక సాంకేతిక పరికరాలు, సాంకేతిక పరిజ్ఞానం పరిమితంగానే వాడుకలోకి వచ్చాయి. ఉత్పత్తి శక్తులలో ఎదుగుదలలేదు.
3. భూస్వామ్య సంస్కృతి జీవన విధానాన్ని శాసిస్తోంది. కుల వ్యవస్థ, మతపరమైన ఆచారాలు ఇందుకు తార్కాణం.

భూస్వామ్య వ్యవస్థ అంతమైంది. పెట్టుబడిదారీ సంబంధాలు పెంపొందుతున్నాయని భావించే వారు ఇస్తున్న వివరణ ఇలా ఉన్నది.

1. వ్యవసాయంలో వ్యాపారీకరణ బాగా పెరిగిపోయింది. క్రమంగా మార్కెట్ కొరకు పండించే పంటల పరిమాణం పెరుగుతోంది.
2. బూర్జువా ఉదారవాద చట్టాలు, వ్యవస్థలు కూడా ఉనికిలోకి వచ్చాయి. ఈ వ్యవస్థలు వ్యక్తిగత ఆస్తి, పెట్టుబడిదారీ ఉత్పత్తికి కావలసిన భూమికను ఏర్పాటు చేశాయి.
3. ఇంకా ఫ్యూడల్ సంస్కృతి ఉంటే అది గత సమాజపు అవశేషం మాత్రమే. క్రమంగా అంతరించిపోతుంది. అంతేకాని దాన్ని ఆధారం చేసుకొని భారతదేశాన్ని ఫ్యూడల్ సమాజమని చెప్పకూడదు.

రెండు వాదనలు కూడా ప్రధానంగా మూడు దృక్పథాల ప్రాతిపదికన పెంపొందాయి. అందులో మొదటిది సాంస్కృతిక వాదం. సాంస్కృతిక వాదం సాంస్కృతిక అంశాల ఆధారంగా ఉత్పత్తి వ్యవస్థను వివరిస్తుంది. సంస్కృతికి స్వయం ప్రతిపత్తి ఉండదు. భౌతిక పునాది మీద సంస్కృతి పెంపొందుతుంది. అయితే సాంస్కృతిక అంశాలకు సాపేక్షిక స్వతంత్రత ఉంటుంది. భౌతిక పునాది మారగానే వెంటనే సంస్కృతి మారాలని లేదు. అదే విధంగా సాంస్కృతిక రంగంలో వచ్చే మార్పుల స్వభావాన్ని పూర్తిగా భౌతిక పునాది శాసించదు. ఆయా సమాజాల చారిత్రక పరిస్థితులను బట్టి సాంస్కృతిక రంగంలో మార్పులు వస్తుంటాయి. సమాజాన్ని విరించేటప్పుడు సాంస్కృతిక కారకాలను పరిగణనలోనికి తీసుకోవాలి. అయితే అవి ఉత్పత్తి వ్యవస్థ నిలబడటానికి, సాగటానికి ఏ విధంగా దోహదపడుతున్నాయో చూడాలి. అంతే కాని ఉత్పత్తి వ్యవస్థ నుండి విడిగా సాంస్కృతిక అంశాలను పరిగణించడానికి వీలులేదు.

ఇక – రెండవ దృక్పథం ఉత్పత్తి శక్తుల వాదం. ఉత్పత్తి శక్తుల వాదం ప్రకారం సామాజిక మార్పు ఉత్పత్తి శక్తుల ఎదుగుదలతో దానంతట అదే వస్తుంది. ఆ మార్పులను నిర్దేశించడంలో మనిషికి ఎటువంటి పాత్ర ఉండదు. ఈ దృక్పథాన్ని మావో సాంస్కృతిక విప్లవ కాలంలో నిశితంగా విమర్శించారు. స్టీలు, విద్యుత్తు ఉత్పత్తి పెరిగితే సోషలిజం వస్తుందని పేర్కొన్న స్టాలిన్ రచనలను ప్రస్తావించి ఉత్పత్తి పెరిగితే సోషలిజం వస్తుందనడం భావవాదమేనంటాడు. వ్యవస్థలు వాటంతటవే నడుస్తాయనుకోవడం భావవాదమే. స్టాలిన్ ప్రతిపాదనను సరిచేసి సోవియట్ కమిటీల ద్వారా ఉత్పత్తిని పెంచగలిగినప్పుడే సోషలిజం వస్తుందంటాడు. మావో దృక్పథాన్ననుసరించి ఏ వర్గాలు ఉత్పత్తిని నియంత్రిస్తున్నాయి, ఏ వర్గాలు ఉత్పత్తి చేస్తున్నాయి, ఏ పద్ధతుల

ద్వారా ఉత్పత్తి జరుగుతున్నది అన్న అంశాలను పరిగణనలోకి తీసుకోకుండా ఉత్పత్తి వ్యవస్థను వివరించలేం.

ఇక మూడవ దృక్పథం అనుభవతావాదం. మనం అనుభవ పూర్వకంగా, పంచేంద్రియాల ద్వారా సేకరించిన సమాచారం మాత్రమే వాస్తవమని అనుభవతావాదం అంటున్నది. అంతకు మించిన వాస్తవం లేదు. ఈ దృక్పథాన్ని అనుసరిస్తే నలుగురు గుడ్డి వాళ్లు ఏనుగును చూసినట్టుంటది. సార్వజనీనమైన సత్యాన్ని చూడటం కష్టమే. మనం చూస్తున్న వాస్తవాన్ని అర్థం చేసుకోవాలంటే వ్యవసాయ రంగాన్నే కాదు, పారిశ్రామిక రంగాన్నీ, విదేశీ మార్కెట్లనూ, రాజకీయ పార్టీల కార్యకలాపాలనూ, ప్రభుత్వ విధానాలనూ పరిగణలోనికి తీసుకోవాలి. అంతే కాదు, వాస్తవమనేది నిర్దిష్ట ప్రాపంచిక దృక్పథం వెలుగులోనే కనబడుతుంది. ఉదాహరణకు ఆదివాసీలకు అడవి జీవిక, జీవనాధారం. అదే ప్రభుత్వానికి కేవలం రెవెన్యూ. మనమెంచుకునే దృక్పథం మన అవగాహనను శాసిస్తుంది. కాబట్టి అనుభవతా వాదాన్ని వదులుకోకుండా లోతైన అవగాహన కూడా పెంపొందదు.

పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చేసిందన్న వాళ్లు కానీ, కాదు ఫ్యూడలిజం ఇంకా కొనసాగుతుందన్న వాళ్లు కానీ చాలా వరకు పైన పేర్కొన్న మూడు దృక్పథాలలో ఏదో ఒక దానిని అనుసరిస్తున్నారని గ్రహించాలి. వాటిని విడనాడితే తప్ప ఉత్పత్తి వ్యవస్థ సమగ్ర స్వరూపాన్ని ఆవిష్కరించడం సాధ్యం కాదు.

భారతదేశంలో నేడు నెలకొన్న సామాజిక – ఆర్థిక వ్యవస్థను వివరించడం కష్టమైన విషయమే. ఎందుకంటే శుద్ధమైన ఫ్యూడల్ వ్యవస్థ మనదేశంలో లేదు. గత నాలుగు వందల సంవత్సరాల కాలంలో అది మార్పు చేర్పులకు లోనైంది. ఉత్పత్తి వ్యాపారీకరణ చెందింది. కనుక ఈ సామాజిక – ఆర్థిక వ్యవస్థ సంక్లిష్టమైంది.

ఈ సంక్లిష్టమైన వ్యవస్థను అర్థం చేసుకోవడానికి దిగువ అంశాలను పరిగణనలోనికి తీసుకోవాలి. ఉత్పత్తి సాధనాలను ఎవ్వరు నియంత్రిస్తున్నారు. వాటిని ఉపయోగించి ఉత్పత్తి చేసేదెవ్వరు, ఈ ఇద్దరికీ మధ్యనున్న సంబంధమేమిటి అన్న విషయాలను సామాజిక వ్యవస్థను అర్థం చేసుకోడానికి తప్పనిసరిగా పరిగణనలోనికి తీసుకోవాలి.

ఫ్యూడల్ సమాజాలలో భూమితోపాటు, శ్రామికులను కూడా భూస్వామి ఆస్తిగా పరిగణిస్తారు. శ్రామికులు భూస్వామి చెప్పుచేతల్లో ఉండాలి. భూస్వామికి ఉత్పత్తి చేసి తాము బతకడానికి కావలసిన జీవన భృతిని పొందుతారు. అయితే ఫ్యూడల్ సమాజ లక్షణాలు ఒక్కో దేశంలో, ఒక్కో రూపంలో ఉండేవి. బ్రిటిష్ రాకపూర్వం భారతదేశంలో భూస్వామికి భూమిపై యాజమాన్యపు హక్కు ఉండేది కాదు. భూస్వామి శిస్తు వసూలు చేసే అధికారం కలిగి ఉండేవాడు. ఈ హోదా ద్వారా వ్యవసాయంలో మిగులును పొందేవాడు, వ్యవసాయమే కాక వివిధ వృత్తులు వ్యవసాయం పైన ఆధారపడి ఉండేవి. ఈ శ్రమ విభజనను వాటి మధ్య వనరుల పంపిణీని కులవ్యవస్థ నిలబెట్టింది. అయితే బ్రిటిష్ వాళ్లు ప్రవేశించిన తరువాత శిస్తు వసూలు చేసే అధికారులు యజమానులైపోయారు. వృత్తులు దెబ్బతిని వ్యవసాయం పైన ఆధారపడి బతికే వారి సంఖ్య క్రమంగా పెరిగింది. ఈ నేపథ్యంలో వ్యవసాయ ఉత్పత్తి అంతర్జాతీయ మార్కెట్లతో అనుసంధానం అయింది. మార్క్స్ అన్నట్టు వ్యాపారం, మార్కెట్లు, పెట్టుబడి పెట్టుబడిదారీ వ్యవస్థకు సూచికలు కావు. ఈ మూడు అన్ని సమాజాలలోనూ కనిపిస్తాయి. ఎప్పుడైతే అవి ఉత్పత్తిని ప్రభావితం చేస్తాయో, అప్పుడే పెట్టుబడిదారీ వ్యవస్థ రూపొందినట్టుగా భావించాలి. నిర్దిష్ట సామాజిక సంబంధాలలో మాత్రమే పెట్టుబడి ఉత్పత్తిని ప్రభావితం చేస్తుంది.

వలసపాలన కాలంలో మార్కెట్లకు ఉత్పత్తి జరిపే క్రమం ఆర్థికేతర ఆధిపత్యాన్నీ, ఫ్యూడల్ దోపిడినీ తీవ్రతరం చేసింది. బ్రిటిష్ వారు తమ పాలనను నిలబెట్టుకోడానికి భూస్వాముల పైన ఆధారపడ్డారు. భూమిపై బ్రిటిష్ పాలకులు కల్పించిన యాజమాన్యపు హక్కులు భూస్వాములకు తోడ్పడినాయి. సాంప్రదాయక నియమాల ప్రకారం ఉత్పత్తి చేసుకొనే వారికి భూమిపై హక్కులు సంక్రమిస్తాయి. ఆ హక్కులు రద్దయిపోయాయి. కొత్తగా చట్టబద్ధమైన హక్కు పొందాలంటే విధిగా శిస్తు కట్టాలి. శిస్తు కట్టలేక చాలామంది భూమిని వదులుకున్నారు. ముఖ్యంగా 1930 తరువాత ఈ ప్రక్రియ వేగవంతమైంది. భూమి కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతమైంది. తత్ఫలితంగా భూస్వాములు లబ్ధిపొందారు. భూమిని పొందడమే కాక లాభసాటి వాణిజ్య పంటలు పండించడానికి భూస్వాములు వెట్టి దోపిడీని తీవ్రతరం చేశారు. భూస్వాములకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు దేశమంతటా తీవ్రతరమయ్యాయి. ఈ తిరుగుబాట్లు స్వాతంత్రోద్యమాన్ని బలోపేతం చేశాయి.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం బ్రిటిష్ పాలనను నిలబెట్టిన జమీందారీ, జాగిర్దారీ వ్యవస్థను రద్దు చేసింది. జమీందారీ వ్యతిరేక ఉద్యమాలలో కీలకపాత్ర వహించిన వర్గాల బలాబలాలను బట్టి, కాంగ్రెస్‌తో వారికి ఏర్పడిన సంబంధాన్ని బట్టి నూతన వర్గాల ఆవిర్భావం జరిగింది. ఈ మార్పు అన్ని ప్రాంతాల్లో ఒకే మాదిరిగా రాలేదు. ఒక్కొక్క ప్రాంతానికి వైవిధ్యత ఉంది. అయితే జమీందారీ రద్దుతో పూర్తిగా పెట్టుబడిదారీ సంబంధాలు కూడా ఏర్పడ లేదు. కుల వ్యవస్థ ప్రాతిపదికగా ఏర్పడిన శ్రమ విభజన కొనసాగింది. ఏకకాలంలో వివిధ గ్రామాలపైన పెత్తనం చెలాయించిన జమీందార్ల స్థానే చిన్న భూస్వాముల అధికారం చేబట్టారు. ప్రభుత్వం చేసిన అభివృద్ధి వ్యయం ఈ వర్గాలకే తోడ్పడింది. స్థానిక స్వపరిపాలనా వ్యవస్థలు కూడా ఈ వర్గాల పెత్తనాన్ని వ్యవస్థితం చేసాయి.

1970లలోనే ఈ పరిస్థితిలో మార్పులు వచ్చాయి. అమెరికా అవసరానికి, దేశీయ ఆహారధాన్యాల కొరతను నివారించడానికి ప్రవేశ పెట్టిన హరిత విప్లవం, ఇందిరాగాంధీ ప్రజాకర్షక విధానాలు, దేశంలో వివిధ ప్రాంతాల్లో వచ్చిన ప్రజా ఉద్యమాలు మార్పుకు దోహదపడినాయి. కుల వ్యవస్థ ఆధారిత శ్రమ విభజన, జీతగాళ్ల వ్యవస్థ పతనం కావడంతో అంతవరకు కొనసాగిన గ్రామీణ సంబంధాలలో మార్పులు వచ్చాయి.

వెట్టి అంతమైంది. అంతవరకు కొనసాగిన కుల ఆధారిత శ్రమ విభజన బలహీనపడింది. భూకేంద్రీకరణ లేదు. పెత్తందార్ల సామాజిక, ఆర్థిక అధికారం తగ్గిపోయింది. వ్యాపారీకరణ బాగా పెరిగిపోయింది. ధనిక రైతాంగవర్గం ఆవిర్భవించింది. ఈ మధ్య జరిగిన చాలా అధ్యయనాలు ఈ విషయాలను ధృవీకరిస్తున్నాయి. ఈ మార్పులను ఎలా వివరించాలన్నదే ప్రధాన సమస్యగా మారింది.

వ్యాపారీకరణను, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వాడకాన్ని

చూపించి దేశంలో పెట్టుబడిదారీ సంబంధాలు అవతరించాయని చెప్పవచ్చు. పైన పేర్కొన్నట్టు కేవలం ఉత్పత్తి శక్తులలో వచ్చిన మార్పులను బట్టీ, వ్యాపారీకరణనుబట్టీ పెట్టుబడిదారీ వ్యవస్థ రూపొందిందని చెప్పడం లోపభూయిష్టమైన వాదనే అవుతుంది. ఎందుకంటే మార్కెట్, పెట్టుబడి అన్ని సమాజాలలోనూ ఉండవచ్చు. ఆదివాసీలు కూడా అంగట్లో సరుకులను అమ్ముతారు. అంగట్లో తమ అవసరాలకు కావలసిన వస్తువులను కొనుక్కుంటారు. అంతమాత్రాన ఆదివాసీ ప్రాంతాల్లో పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చేసిందని చెప్పగలమా? ఆదివాసీలు తమ అవసరానికి వాడగా మిగిలిన దానిని మాత్రమే అంగట్లో అమ్ముతారు. అమ్మకం వారి ఉత్పత్తి లక్ష్యం కాదు. కాబట్టి వస్తువుల వ్యాపారం జరిగినంత మాత్రాన పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడిందని చెప్పలేము.

మార్క్స్ దృష్టిలో పెట్టుబడిదారీ వ్యవస్థ నిర్దిష్ట సామాజిక సంబంధాల ఫలితంగానే రూపొందుతుంది. అందుకే లెనిన్ వర్గ సంబంధాల ప్రాతిపదికనే రష్యాను పెట్టుబడిదారీ దేశమన్నారు. ఏ వ్యవస్థలోనైతే ధనిక రైతాంగం ఆవిర్భవిస్తుందో, శ్రమ అమ్మకం సరుకుగా మారుతుందో, మార్కెట్ అవసరాల కొరకు ఉత్పత్తి జరుగుతుందో ఆ వ్యవస్థను మార్క్సిస్టులు పెట్టుబడిదారీ వ్యవస్థ అంటారు.

ఈ లక్షణాలు మనదేశంలోనూ చూడవచ్చు. కాబట్టి భారతదేశాన్ని పెట్టుబడిదారీ దేశంగా పేర్కొనవచ్చు. కానీ ఆ నిర్ధారణకు రావడానికి ముందు మరికొన్ని అంశాలను పరిగణనలోనికి తీసుకోవాలి. వ్యవసాయ రంగాన్నే కాక పారిశ్రామిక రంగాన్నీ, అంతర్జాతీయ పరిస్థితినీ, రాజకీయ వ్యవస్థనూ జాగ్రత్తగా పరిశీలించాలి. వ్యవసాయ రంగంపైన వీటన్నింటి ప్రభావం ఉంటది.

1. పారిశ్రామిక రంగంలో గణనీయమైన ప్రగతి లేదు. అందుకని వ్యవసాయంలో మిగులుగా ఉన్న కూలీలూ, చిన్న రైతులూ పారిశ్రామిక రంగంలో చేరిపోయే అవకాశం లేదు. వీరంతా వ్యవసాయంపైన ఆధారపడి బతకవలసి వస్తోంది. తత్ఫలితంగా తక్కువ కూలీకి, సాంప్రదాయిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని వాడే రంగాలకు వీరు పరిమితమవుతున్నారు. పట్టణంలో కూలీలు, బీడీ కార్మికులు, ఆటోడ్రైవర్లు, చిల్లర వ్యాపారులు తదితర అసంఘటిత రంగాలకే పరిమితమైపోతున్నారు. ఈ రంగాలలో ఇంకా ఆర్థికేతర దోపిడీ కొనసాగుతూనే ఉంది.
2. వ్యవసాయంలో కానీ ఇతర రంగాలలో కానీ డబ్బు సంపాదించిన వారు ఉత్పాదక రంగంలో చేస్తున్న పెట్టుబడి తక్కువే. రియల్ ఎస్టేట్, హోటల్స్, ఆసుపత్రులు, స్కూళ్లు, సినిమాలు వంటి సేవారంగాలలోనే పెట్టుబడి కేంద్రీకృతమైంది. అందువలన పెట్టుబడిదారీ సంబంధాలు విస్తృతమయ్యే అవకాశం లేదు. ప్రధానంగా రాజ్య యంత్రాంగం పైన ఆధారపడి అక్రమ మార్గాలలో సొమ్ము చేసుకొనే పెట్టుబడిదారీ పూర్వ మిగులు దోపిడీ పద్ధతులు పెంపొందుతున్నాయి. రాజకీయ వ్యవస్థతో ఉండే సంబంధాలు, వ్యక్తిగత పలుకుబడిని బట్టి ఈ దోపిడీ శక్తి ఆధారపడి ఉంది.
3. ఉపాధి అవకాశాలు పెంపొందక పోవడం వలన దేశీయ మార్కెట్ విస్తృతం కావడం లేదు. ఈ నేపథ్యంలోనే సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ప్రక్రియ మొదలై అన్నిదేశాల మార్కెట్లు ప్రపంచ మార్కెట్లతో అనుసంధానమయ్యాయి. ఇతర దేశాల మార్కెట్లలో అమ్మగల వస్తువులను సేకరించి ఎగుమతి చేయడం, పెట్టుబడిదారీ వర్గాల లక్ష్యమైంది. చేపలు, పశువులు, పుష్పాలు, కాయలు, పండ్లు, రాళ్లు, ఖనిజాలు, చెట్లువంటి అనేక సహజ వనరులను ఎగుమతి కొరకు నాణ్యంగా ఉత్పత్తి చేయడం, శుద్ధి చేయడం ప్రధాన ఉత్పత్తి కార్యక్రమంగా పెంపొందుతోంది. అందుకు ప్రభుత్వం తోడ్పడు తోంది. ఫలితంగా స్థానిక అవసరాలతో నిమిత్తం లేకుండా ఉత్పత్తి సాగుతోంది. ఈ ప్రక్రియతో స్థానికంగా జీవనోపాధిని కల్పించగల వనరుల తరలింపుకు దారి తీసింది. ఫలితంగా ఉపాధి దెబ్బతిన్నది. స్థానీయమార్కెట్లు మరింతగా దెబ్బతిన్నాయి. ఒకవైపు తిండిలేదు, మరొకవైపు పండిన పంటకు రేటు లేదు. మార్కెట్‌ను విస్తృతపర్చగల శక్తి సహజంగానే పెట్టుబడిదారీ వర్గానికి లేదని గమనించాలి.

ఈ విధంగా సంప్రదాయక వృత్తులు క్షీణించినా, కొత్త వృత్తులు పెంపొందకపోవడం, ఒకవైపు కులపరమైన శ్రమ విభజన బలహీనపడినా మరొకవైపు సామాజిక, ఆర్థిక అంతరాలు కొనసాగుతున్నాయి. మరి ఈ పరిస్థితిలో తమ అధికారాన్ని నిలబెట్టుకోడానికి గ్రామస్థాయి నుంచి బలహీన వర్గాలకు పంచాయతీ వ్యవస్థలో స్థానం కల్పించారు. కొంతమేరకు అవినీతిని ప్రోత్సహిస్తున్నారు. కానీ సమూలంగా వ్యవసాయాన్ని పెంపు చేయగల విధానాలను అమలులోకి తేలేకపోతున్నారు. అందుకు పాలక వర్గ స్వభావమే కారణం. ఉత్పత్తితో నిమిత్తం లేకుండా బందిపోటు దొంగల మాదిరి దోపిడి చేసే స్వభావం కల ఈ వర్గానికి ఇంతకు మించిన మార్గం లేదు.

ఈ రకంగా సాగే ఉత్పత్తి, దోపిడీలకు రాజ్య యంత్రాంగం కీలకమైన సాధనం. ఈ సాధనంపైన ఉండే పెత్తనం ఆయా ప్రాంతాల్లో పాలకవర్గాల అంతరంగిక సంఘటిత శక్తిపైన, ఇతర వర్గాలను, సమూహాలను సమీకరించగల శక్తిపైన ఆధారపడిఉంది. ఈ శక్తి చారిత్రక క్రమంలోలో పెంపొందుతుందని గమనించాలి. జాతీయోద్యమంలోనూ తదనంతరం ఉనికిలోకి వచ్చిన పార్టీలతోని ఉన్న సంబంధాలను ఆయా వర్గాలు వివిధ ఉద్యమాల ద్వారా పెంపొందిన క్రమాన్ని బట్టి నిర్ణయమౌ తుంది. అన్ని ప్రాంతాలు, సమూహాలు, కులాలు ఇందులో సమాన భాగస్వామ్యాన్ని పొందలేదు. అందువలన కులాల మధ్య, మరికొన్ని చోట్ల ప్రాంతాల మధ్య అసమానతలకూ వైషమ్యాలకూ దారితీసింది.

ఈ పరిస్థితి మారాలంటే రైతాంగ వర్గ సమీకరణ ప్రధానాంశంగా ఉంటుంది. కాకపోతే ప్రజాస్వామిక ఉద్యమ సారంలో కాకపోయినా రూపంలో మార్పులు వస్తాయి. ఉత్పత్తిపైన సమగ్ర నియంత్రణ, మార్కెట్ పరిరక్షణ, ప్రధానాంశాలుగా ఉంటాయి. బహుశా పోరాటానికి రాజ్యాంగం సృష్టించిన సంస్థలే వేదికలౌతాయి. రష్యాలో జరిగినట్టు, వివరాలు జాగ్రత్తగా ఆలోచించాలి. 1970లో రూపొందిన కార్యక్రమం సారంలో కరెక్ట్ అయినా వ్యూహంలో మార్పులు రావాలి. ఆ దిశలో ఆలోచన సాగాలి. అయితే ఉత్పత్తి వ్యవస్థపైన జరిగిన చర్చ ఎప్పుడూ పార్టీల్లో విభేదాలకు, విభజనలకు దారితీసింది. అలాకాక హేతుబద్ధ మైన చర్చకు వేదికనూ ప్రమాణాలనూ పెంపొందించుకోగలిగితే అవగాహన విస్తృతమౌతుంది. కార్యాచరణ పరిపుష్టి చెందుతుంది. ◆

**పత్రికల మధ్య పోటీ కారణంగా జర్నలిస్టులకు పెరుగుతున్న జీతాలు, అవకాశాలు, జీవన స్థితిగతులతోపాటు వృత్తి ప్రమాణాలు, నైతిక విలువలు కూడా మెరుగుపడాలంటున్నారు సవ్యసాచి**

# జర్నలిజానికీ మంచి రోజులు రావాలి

ఇప్పుడు తెలుగునాట జర్నలిస్టులకు మంచి రోజులొచ్చా యనిపిస్తోంది. ఎందుకంటే, పెద్ద ఎత్తున జీతాలిస్తామంటూ మీడియా కంపెనీలు జర్నలిస్టుల వేటలో పడ్డాయి. పెద్ద జీతాల సంగతి పక్కన పెట్టి అవకాశాల పరంగా చూసినా అవి మెరుగుపడ్డట్టే లెక్క. కొత్త పత్రికలు, కొంగొత్త ఛానళ్ల సందడితో ప్రస్తుత వాతావరణం హోటుహోటుగా ఉంది. పనిలో పనిగా జర్నలిస్టులు పనిచేసుకునే వాతావరణం, వృత్తి ప్రమాణాలు, నైతిక విలువలు కూడా కాస్త మెరుగుపడితే మొత్తం మీద జర్నలిజం కూడా బాగుపడుతుందనేది ఆశ. అలా బాగుపడాలనేది అంతరాంతరాల్లో గూడుకట్టుకున్న ఆరాటం నుంచి పుట్టిన కోరిక. ఇది కేవలం జర్నలిస్టుల పరమైన అంశం కాకుండా యాజమాన్యాల పరమైంది కూడా అయినందున వారూ తీవ్రంగానే ఆలోచించాల్సిన అవసరం ఉందనిపిస్తోంది. వారెలా ఆలోచిస్తారో రానున్న రోజులే చెబుతాయి. అలా ఎందుకు అనుకోవాల్సి వస్తోంది, నోరారా అనాల్సి వస్తోందంటే మౌలికమైన విషయాల్లో కూడా వారి ఆలోచనలు మార్కెట్లో పరిస్థితులు, పరిణామాల్ని బట్టి మారుతున్నాయి గనుక. ఆ మార్పులకు ప్రస్తుత పరిణామాలు ఒక సంకేతకం కనుక. వారి ఆలోచనల్లో చాంచల్యం కాకపోతే, జర్నలిస్టులకు ఇంతటి జీతాలు తెలుగునాట విన్నామా, కన్నామా? ఒక్కో తెలుగు జర్నలిస్టుకు నెలకు ముప్ఫయి వేలు, నలభై వేల రూపాయిల నుంచి లక్ష రూపాయిల వరకు చెల్లిస్తామని మీడియా పెద్దలు ముందుకు వస్తున్నారు. కొత్తగా పత్రికలు పెట్టే వారు, ఛానళ్లు తెరిచేవారు ఇస్తున్నారనే కాదు, పాత పత్రికలు, ఛానళ్లు వారు కూడా పెద్ద పెద్ద జీతాలిస్తాము, మరీ పెద్ద హోదాలు కల్పిస్తాం మమ్మల్ని వీడి వెళ్లకండి అని జర్నలిస్టుల్ని బతిమాలుకుంటు న్నారు. అంటే, జర్నలిస్టులు అర్హతకు మించి జీతాలు పొందబోతున్నా రన్నది నా అంతరంగం కాదు, వాస్తవం అంతకన్నా కాదు. వారి అర్హతల్ని బట్టి జీతాలిచ్చే తెలివిడి ఇన్నాళ్లేమయింది? అని. ఇవ్వగలిగీ ఎందుకిన్నాళ్లు ఇవ్వలేదు? అన్నది ప్రశ్న. మార్కెట్లో విరివిగా పత్రికలు లేనప్పుడు, కొత్త పత్రికలు – ఛానళ్లు పుట్టుకురానప్పుడు వేళ్ల మీద లెక్కపెట్టగలిగిన మీడియా మొగల్‌లు, తాము కల్పిస్తేనే ఉపాధి, తామింత జీతం చెల్లిస్తేనే జర్నలిస్టులకు జీవితం అన్నట్టు వ్యవహరించిన వైఖరి సమంజసమా? పనిచేసే కనీస సదుపాయాలనైనా కల్పించకుండా అనారోగ్యకరమైన పోటీ వాతావరణాన్ని సృష్టించి తీవ్ర మానసిక ఒత్తిళ్లకు గురిచేయడం వృత్తి ధర్మమా? ఈ పరిస్థితుల్ని ఎవరైనా ప్రశ్నిస్తే అది ధిక్కారం కింద లెక్కా? సంవత్సరాల తరబడి ఎదుగూబొదుగూ లేని జీ(వి)తాలతో, విరామం లేని పని ఒత్తిళ్లతో నలిగిపోయిన జర్నలిస్టును సగటు ఉద్యోగిగానైనా చూశారా? నలుగురికీ జరిగే అన్యాయాల్ని ఎలుగెత్తి చాటుతూ, వారి జీవితాల్లోకి వెలుగులు పంచే జర్నలిస్టులవి మాత్రం దీపపు చెమ్మ కింద చీకటి బతుకులే. వారి జీవితాల్లోకి ఎటువంటి వెలుగులూ ప్రసరించ కూడదు. సంవత్సరాల తరబడి సగటున ఏటా వెయ్యి రూపాయల జీతం పెంపుదలకు నోచుకోని జర్నలిస్టులకు అదే యాజమాన్యాలు ఇప్పుడు ఏడాదిలో మూడు సార్లు జీతం పెంచి రెట్టింపు చెల్లించేందుకు సిద్ధమయ్యాయి. స్వచ్ఛందంగా ఇప్పుడు ఇవ్వడానికి సిద్ధమయ్యారంటే, ఇన్నాళ్లు ఇవ్వగలిగిన స్తోమత యాజమాన్యాలకూ (ఆర్థికపరంగా), పొందాల్సిన అర్హత జర్నలిస్టులకూ (శ్రమకు తగ్గ జీతం) ఉండీ ఇవ్వలేదంటే ఇది దోపిడీ కాదా? మార్కెట్లో జర్నలిస్టులకు కాసిన్ని అవకాశాలు పెరగ్గానే తమకిన్నాళ్లూ కిమ్మనకుండా సేవలందించిన మానవ వనరులు చేజారకుండా జాగ్రత్త పడుతున్నారా? సమాజంలో ఎవరెవరి బాధ్యతల గురించో, మరెవరెవరి మావన హక్కుల గురించో కథలు, కథనాలు, సంపాదకీయాలు రచించి పరిస్థితుల్ని ఎండగట్టేవారి గురివింద నీతికిది తార్కాణమా? ఏమనుకోవాలి? తమ మీడియా నిర్వహణలో, ఇన్నాళ్లూ మేనేజీరియల్ ఉద్యోగులు, సాంకేతిక నిపుణుల ముందర జర్నలిస్టుల్ని పూచికపుల్లలుగా చూసిన యజమానులే ఇప్పుడు మున్నెన్నడు లేని ఆదరణతో చూస్తున్నారు. ఇంద్రులూ – చంద్రులంటూ మర్యాదలిచ్చి మాట్లాడుతున్నారు. ఇంతలో ఎంత మార్పు? పోనీ ఇది శాశ్వతమనుకోవచ్చా? పొరపాటున కూడా అలా అనుకోవడానికి వీల్లేదు. ఎందుకంటే, ఇదే పెద్దమనుషులు రేపు అంగట్లో అవకాశాల తలుపులన్నీ మూసుకుపోయాక ఒక్కో జర్నలిస్టును సాటి జర్నలిస్టుల ముందర పట్టుకొని 'ఏరా' అనో, 'ఏం? పని చేయాలని లేదా' అనో కించ పరచకుండా మాట్లాడితే చాలు, అదే గొప్ప. ఇటువంటి మార్పులెన్నింటినో కళ్లారా చూసిన అనుభవం ఇందుకు భిన్నంగా ఆలోచించనీయడం లేదు. ఇప్పుడు వెలుగుతున్న ఓ పత్రిక లోగడ ఓ మారు మూతపడ్డప్పుడు, అది జర్నలిస్టుల ఉపాధి అవకాశాల తాలూకు మార్కెట్‌పై ఎటువంటి ప్రతికూల ప్రభావాన్ని చూపిందో మనమంతా చూశాం. కొన్ని న్యూస్ ఏజెన్సీల్లో నెలకు ఏ అయిదారు వేల రూపాయల జీతానికో జీవితాన్ని నిక్షేపంగా వెళ్లదీస్తున్న ఎందరో జర్నలిస్టుల పొట్టకొట్టిన పరిణామమది. ఎలా అంటే, పత్రిక మూతపడటంతోటే పొలోమంటూ వీధుల్లోకి వచ్చిన

## డి. పున్నారావు



దేశవ్యాప్తంగా వివిధ ప్రజా ఉద్యమ నిర్మాణాల ఐక్య సంఘటనగా ఏర్పడిన పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ ఆఫ్ ఇండియా (పిడిఎఫ్ఐ) ఆంధ్రప్రదేశ్ కన్వీనర్ డి. పున్నారావు జూన్ 21 రాత్రి అనారోగ్యంతో హైదరాబాద్‌లోని నిమ్స్ ఆసుపత్రిలో మరణించారు. ముప్పై ఐదు సంవత్సరాల జీవితంలో దాదాపు పదిహేను సంవత్సరాలు వివిధ ప్రజా ఉద్యమాలతో మమేకమై కార్యకర్తగా, నాయకుడిగా ఆచరణశీలిగా పనిచేసిన పున్నారావు నిరుపేద చాకలి కుటుంబం నుంచి వచ్చి రాష్ట్రంలో చెప్పుకోదగిన నాయకుడిగా ఎదిగారు. దళితులు, గిరిజనులు, ముస్లిం మైనారిటీలు, గుడిసెవాసులు, రిక్షాకార్మికులు, కిరోసిన్ వ్యాపారులు, ప్రాజెక్టుల నిర్వాసితులు, రాజ్యహింస బాధితులు వంటి అనేక సమూహాలలో పనిచేశారు. ఏఐపిఆర్ఎఫ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా, ఫోరం అగినెస్ట్ ఇంపీరియలిస్ట్ గ్లోబలైజేషన్ (ఫేగ్) నాయకుడిగా, ముంబయి రెసిస్టెన్స్ 2004 నాయకుడిగా ఆయన అందించిన సేవలు విస్తృతమైనవి. 'ఉద్యమం' పత్రికలోనూ ఇతర పత్రికల్లోనూ ఆయన ప్రజా ఉద్యమాల గురించి ఎన్నో రచనలు చేశారు. ఆయన స్మృతికి వీక్షణం నివాళులు అర్పిస్తోంది. ◆

జర్నలిస్టులు 'ఎందుకండీ? అంతంత జీతాలిచ్చి పని చేయించుకుంటారు, ఈ మాత్రం దానికి మేం నెలకు ఓ మూడు వేల రూపాయలిస్తే చేయమా? అంటూ సాటి జర్నలిస్టుల్ని ఉద్యోగభ్రష్టుల్ని చేసిన ఉదంతం ఇంకా కళ్లకు కడుతోంది. అందుకే, రేపేం పరిస్థితో? అనిపిస్తోంది.

### స్వేచ్ఛా విపణి ఇక్కడొద్దా?

'జర్నలిస్టులకు ఎంత డిమాండ్ వచ్చిందని ఇప్పుడు కొంతమంది మీడియా కంపెనీ పెద్దలు చెవులు కొరుక్కొంటున్నారు. 'మాకు అక్కడ ఇంత ఇస్తున్నారు, మీరెంత ఇస్తారు' అనో, 'వారింత ఇస్తామంటున్నారు, మరి మేమిక్కడే ఉండాలంటే మీరెంత పెంచుతారు?' అని సీనియర్ జర్నలిస్టులు డిమాండ్ చేయడాన్ని వారు జీర్ణించుకోలేక పోతున్నారు. ఇటువంటి డిమాండ్లు కొత్తేమీ కాదు. ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా మంచి డిమాండ్ పల్కుతోన్న సాఫ్ట్‌వేర్ సేవా రంగంలో ఇది పాత పద్ధతే. చేతిలో విమాన టిక్కెట్టు పట్టుకొని విదేశాలకు వెళ్లేందుకు విమానాశ్రయంలో నిలబడి కూడా టెలిఫోన్‌పై బేరాలాడే నిపుణులున్నారు. నిపుణుల్ని వదులుకోలేక కడపటి క్షణం వరకు బేరాలాడే సంస్థలూ ఉన్నాయి. ఇది ఉభయత్రా ఉన్నదే. అప్పటివరకూ బంగ్లాదేశ్ క్రికెట్ టీమ్ కోచ్‌గా ఉండి, తన సేవల విషయంలో భారత్–పాక్ దేశాల మధ్య పోటీ వాతావరణాన్ని సృష్టించి చివరకు మంచి బేరంతో 'కెంట్'కు వెళ్లిన కోచ్ కథలాంటిదన్న మాట. ఇది కొంతమందికి అనైతికంగా కనిపించవచ్చు. ఇప్పుడు జర్నలిస్టులకు, ముఖ్యంగా సీనియర్ జర్నలిస్టులకు ఏర్పడ్డ డిమాండ్ కూడా మీడియా మొగల్‌లకు నచ్చడం లేదు. 'ఇన్నాళ్లూ మేం కదా ఉపాధి చూపింది, ఉన్నపళంగా మమ్మల్ని వదిలేసి పోటీ మీడియాకు వెళ్లడం ఏ మేరకు నైతికం చెప్పండి?' అనికూడా వారు సనుక్కుంటున్నారు. కానీ, నా దృష్టిలో ఇది, ఒక మీడియా కంపెనీ పోటీ సంస్థ నుంచి సీనియర్ జర్నలిస్టుల్ని లాక్కోకూడదనే అంతరంగిక అవగాహన (లాలూచీ) కి వచ్చి, తక్కువ వేతనాలతోనే జర్నలిస్టుల సేవల్ని కొల్లగొట్టడం కంటే అనైతికమేమీ కాదు. ఏ రకంగా చూసినా ఇటువంటి అవగాహన ఉభయ కంపెనీలు ఒక కుయుక్తితో రింగవడం కిందే లెక్క. బజారులో అవకాశాలు అట్టే లేనప్పుడు, జర్నలిస్టుల సేవలు ఎంత చౌకగా లభిస్తే అంతకు లాగించేద్దామనే తత్వం కొత్తది కాదు. గొర్రె తోకలా ఎదుగూబొదుగూ లేని ఫిక్స్‌డ్ జీతాలకు రూపాయి కూడా పెంచకుండా ఆరేడు సంవత్సరాల పాటు జర్నలిస్టులతో ఊడిగం చేయించుకున్న పెద్ద పేరున్న మీడియా సంస్థలూ తెలుగునాట ఉన్నాయి. మరి, దీన్నేమనాలి నైతికమా? స్వేచ్ఛా విపణి అనేకానేక ఆర్థిక సమస్యలకు పరిష్కారమనేది బలమైన నమ్మకం, నిబద్ధత అని కూడా మనకు తెలుసు. ప్రభుత్వాలయినా, ఏ వ్యవస్థ అయినా ఆంక్షలు విధించకుండా స్వేచ్ఛా విపణి పరిస్థితుల్ని అనుమతిస్తేనే ధరలు నియంత్రణలో ఉండి కొనుగోలుదారులకు ప్రయోజనం కలుగుతుందనేది మనందరికీ తెలిసిన సత్యం. ఉత్పత్తిదారుడైనా, సేవలందించేవారయినా స్వేచ్ఛా విపణి ఉంటేనే వినియోగదారుల కొనుగోలు శక్తిని బట్టి గరిష్ఠంగా తమకు గిట్టుబాటు ధర లభిస్తుందని ఆశిస్తారు. తగినంత మంది విక్రేతలు, కొనుగోలుదారులు ఉన్నప్పుడే ఆరోగ్యకరమైన వాతావరణం ఉంటుందన్నది జగమెరిగిన వాణిజ్యసత్యం. ఉత్పత్తులు – సేవల కొరత సృష్టించేలా విక్రేతలు కూడబలుక్కోవడమైనా, కొనుగోలుదారులు తమలో తాము కట్టడి విధించుకొని ధరలు పడిపోయేలా కుమ్మక్కవడమైనా కచ్చితంగా స్వేచ్ఛా విపణిని దెబ్బతీసే పరిణామాలే. మరి అన్ని చోట్లా ఇటువంటి స్వేచ్ఛా విపణి ఉండాలని ఆకాంక్షించే మీడియా పెద్దలు, ఇక్కడ మాత్రం ఉండకూడదని కోరుకుంటారు. ఇదెలా సమంజసం? తాము తలచుకున్న వేతనాలకే జర్నలిస్టుల సేవల్ని పొందేందుకు వీలుగా, మీడియా కంపెనీలు వాణిజ్యపరమైన తమ స్పర్థల్ని కాసేపు పక్కనపెట్టైనా సరే, పరస్పరావగాహనతో కట్టడి చేసుకొని స్వేచ్ఛా విపణికి భంగం కలిగించిన దృష్టాంతాలు ఎన్నో, ఎన్నెన్నో. నిన్నటికి నిన్న గుజరాత్‌లో దివ్య భాస్కర్ వచ్చినప్పుడు, ముంబాయిలో డి.ఎన్.ఎ. వచ్చినపుడు ఇదే విన్నాం. ఇదే జరిగింది కూడా. ఒకరిని వేలెత్తి చూపేటప్పుడు తామెలా వ్యవహరిస్తున్నా మన్నది తరచి చూసుకోవడం మంచిది. జర్నలిస్టులకు జీతాలు పెరగడం అన్నది సాపేక్షంగా చూడాల్సిన అంశం. అన్ని రంగాల్లో, జీవితపు అన్ని పార్శ్వాల్లో వచ్చిన ఆర్థిక పరిణామాల ప్రభావంగా దీన్ని పరిగణించాలి. అంతే తప్ప 'ఓయబ్బో, ఇంత డిమాండా?' అని అబ్బురపోవాల్సిన అవసరం, 'మీకూ మంచి రోజులొచ్చాయ'ని ద్వంద్వార్థంలో ఎకసక్కాలాడాల్సిన అవసరం ఎవరికీ లేదు. ఇప్పుడు ఉభయపక్షాలూ కోరుకోవాల్సిందల్లా, ఇదే క్రమంలో వృత్తి నైపుణ్యం, ప్రమాణాలు పెరగాలనీ, ఆరోగ్యకరమైన పోటీ, పని వాతావరణం మెరుగుపడాలనీ, తద్వారానే మీడియా నుంచి సమాజం ఆశించే ఫలితాలు లభిస్తాయన్నది గ్రహించాలి. గత కొంతకాలంగా అధోఃముఖంగా పయనిస్తున్న ప్రసారమాధ్యమాల విశ్వసనీయత సూచి(గ్రాఫ్)ని అందరి కృషితో ఊర్ధ్వముఖంగా నడిపించాలన్నదే ఆకాంక్ష. ◆

బ్రిటిష్ సామ్రాజ్యవాదులను పారదోలి అమెరికన్ సామ్రాజ్యవాదులను ఎర్రతివాచి పరిచి మరీ ఆహ్వానిస్తున్నామని అరవైఏళ్ల దేశస్వాతంత్ర్యం గురించి వ్యాఖ్యానిస్తున్నారు **వి. హనుమంతరావు**

# పరాధీనత... స్వాతంత్ర్యం... పరాధీనత

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు దేశ పాలనను కాంగ్రెస్ పార్టీ నేతలకు బదలాయించి అరవై సంవత్సరాలు పూర్తి చేసుకొన్న సమయంలో మనం ఏం సాధించాం, సాధించలేకపోయాం అని వెనక్కు తిరిగి చూసుకోవటం సహజం. వంద రోజుల్లో ఏం చేశాం, మూడు నెలల్లో, సంవత్సర కాలంలో ఏం చేసాం అని ప్రస్తుత పాలకులు భుజాలు తడుముకొంటున్న ఈ రోజుల్లో, ఏకబిగిన అరవై సంవత్సరాల చరిత్రను అవలోకించి ఓ చిన్న వ్యాసంలో సమీక్షించ పూనుకోవటం రేఖామాత్రంగానే సాధ్యమవుతుంది.

దేశం నుంచి పరాయి పాలకులు వెళ్లిపోవాలి, మనలను మనమే పరిపాలించుకోవాలి. మన సహజ వనరులను మనమే వినియోగించుకొని మనకాళ్ల మీద మనమే నిలబడగలగాలి. స్వతంత్రంగా బతకాలి. స్వతంత్ర పోరాటం లక్ష్యాలివి. వీటిని సాధించామా? క్లుప్తంగా చెప్పాలంటే

- తెల్లదొరలు పోయారు, నల్లదొరలు వచ్చారు.
- బ్రిటిష్ సామ్రాజ్యవాదులను పంపించేశాం, అమెరికన్ సామ్రాజ్య వాదులకు ఎర్రతివాచీ పరిచి మరీ ఆహ్వానిస్తున్నాం.
- మన సహజ వనరులను దోచుకపోవటాన్ని నిరసించాం, ఇప్పుడు మనమే ఆ వనరులను అమ్మకానికి పెట్టి, ప్రత్యేక రవాణా సౌకర్యాలను ఏర్పాటు చేసి ఎగుమతి చేస్తున్నాం. అంతే కాదు, చమురు, బొగ్గు లాంటి వనరులను తరలించుకపొమ్మని విదేశీ సంస్థలనూ, బహుళజాతి సంస్థలనూ ఆహ్వానిస్తున్నాం.
- సంస్థానాలు పోయాయి, సెజ్‌ల పేరుతో కొత్తరకం సంస్థానాలు అవతరించాయి.
- ఫ్యూడల్ భూస్వాములు పోయి, కార్పొరేట్లు, బహుళజాతి సంస్థలే కొత్త భూస్వాములుగా అవతరిస్తున్నాయి.
- బెంగాల్ కరువులో 30 లక్షల మంది మరణించారు. తిండి గింజలు లేకపోవటం వల్ల కాదనీ, నల్లబజారు వ్యాపారులే కారణమనీ అమర్త్యసేన్ అన్నారు. ఈ రోజున అలాంటి కరువులు లేవు. ఇబ్బడి ముబ్బడిగా పండించే శక్తి సంపాదించుకొన్నాం. అయినా తిండి గింజలను దిగుమతి చేసుకొంటున్నాం. అప్పుడు కరువుతో చనిపోతే, ఇప్పుడు రుణ భారంతో ఆత్మహత్యలు చేసుకొంటున్నారు.
- అప్పుడు రైతులు తమ పంట నుంచి విత్తనాలను సేకరించుకొని తర్వాత పంటకు వాటిని సమకూర్చుకొన్నారు. సాంప్రదాయ ఎరువులను వినియోగించారు; ఇప్పుడు బజారుకు వెళ్లి విత్తనాలు, ఎరువులు కొనుక్కోవాల్సి వస్తోంది. అదనంగా పురుగుమందులు వాడాల్సి వస్తోంది.
- అప్పుడు పరిశ్రమల్లేవు. దేశాభివృద్ధికీ, ఉద్యోగ వసతి కల్పన కోసం పరిశ్రమలు కావాలన్నాం, పరిశ్రమలొచ్చాయి కానీ పారిశ్రామికీకరణ పెరిగినకొద్దీ ఉపాధి కల్పన తగ్గిపోతోంది.
- అప్పుడు మైళ్ల కొలది నడిచి పక్క గ్రామాలకు పోవాల్సి వచ్చేది, ఇప్పుడు రవాణా సౌకర్యాలు ఎంత ఇబ్బడి ముబ్బడిగా పెరిగాయంటే పాదచారులు రోడ్డు మీద నడిచే పనిలేదు, రోడ్డుకు ఈ పక్క నుంచి ఆ పక్కకు వెళ్లటమే గగనమై పోయేటంతగా వాహనాల సంఖ్య పెరిగింది.
- అప్పుడు బడులే ఉండేవి కావు. ఇప్పుడు కావాల్సినన్ని బడులు, కాలేజీలు, విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. కాని బడుల్లో పిల్లలు డ్రాపవుట్ అవుతున్నారు. ఒకటో క్లాసులో నూరు మంది పిల్లలు చేరితే, కాలేజీ చదువు స్థాయికి కేవలం పదిశాతం మందే మిగులుతున్నారు. ఆ కొద్ది మందికి కూడా ఉపాధి కరువైంది.
- అప్పుడు గ్రామీణ ప్రాంతాలకు వైద్య సౌకర్యాలే ఉండేవి కావు. ఉన్నా, అన్ని రోగాలకు ఎర్రనీళ్లే (కార్మినిటివ్ మిక్చర్) దిక్కు. ఇప్పుడు కూడా అవసరమైన మేరకు కాకపోయినా వైద్య సౌకర్యాలు విస్తరించాయి. అయితే, డాక్టర్లుంటే నర్సులుండరు, ఇద్దరూ ఉంటే మందులుండవు. ఈ సౌకర్యాలను విస్తరించటంపోయి, ప్రైవేట్ రంగాన్ని ప్రోత్సహిస్తున్నారు.
- అప్పుడు బడ్జెట్లు లక్షల్లో ఉంటే, ఇప్పుడు లక్షల కోట్లలో ఉంటున్నాయి. అయితే చేసిన కేటాయింపులు ఖర్చు కావు. ఏమి సాధించదలచుకున్నారో, వాటిని సాధించామా అనే సమాచారం ఉండదు.
- అప్పుడు విదేశీ వస్తువుల బహిష్కరణ, ఇప్పుడు వాటి కోసం వెంపర్లాట.
- స్వతంత్రం రాక ముందు గ్రామాల్లో భూస్వాములు, జమీందార్లు కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా బ్రిటిష్ గులాములుగా వ్యవహరించారు. గ్రామాల్లో తిరుగులేని పెత్తనం వెలగబెట్టేవారు, స్వతంత్రం వచ్చిన తర్వాత అలాంటి వారందరూ కాంగ్రెస్ తీర్థం పుచ్చుకున్నారు. గ్రామంలో ఏ సంస్థ ఏర్పాటైనా – అది సహకార సంస్థ కావచ్చు,

పంచాయతీ వ్యవస్థ కావచ్చు, మరేదైనా కావచ్చు – వాటిని స్వాధీనం చేసుకొని వారి పెత్తనాన్ని కొనసాగిస్తున్నారు. గ్రామంలో అప్పుడూ ఇప్పుడూ పెత్తందార్లు వాళ్లే. ఈ పరిణామం పాలకుల ఆశీస్సులతోనే జరుగుతోంది.

❖ అప్పుడు ప్రధానంగా రాజకీయ, పాలనాధికారాలే విదేశీయుల చేతుల్లో ఉండేవి. ఇప్పుడు దేశ ఆర్థిక జీవనం మీద కూడా వారు పట్టు సాధించారు, కాదు, మన పాలకులు వారికి అధికారం కట్టబెట్టారు. తాకట్టులో భారతదేశం అని 60వ దశకంలోనే తరిమెల నాగిరెడ్డి పుస్తకం కూడా రాశాడు.

❖ మొన్న మొన్ననే 1857 ప్రథమ భారత స్వాతంత్ర సంగ్రామం సంబరాలు జరుపుకున్నాం. అదే సమయంలో అమెరికా అణ్వస్త్రాలతో కూడిన యుద్ధనౌకను చెన్నయ్ పోర్టులోకి ఆహ్వానించాం.

❖ ప్రపంచ రాజకీయాల్లో అలీన విధానమనే సరికొత్త కాన్సెప్ట్‌ను నెహ్రూ ప్రపంచానికి అందించగా, ఇప్పుడు దానిని ఏడు నిలువుల లోతున పాతేసి అమెరికా విషకౌగిలిలో ఇమిడిపోతున్నాం.

అయితే, ఈ అరవై సంవత్సరాల్లో ఎటువంటి అభివృద్ధీ, ఎటువంటి మంచీ జరగలేదని మీ ఉద్దేశమా, అలాకాదు ఆహార ధాన్యాల పంట నాలుగు రెట్లు పెరిగింది. ఒక రకమైన స్వయం పోషకత్వాన్ని సాధించాం. పిన్ను కూడా తయారు చేసుకోలేక వాటిని కూడా దిగుమతి చేసుకోవాల్సిన దుస్థితి నుంచి పారిశ్రామిక దేశాల జాబితాలో చోటు చేసుకొన్నాం. భాక్రానంగల్, నాగార్జునసాగర్ లాంటి భారీప్రాజెక్ట్‌లెన్నో నిర్మించుకొన్నాం. ఎంత అభివృద్ధి సాధించామంటే బహుళజాతి సంస్థలు, విదేశీ పారిశ్రామికవేత్తలు తమ ఉత్పత్తులను తయారు చేయడానికి భారతదేశాన్ని ఎంచుకొన్నారు. (చవకగా శ్రామికులు లభించటం అసలు రహస్యం). విమానాలు, సబ్‌మెరైన్లు తయారు చేసుకోగలిగే స్థాయిని అందుకొన్నాం. ఈ విజయాల వివరాలన్నీ ప్రభుత్వ ప్రచార విభాగం ప్రసారం ఎలాగూ చేస్తుంది. పత్రికలు ప్రత్యేక సప్లిమెంట్లు తీసుకొని వస్తాయి. (ఎందుకంటే ఆపేరుతో అడ్వర్టైజ్‌మెంట్లు రెవెన్యూ పెంచు కోవచ్చు) అందుచేత ఆ వివరాలన్నీ నేను పునరుల్లేఖించ బోవటం లేదు. కాని ఒకటి రెండు ప్రశ్నలు వేయాలనిపిస్తుంది. అరవై సంవత్సరాల ప్రస్థానంలో ప్రపంచంలో చైనా తర్వాత మరేదేశంలో లేనన్ని మానవ వనరులున్న మన దేశం సాధించగలిగినంత సాధించిందా, అంత సుదీర్ఘ కాలంలో ఎంతో కొంత అభివృద్ధి జరక్కుండా ఎలా ఉంటుంది, మన దేశాన్ని చూడడానికి వచ్చిన విదేశీయులు 'ఇండియా ఈజ్ రిచ్, బట్ ఇండియన్స్ ఆర్ పూర్' అని అంటూండడం గుర్తుకు వస్తుంది. దేశం అభివృద్ధి చెందుతుంది గాని దేశ ప్రజలు అభివృద్ధి చెందటంలేదు. అభివృద్ధి జరిగింది కానీ ఆ ఫలితాలు సామాన్యులకు దక్కటం లేదు. దేశంలో ధనాఢ్యులు పరిశ్రమలు పెట్టడానికి కావాల్సిన పెట్టుబడులను పెట్టలేరని గ్రహించిన నెహ్రూ ప్రభుత్వహయాంలోనే పరిశ్రమలు, ముఖ్యంగా యంత్రాలను తయారు చేయగలిగే పరిశ్రమలను స్థాపించి ప్రైవేట్ రంగం ఏర్పడడానికి, వృద్ధి చెందడానికి తోడ్పడ్డారు. అప్పుడు ఉద్యోగ వసతి గణనీయంగా పెరిగింది. కాగా పారిశ్రామిక అభివృద్ధి ఫలితాలు ఉద్యోగ వసతి లభించిన వారికే పరిమితం కావడాన్ని గ్రహించిన ఇందిరాగాంధీ బొట్టుబొట్టుగా అభివృద్ధి ఫలితాలు (ట్రిక్కిల్ డౌన్ థియరీ) అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించి అమలు పరిచింది. అనేక పాప్యులిస్ట్ పథకాలు ప్రవేశపెట్టి 'గరీబీ హఠావో' అనే నినాదంతో ప్రజలను పక్కదారి పట్టించటంలో కొంత విజయం సాధించింది. అప్పటి నుంచి ఇప్పటి వరకు అనేక ప్రయత్నాలు జరిగినా అభివృద్ధి ఫలితాలు సామాన్యులకు చేరలేదనడానికి తాజాగా మన్మోహన్ సింగ్ 'ఇన్‌క్లూజివ్ గ్రోత్' నినాదమే తిరుగులేని సాక్ష్యం. అభివృద్ధి అయితే జరిగింది కాని దాని ఫలితాలు అందరికీ అందటం లేదని అంగీకరించడమే.

మొదటి ప్రణాళిక నుంచి పదకొండవ ప్రణాళిక వరకు ప్రతి ప్రణాళికలోనూ దారిద్ర్య నిర్మూలన, నిరుద్యోగాన్ని అంతం చేయటం లక్ష్యాలుగా పునఃప్రస్తావించడం, మన దేశం నెత్తిన పేదరికం విలయతాండవం చేస్తోందని అంగీకరించడమే. పేదరికం, నిరుద్యోగం కొనసాగటంలోనే పాలక పార్టీ స్వప్రయోజనాలు ఇమిడి ఉన్నాయేమోననిపిస్తుంది. ఇవి వర్ధిల్లుతుంటేనే, వాటిని నిర్మూలించేస్తాం అంటూ వాగ్దానాలు చేస్తూ, పథకాలు ప్రకటిస్తూ ప్రజలను బురిడీ కొట్టించి ఓటు బ్యాంకులను పదిలం చేసుకోవచ్చు. అలాంటి పాప్యులిస్ట్ పథకాలు పాలకుల, అధికారుల జేబులు నింపుతున్నాయి. లంచగొండితనం దిన దిన ప్రవర్ధమానమవుతోంది. ఈఅరవై ఏళ్లలలో ఎన్ని స్కాంలు జరిగాయో, ఏ సంస్థ అయినా లెక్కలు తీస్తే కనువిప్పుగా ఉంటుంది.

మన స్వతంత్రం వయస్సు అరవై సంవత్సరాలయితే, అందులో నక్సలైట్ ఉద్యమం వయస్సు నలభై సంవత్సరాలు. మొదటి సంవత్సరాల్లో స్వతంత్రం ఎలాంటి ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని, ఆశలను కలిగించిందో, యువకులు, విద్యావంతులు ఉన్నతాశయాలతో నక్సలైట్ ఉద్యమంలో చేరి అంతే ఉత్సాహాన్నీ ఆశనూ కలిగించారు. రాను రాను ధనవంతుల సొమ్ముగా స్వాతంత్ర్యం వారి చేతుల్లో బందీ అయిపోయింది. అలాగే నక్సలైట్ ఉద్యమం కూడా అలాంటి ధనవంతులను, ప్రజా పీడకులను మట్టుపెట్టడమే విప్లవం అనే సిద్ధాంతంలో బందీ అయిపోయింది. ఇటు ప్రభుత్వం స్వతంత్రపోరాటం నుంచి పాఠాలు నేర్చుకోలేదు, అటు నక్సలైట్లు తెలంగాణ సాయుధ పోరాటం నుంచీ పాఠాలు నేర్చుకోలేదు. విప్లవంలో ఆటుపోట్లు, పురోగమన, తిరోగమనాలు గెలుపోటములు, రెండడుగులు వెనక్కు, మూడడుగులు ముందుకు వెయ్యాల్సిన అవసరం ఉంటుందనే అవగాహన కొరవడిందేమోననిపిస్తుంది. ప్రభుత్వంతో చర్చలకు నక్సలైట్ నాయకులు బయటకు వచ్చినప్పుడు సామాన్యుల నుంచి ఎలాంటి సానుకూల స్పందన వచ్చిందో నెమరు వేసుకొంటే, ఆ పోరాట నాయకులు ఇటీవల ఎన్‌కౌంటర్ అయిపోతున్న పరిణామం నక్సలైట్ కార్యకర్తలకే మింగుడు పడకపోవచ్చు. ప్రజలు ప్రత్యక్షంగా కాకుండా పరోక్షంగా పాల్గొనే ఏ ఉద్యమం అయినా ఇలాంటి పరిస్థితులనే ఎదుర్కోవాల్సి వస్తుంది. ఈ పరిణామాలు నాయకత్వాన్ని ఆలోచనలో పడేసిందని ఇటీవల గణపతి ప్రకటన తెలియజేస్తుంది. ఎన్‌కౌంటర్లు ఉద్యమాలను నిలువరించలేవని పాలకులూ గ్రహించాలి.

## పొంచి ఉన్న ప్రమాదం

ద్వితీయ ప్రపంచ సంగ్రామం తరువాత దాదాపు వంద దేశాలు పరాయి పాలన నుండి విముక్తమయి రిపబ్లిక్‌లుగా అవతరించాయి. అయితే ఇటలీ నుండి ఈజిప్ట్ వరకూ పెక్కు దేశాలు ఇతరేతర పద్ధతులలోనికి జారిపోయాయి. నూట పన్నెండు కోట్ల మంది జనం, పేదరికం, నిరక్షరాస్యత, రకరకాల మతాలు, భాషలు, అసంఖ్యాక కులాలు, నిరుద్యోగం, పెరుగుతున్న అవసరాలు, దిగజారుతున్న అవకాశాలు, కరువు, కాటకం, అతివృష్టి, సునామీలు, భూకంపాలు, సరిహద్దుదేశాలతో తగాదాలు, భిన్నసంస్కృతులు, విభిన్న భావజాలాలు, వంటి సవాలక్ష సమస్యలతో సతమతమవు తున్నారు. పార్లమెంటరీ వ్యవస్థ, ప్రజాస్వామ్య విధానం, ఒక పార్టీ నుండి మరొక పార్టీకీ, ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికి అధికారం బదలాయింపు అహింసా మార్గంతో జరగడం, మనం సాధించిన, అందునా ముఖ్యంగా ఈ దేశంలో సగటు పౌరుడు సాధించిన ఘనవిజయం. మన దాపునే ఉన్న పాకిస్తాన్, బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్తాన్, బర్మా, శ్రీలంకలతో పోలిస్తే మనం ఈ విషయంలో చాలా ముందున్నాం. 1975-77ల మధ్య 19 మాసాలు పీడకలగా నెలకొన్న కాలంలో వినా, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మనం అనుభవిస్తున్నాం.

అయితే, గత అరవై సంవత్సరాలుగా మనం సాధించిన ఫలితాలూ ఆర్థికాభివృద్ధీ అతి కొద్దిమందికి మాత్రమే పరిమితమై పోయింది. ఒక వంక బిలియనీర్లు, ట్రిలియనీర్లు పైదేశాలలో కూడా పరిశ్రమలనూ, వాణిజ్య సంస్థలనూ కైవసం చేసుకొంటుండగా, మరొక వంక పెరిగిపోతున్న నిరుద్యోగం, తరిగిపోతున్న ఉపాధి అవకాశాలు, ఆదాయాల మధ్య అంతరాలు, సరళీకృత ఆర్థిక విధానాలు, లోపించిన నియంత్రణా వ్యవస్థ, కలవారికి కొమ్ముకాసే యంత్రాంగం, ఇటువంటివన్నీ కూడబలుక్కొని బడుగువర్గాల బతుకుల్ని బండలు చేస్తున్నాయి.

ఈ అంతరాలను పూడ్చకపోతే, ఈ సామాజిక అగ్నిపర్వతం భగ్గున మండిపోతుంది. మిణుకు మిణుకుమంటున్న మన ప్రజాస్వామ్య వ్యవస్థ కుప్పకూలిపోతుంది. కలవాడు విచ్చలవిడిగా సంపదను పోగేసుకుంటూంటే, దాన్ని సహిస్తూ నిర్భాగ్యులు, నిస్సహాయంగానే కలకాలం మిగిలిపోయి చూస్తూ ఊరకుండిపోతారని ఆశించడం అవివేకం. ఆత్మహత్యలకు పాల్పడ్డ రైతులు, రైతు కూలీలు, కష్టజీవులు, కడుపుమండి తిరగబడి హత్యలకు పాల్పడితే, ఆ ఉపద్రవాన్ని ఆపడం ఎవరి తరమూకాదు. పొంచిఉన్న ఈ ప్రమాదాన్ని మనమంతా గుర్తించడం అవసరం.

*– యలమంచిలి శివాజీ*

### కాంగ్రెస్ ఏకఛత్రాధిపత్యానికి గండి

1967 ఎన్నికల్లోనే కాంగ్రెస్ కోట బీటలు వారింది. కాంగ్రెస్ పాలన పట్ల ప్రజల్లో అసంతృప్తి ప్రబలిందనడానికి అప్పటి ఎన్నికల ఫలితాలు (ఎనిమిది రాష్ట్రాల్లో ఓడిపోయింది) ఒక కనువిప్పు. సరిగ్గా అప్పుడే నక్సలైట్ ఉద్యమం ప్రారంభం కావటం గమనార్హం. అంతకు ముందు పార్లమెంట్‌లో కేవలం రెండే సీట్లు గెలుచుకున్న బి.జె.పి. 90వ దశకం చివరి భాగంలో ఏకంగా అధికారంలోకి వచ్చిందంటే, కాంగ్రెస్ భవనం కూలిపోతుందనడానికి నిదర్శనం. అంతకుముందు నుంచే కాంగ్రెస్ గానీ, బి.జె.పి. గానీ చిన్న, చితకా పార్టీలను కావలించుకుంటే తప్ప ప్రభుత్వాలు ఏర్పాటు చేయలేని పరిస్థితి ఏర్పడింది. సంకీర్ణ ప్రభుత్వాల యుగం అవతరించింది. ఇదే సమయంలో ప్రాంతీయ పార్టీలు కాలు, చెయ్యి కూడ దీసుకొని తమఉనికిని చాటుకోవటం, బలపరచు కోవటం ప్రారంభమైంది. ఇది కేంద్రంలో విధానాల అస్థిరతకు, అవకాశ వాదం, పార్లమెంట్ సభ్యులను కొనివేయటం లాంటి అపశృతులకు దారితీసింది. అటు ఆర్థిక అస్థిరతకు, ఇటు రాజకీయ అస్థిరతతోడై దేశ భవిష్యత్తును అంధకారమయం చేస్తోంది.

వామపక్షాలు మరుగుజ్జుల్లా అవే మూడు రాష్ట్రాలకు పరిమితమై పోయాయి. తామెప్పుడూ ప్రజల పక్షాన్నే ఉన్నామంటారు. మరి ఆ ప్రజలు వారిని అధికారంలోకి పంపించటం లేదంటే, వారిలో రాజకీయ చైతన్యాన్ని కలిగించలేని విధానాలనవలంబించడం కారణంగానా? పార్లమెంటరీ ప్రజాస్వామ్య ఊబిలో దిగబడిపోవటం వల్లనా అనేది ప్రశ్నించుకోవాలి.

### ప్రపంచ బ్యాంక్ – అమెరికా వేటకుక్క

ఈ అరవై ఏళ్లలో అత్యంత విషాద ఘట్టం ప్రపంచబ్యాంక్ షరతుల మేరకు ప్రవేశపెట్టిన సరళీకృత ఆర్థిక విధానం. ప్రపంచదేశాలన్నిటి మీద, ముఖ్యంగా వర్ధమాన దేశాల మీద అధికారం సాధించటానికి ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంక్, డబ్ల్యుటిఓ లాంటి సంస్థలను పావులుగా ఉపయోగించుకుంటోంది. 1991లో ఆర్థిక సంక్షోభం నుంచి బయటపడడానికి మేము రుణ సహాయం చేస్తామని ప్రపంచబ్యాంక్ విసిరిన వలలో భారతదేశం చిక్కుకుంది. రుణం, మరింత రుణం, వడ్డీ చెల్లింపులు, ఆ పేరుతో మన పరిపాలనా వ్యవస్థలో గ్రామీణ స్థాయి వరకు ప్రత్యక్షంగా, పరోక్షంగా జోక్యం చేసుకొని విధి విధానాలను ఆ దేశాల మీద రుద్దటం, షరతులతో కూడిన రుణమివ్వటం ఈ సంస్థల పని. ఇందుకు అమెరికా 'ఎకనామిక్ హిట్‌మాన్'లను ప్రపంచ దేశాలమీదకు వేటకుక్కలను వదిలి పెట్టినట్లు వదిలిపెట్టింది. జాన్ పెర్కిన్స్ అనే వ్యక్తిని హిట్‌మాన్‌గా నియమిస్తూ అమెరికా ప్రభుత్వ ప్రతినిధి చెప్పినమాట ఏమిటంటే "అమెరికా ప్రయోజనాలు నెరవేర్చే ఒక వ్యవస్థలో ప్రపంచదేశాల అధినేతలను భాగం చేయడమే నీ పని. కొన్నాళ్లకు ఆ దేశాలను అప్పుల వలయంలో చిక్కేటట్లు చేసి వారిని బానిసలుగా మార్చాలి. మన ఆర్థిక, రాజకీయ, సైనిక అవసరాలను తీర్చే బంట్లుగా వారిని మార్చి వేయాలి. ఈ సాయం చేసినందుకు వారి వారి దేశాల్లో పదవులు నిలబెట్టుకొనేందుకు, ప్రజలకు చూపించేందుకు పారిశ్రామిక పార్కులు, విద్యుదుత్పత్తి కేంద్రాలు, విమానాశ్రయాలు స్థాపించాలి. అమెరికా ఇంజనీరింగ్ నిర్మాణ సంస్థల ఖజానా కూడా నిండాలి" అని. జాన్ పెర్కిన్స్ తన అనుభవాలను 'కన్ఫెషన్స్ ఆఫ్ ఏన్ ఎకనామిక్ హిట్‌మాన్' అనే గ్రంథంలో వెల్లడించాడు. యూజర్ ఛార్జీలను ప్రభుత్వం

మనందరి దగ్గర నుంచి వసూలు చేస్తోంది ఈ అప్పులు, వడ్డీలు చెల్లించడానికేనని గుర్తుంచుకోవాలి. కాగా ఈ రుణం అనే ఉచ్చు నుంచి దేశం బయటపడే ప్రసక్తే లేదు. మన బిడ్డలు, వారి బిడ్డల భవిష్యత్తును తాకట్టు పెట్టేసింది కాంగ్రెస్ ప్రభుత్వం. ఇది జరుగుతున్నంత కాలం పెర్కిన్స్ చెప్పినట్లు పేదలకు పేదరికం నుంచి విముక్తి కూడా ఉండబోదు. పేదరికం ఉన్నన్నినాళ్లు మావోయిజం ఉంటూనే ఉంటుంది. అరవై సంవత్సరాల తర్వాత మనం మళ్లా 1947కు పూర్వస్థితిలోకి వెళుతున్నాం. తేడా అల్లా ఏమంటే అప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యవాదం, ఇప్పుడు అమెరికా సామ్రాజ్యవాదం. దేశంలో ఆసుపత్రులు కట్టాలంటే, రహదారులు వేయాలంటే, రోడ్డుపక్కన చెట్టునాటాలంటే, మనం మంచినీళ్ల తాగాలంటే కూడా ప్రపంచబ్యాంక్ రుణం మీద ఆధారపడాల్సి వస్తోందంటే, మన పాలకుల బానిసబుద్ధి ఎంత దూరం పోయిందో ఊహించుకోవచ్చు.

ఈ వ్యాసం రాసే సమయంలో నేనొక వృద్ధాశ్రమంలో ఉంటున్నా. నా వయస్సు 82. నాకన్నా ఎక్కువ వయస్సు గలవారూ ఇక్కడే ఉంటున్నారు. అంటే గత శతాబ్దంలో ఎక్కువ కాలం పుట్టి పెరిగినవారు. అనేక అనుభవాలతో వారి తలలుపండాయి. ఆ రోజుల్లో అంటే స్వతంత్రం రాక ముందు పరిస్థితులేమిటో తెలుసుకోవాలనిపించింది. అప్పుడెలా ఉండేది, ఇపుడెలా ఉంది అని వారి ఆలోచనను తెలుసుకొని పాఠకులతో పంచుకోవాలనిపించింది. వారందరూ చెప్పినవి వింటుంటే అవే మంచిరోజుల్లా అనిపించింది. వారుచెప్పిన సంగతులేమిటో విందాం:

93 ఏళ్ల ఎస్. రామచంద్రనాయుడు (చిత్తూరు జిల్లా) 'మట్టిలో పుట్టి పెరిగిన వాణ్ని' అని తనకు తానే పరిచయం చేసుకొన్నారు. మోటలతో వ్యవసాయం, సొంత పొలంలో నుంచే విత్తనాలు, తన పాడి, పశువుల స్థలం నుంచే 60-70 బళ్ల సాంప్రదాయ ఎరువు, పాలు, పెరుగు, నెయ్యి అమ్మేవారు, కొనేవారు లేనంత పశు సంపద (ప్రతి ఇంట్లో), కాల్వలు, వంకల్లో నిరంతరం నీరు, మరీ మెట్ట ప్రాంతం అయితే బావులు (ఒక రూపాయి కూలీ, స్త్రీలు అర్ధరూపాయ. భోజనం పెడితే ఉదయం ఆరు నుంచి సాయంత్రం వరకు పని) అప్పుడు రూపాయ కూలీకి చేసే పని ఇప్పుడు నూరిచ్చినా జరక్కపోవటం, 16 వేలు చెల్లించి 26 ఎకరాల కొనుగోలు, అందులో 10 ఎకరాలు మామిడి తోట, ఇదీ ఆనాటి వ్యవసాయ చిత్రం. అవే మంచి రోజులని అనిపించిందంటే అనిపించదూ? పాలేరుకు ఏడాదికి నూరు రూపాయలు. దుద్లుకావాలి, గింజలు వద్దు అనేవారు. ఎకరాకు అయిదు రూపాయల శిస్తు. ఇద్దరు బిడ్డలను పెద్ద చదువులు చదివిస్తే ఒకడు లాయరు, మరొకరు గ్రామంలోనే వ్యవసాయం చూసుకొంటూ టీచర్ ఉద్యోగం. అప్పుడు గ్రామంలో బడి లేదు, పలకలు లేవు. చెక్క మీద దోసఆకు రాసి దాని మీద అక్షరాలదిద్దుడు. టిఫిన్స్ కాఫీలు లేవు. బెల్లంతో వేరుశనగ పప్పు, అలసందులు నాలుగు డబ్బాల్లో వేస్తే సంవత్సరం పొడవునా పిల్లలకు, పెద్దలకు చిరుతిండి. ఏమీ కొనేపనిలేదు. ఆ రోజుల్లో మా తాతకు ఓ కోడిపెట్టనిస్తే అయిదెకరాలు రాసి ఇచ్చేశాడు.

ఏడు పదులు దాటిన సత్యనారాయణ నల్లగొండ జిల్లా సూర్యాపేట వాసి. 1943లోనే నెలకు 12 రూపాయల జీతంతో టీచర్. ఆ ఉద్యోగం రాజీనామా చేసి రజాకార్ల, నైజాం పాలనకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమంలో కార్యకర్తగా అరెస్ట్ అయ్యారు. ఆ రోజుల్లో చదువు, ఉద్యోగం అంటే జనంలో ఆసక్తే లేదు. మొత్తం జిల్లాలో 10వ తరగతి వరకూ మూడు స్కూళ్లు - అప్పుడు దొరలే బియ్యం తినేవాళ్లు. జనం తినేది జొన్న, సజ్జ, రాగి. ఎర్రబాడు దొరకు లక్షా ఏభై వేల ఎకరాల పొలం. సూర్యాపేట నుంచి వరంగల్ దాకా దొరదే భూమి. అపుడు ఎకరం భూమి రు. 500, మహా అయితే వెయ్యి. శిస్తు ఎకరాకు రూపాయి. అది కూడా కట్టలేనివారి భూములు దొర ఆక్రమించుకోవడమే. అపుడు

## మరో స్వాతంత్ర్య పోరాటం

అరవై ఏళ్ల స్వతంత్ర భారతదేశం పలు రంగాలలో విజయం సాధించింది. శాస్త్ర, సాంకేతిక రంగం, ఐటి రంగాలను ఇందులో ప్రధానంగా పేర్కొనవచ్చును. ఆర్థిక రంగంలో కూడా దేశం ప్రగతిని సాధించిన మాట యథార్థం. ఆర్థికాభివృద్ధి 9 శాతంగా ఉంటుందని కేంద్ర ఆర్థిక మంత్రి గర్వంగా ప్రకటించారు. కాని, వృద్ధిరేటు వాస్తవమైనా దేశంలోని అన్ని ప్రాంతాలు, ప్రజల విషయంలో ఇది నిజం కాదు. కొన్ని ప్రాంతాలలో 9 శాతం కన్న వృద్ధి రేటు అధికంగా ఉంది. మరికొన్ని ప్రాంతాలలో ఇది 9 శాతం కన్న అత్యంత దిగువన ఉంది. కొన్ని ప్రాంతాలలో అసలు వృద్ధికే నోచుకోని ప్రజలు ఉన్నారు. మూడింట రెండువంతుల జనాభా గల గ్రామీణ ప్రాంతం వ్యవసాయ రంగంలో ఆశించిన ప్రగతిని సాధించలేక పోయింది. నిజానికి ఈ రంగంలోని ప్రగతి అత్యంత నిరుత్సాహకరంగా ఉంది. అధికోత్పత్తి సాధించినా రైతుకు గిట్టుబాటు ధర లభించడం లేదు. మధ్య దళారీల వ్యవస్థ రాజ్యమేలుతుంది. విద్యారంగంలో వస్తున్న మార్పులు పేదవారికి అశనిపాతంగా ఉన్నాయి. వృత్తి, విద్య ధనార్జనవర్గాలకు మాత్రమే పరిమితమయ్యే ప్రమాదం ఉంది. ఇలాంటి పరిస్థితే వైద్య, ఆరోగ్య రంగంలో నెలకొన్నది. స్వాతంత్ర్యం అన్నిరంగాలలో పౌరులందరికి లభించాలి. స్వాతంత్ర్యం రాగానే రాజ్యాంగంలో పొందుపర్చుకున్న సామాజిక, ఆర్థిక, రాజకీయ సమానత్వం పౌరులందరికీ ఆచరణలో వర్తించాలి. అదే నిజమైన స్వాతంత్ర్యం. ఇప్పుడది ఆచరణలో అసంతృప్తిగానే ఉంది.

భారతదేశ భవిష్యత్తు - సామాన్యుని భవిష్యత్తుపై, అభివృద్ధిపై ఆధారపడి ఉంది. రాజ్యాంగంలో పొందుపర్చుకున్న పౌరులందరూ సమానమన్న భావనను కార్యాచరణలో ప్రజలంతా భావించాలి. ధనికుల సంపద పేదలకు జాలువారుతుందనే భావన, లేదా ధనికుల సంపద వెల్లువలా వచ్చి పడ్తుంటే బొట్టుబొట్టుగా పేదలకు వచ్చి చేరుతుందనే భావజాలాన్ని భారతదేశ పాలకులు లేదా రాజకీయ వేత్తలు విడనాడాలి. సర్వసత్తాక లౌకిక ప్రజాస్వామ్య దేశంగా, సమానత్వం ధ్యేయంగా స్వతంత్ర భారతదేశం మరింత వేగంగా ముందడుగులు వేయాలి. లేని పక్షంలో సముపార్జించిన స్వాతంత్ర్యం ఉన్నత, ధనార్జనవర్గాలకే పరిమితమై, మరో స్వాతంత్ర్య పోరాటానికి సామాన్య ప్రజలు, అణగారిన వర్గాలు, పీడిత ప్రజలు ఉద్యుక్తులు కాక తప్పదు.

**- కె. శ్రీనివాస రెడ్డి**

రైతుతో పాటు కూలీలు కూడా పొలం వెళ్లి ఉదయం నుంచి సాయంత్రం దాకా పని చేసేవారు. పరిపాలన ఘోరం, మోసం. రజాకార్లు బెదిరించి డబ్బు గుంజుక పోయేవారు. ఆ రోజుల్లో పాతిక రూపాయలతో పనులు జరిగిపోయేవి. అపుడు జనానికి చదువుల్లేవు. దొరల బిడ్డలకే చదువు. రవాణా సౌకర్యం ఖమ్మం – హైదరాబాద్ మధ్య ఒకే ఒక ట్రిప్పు. బస్సు జనంతో నిండేది కాదు. అయిదు మైళ్ల వరకు నడకే. గొప్పోళ్ల ఇళ్లల్లో మూడు నుంచి అయిదు దినాల పెళ్లిళ్లు జరిగేవి అన్నారు.

మహిళా ఉద్యమాల్లో తలపండిన కొండపల్లి కోటేశ్వరమ్మకు ఆ రోజుల్లో ఇటుక మీద ఇటుకపేర్చి ఇల్లు కట్టినట్లు, గ్రామగ్రామం తిరిగి మహిళలను మేలుకొలిపి సామాజిక అన్యాయాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్మిస్తే, ఈ రోజున అంతా తిరోగమనంలో ఉంది అనేదే ఆవేదన. ఆ రోజులతో పోలిస్తే మహిళల పరిస్థితి కొంత బాగుపడింది కానీ 'కొత్త పుంతలు, కొత్త సమస్యలొచ్చిపడ్డాయి. పాత సమస్యలు కొన్ని తీరాయి' అంటుందామె. 1940 కు ముందు జాతీయోద్యమంలో పట్టణాలనుంచి పల్లెలకు నాయకురాళ్లు వెళ్లి ప్రచారం చేసి వచ్చేవారు. పల్లెటూర్లలో స్త్రీల సమస్యలు, కల్లు నిషేధం, ఆర్థిక సమస్యల ప్రస్తావన వారి ప్రచార విషయాలు. కమ్యూనిస్టులే మొట్టమొదటగా గ్రామాలకు వెళ్లి మహిళా సంఘాలు ఏర్పాటు చేశారు. స్త్రీలు ఆర్థికంగా బాగుపడడం, బాల్యవివాహాలకు వ్యతిరేకత, స్త్రీల ఆస్తి హక్కు, విద్యాభ్యాసం, వితంతు వివాహాలకు ప్రోత్సాహం, వర్ణాంతర వివాహాల గురించి ప్రచారమే కాదు, ఆచరించి ఆదర్శంగా నిలిచారు. స్త్రీలు మలవిసర్జనకు బయటకు వస్తే బరితెగించిందని తప్పుపట్టే పరిస్థితి నుంచి విముక్తి చేసి ప్రభుత్వంతో మరుగు దొడ్లు నిర్మింప చేశారు. విజయవాడలో మహిళా కార్యకర్తలకు శిక్షణా తరగతులు నడిపేవారు. గ్రామాలకు వెళ్లాలంటే బస్సు మీద ఆధారపడాల్సిన పరిస్థితులుండటంతో, స్త్రీలకు సైకిల్ తొక్కటం నేర్పటం కూడా శిక్షణా తరగతుల్లో భాగం. స్త్రీలు ఉరేగింపుల్లో పాల్గొంటే, కవాతు చేస్తుంటే వింతగా చూసేవారు. మహిళా ఉద్యమ నిర్మాణంలో డాక్టర్ అచ్చమాంబ ప్రముఖ పాత్ర వహించారు. ఇలా మెట్టుమెట్టు పైకి ఎక్కుతూ మహిళల్లో చైతన్యాన్ని తీసుకొని వచ్చారు. ఇవాళ స్త్రీలు అన్ని రంగాల్లోనూ పని చేస్తుండటం చూసి, దీనికి పునాదులు మేమే వేశాం కదా అనే సంతృప్తి ఒక పక్క, మరోపక్క స్త్రీలకు వేధింపులు, వరకట్నం చావులు, పని స్థలాల్లో అగచాట్లు, రక్షణ, భద్రత లేకపోవటం చూసి మనం ఉద్యమం నడిపింది ఇందుకేనా అనే బాధ మనసును విషాదంతో నింపుతుందని ఆమె ఆవేదన వ్యక్తం చేశారు. 'తల్లిదండ్రులను వృద్ధాశ్రమాలకు పంపించేయ్, పిల్లలను చదువుకోసం హాస్టల్లో చేర్పించేయ్' అనే సంస్కృతి పెరుగుతోంది. స్త్రీలు పంచాయతీ అధ్యక్షులుగా ఎన్నికైనా, వారి భర్తలే కథ నడిపిస్తారు. శాసన సభల్లో వారి సంఖ్యా బలం లేదు. అమెరికా వెళ్లి స్త్రీలు సుఖపడడం లేదు. స్త్రీ అంగటి సరుకుగా మారిపోయింది. అన్ని విధాలా స్త్రీ నలిగిపోతోంది. రాజకీయాలు పక్కనపెట్టి సంఘ సమస్యలను పట్టించుకోండి అనేది మహిళా సంఘాలకు కోటేశ్వరమ్మ చేసే అభ్యర్థన.

దేశం ఎక్కడికిపోతోంది అనేమాట ప్రతివారినోటా వినపడుతోంది. భవిష్యత్తు అంధకారంగా కనిపిస్తోంది. ప్రజల అసంతృప్తి ఎప్పుడు కట్టలుతెంచుకుంటుందో, ఏం జరుగుతుందోననే ఆవేదన – ఇదీ 60 ఏళ్ల తర్వాత సగటు భారతీయుని మానసిక పరిస్థితి. నేడు కావాల్సింది ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురుచూడడం కాదు, సమాజంలో ప్రతి వ్యక్తి, ఈ దిగజారుడును ఎలా నిలువరించగలం, నేనేం చేయగలను అని ప్రశ్నించుకోవాలి.

నాడు ఉద్యమాలు, ఉద్యమకారులు ఓ నిబద్ధతా నిజాయితీతో నడిచాయి, నడిచారు. సొంత లాభం కొంతమానుకుని అన్నదాన్ని ఆచరించి అలుపెరుగక శ్రమపడి సాధించారు. వారి త్యాగ ఫలితంగా ఈనాడు అన్ని రంగాల్లోనూ స్త్రీలు అధిక సంఖ్యలో కనిపిస్తున్నారు. వంటింటి కుందేళ్లు, బానిసలు కాదనేది రుజువు చేశారు. చూస్తుంటే చాలా సంతోషం కలుగుతోంది. స్త్రీల ప్రతిభా పాటవాలు వెలికి వచ్చాయి కదా అనే ఆనందం ఒకవైపు కలుగుతుంది. ఆనాడు పెంచిన మంచి కుంచించుకు పోతుందనే బాధ కూడా కలుగుతోంది.

వేశ్యావృత్తి నిర్మూలన జరిగిందని సంతోషం వ్యక్తం చేస్తూనే, కొన్ని చోట్ల బసివిని, మాతంగి పేర్లతో దురాచారాన్ని పెంచుతూ, స్త్రీలను అణచివేస్తూ వ్యభిచారాన్ని పెంచడం చూస్తుంటే, బాధనిపిస్తోంది. మూఢ నమ్మకాలు ముందుకంటే అధికమయినట్లు తోస్తుంది. ఈతరంలో సామాజిక చైతన్యం సన్నగిల్లుతోందనిపిస్తుంది.

పేదరికం అధికమౌతున్నట్లు కనిపిస్తుంది. నిఖాలపేరుతో కొన్నిచోట్ల ఆడపిల్లలను అమ్ముకుంటున్నారు. పేదరికంతోనూ, ఆడపిల్లల ను సాకలేమనే భయంతోనూ కొన్ని ప్రాంతాల్లో ఆడుకునే చిన్నారులను వ్యభిచారం వ్యాపారంగా చేసుకున్న దళారీలకు అమ్ముతున్నారు.

ఆనాడు కమ్యూనిస్టు పార్టీ ప్రజాసంఘాలను నెలకొల్పితే, ఈనాడు అన్ని రాజకీయ పార్టీలు ప్రజాసంఘాలను పెట్టుకున్నాయి. ఉద్యమాలు నడుపుతున్నాయి. ఉద్యమాలు స్వలాభం కోసమా, దేశాభివృద్ధి కోసమా, ఈ దురాచారాలను అరికట్టే బాధ్యత వాటికిలేదా? అనిపిస్తుంది. ఉద్యమకారుల్లో చిత్తశుద్ధి, త్యాగనిరతి లేదా? అనిపిస్తుంది. సంఘంలోని అవినీతిని ఐక్యతతో పారదోలగలమనే ఆలోచనలు కనిపించడం లేదు. అనైక్యతతోనూ, పదవీకాంక్షతోనూ, అధికార దుర్వినియోగం తోనూ రౌడీయిజాన్నీ, గూండాయిజాన్నీ పెంచుతున్నాయేమో కొన్ని పార్టీల నిపిస్తుంది. మార్పు సహజమనీ ఆలోచిస్తూ, ఆశిస్తూ ఆనాటి ఉద్యమాలను నెమరువేసుకుంటూ వృద్ధాశ్రమవాసులు కాలం దొర్లిస్తున్నారేమో అనిపిస్తుంది. ◆

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028

స్వాతంత్ర్యం వచ్చి అరవై ఏళ్లైన తరువాత కూడా వేలాది మంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారంటే అది దేశానికే సిగ్గుచేటని అంటున్నారు **ఎన్. శివరామిరెడ్డి**

# ఆరుపదుల స్వాతంత్ర్యం - ఎగుడుదిగుళ్లు

**ఒ**క చిన్న విశ్లేషణతో ఈ వ్యాసం ప్రారంభిస్తాను. కాంగ్రెస్ నాయకులు బ్రిటిష్ పాలకులతో రాజీపడి చేసుకున్న ఒప్పందంగా ఆగస్ట్ 15ను చూసేవారున్నారు. కానీ, ఇది తప్పు. అరవై ఏండ్ల సుదీర్ఘపోరాటాన్ని కించపరచే వైచిత్రి ఇది. సాధించు లేదా మరణించు అన్న మహాత్ముని క్విట్ ఇండియా పిలుపు తెల్లవారి గుండెల్లో రైళ్లు పరుగెత్తించింది. ఆ పిలుపు, ఆ త్యాగాలు, ఆ పరిణామాలను కించపరచగూడదు. రాజీ ఫలితం కాదు, పోరాట ఫలితం మన స్వాతంత్ర్యం.

ఇంకో అపోహ కూడా ఉంది. కొందరు అదేపనిగా నొక్కి చెప్పే పొరపాటు ఒకటుంది. మహాత్ముడు, కాంగ్రెస్ స్వరాజ్యం తెచ్చారని చెప్పటం. స్వరాజ్య పోరాటంలో వారు ప్రధానపాత్ర వహించారని చెప్పటం సరైనది. కానీ, నాయకత్వం ఎవరు వహించినా చరిత్ర నిర్మాతలు ప్రజలే. 1857 లగాయతూ, ఎందరో ధీరులు, వీరులు, అశేష ప్రజానీకం సమష్టిగా సాగించిన మహోన్నత పోరాట ఫలితం మన స్వాతంత్ర్యం అంటే బాగుంటుంది. ప్రాథమిక విద్య నుండి కాలేజీ విద్య వరకు మన స్వాతంత్ర్య పోరాటం గురించి సరైన అవగాహన కలిగించాలి.

మరో అపోహను కూడా తొలగించాలి. గాంధీ మహాత్ముడు సత్యం, అహింసలతో బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు హృదయ పరివర్తన కలిగించి స్వాతంత్ర్యం సాధించినట్లు చెప్పుకోవటం కూడా ఉంది. స్వాతంత్ర్య పోరాటంలో అహింస అన్నది ఒక ఎత్తుగడగానే నెహ్రూ మొదలుకొని చరిత్రకారులందరూ భావిస్తున్నారు. అది నిజం కూడా. జైళ్లు, ఉరికంబాలు, రక్తతర్పణం లేకుండా మన స్వాతంత్ర్యం సిద్ధించలేదు. జలియన్‌వాలాబాగ్ దురంతం మొదలుకొని అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్ వంటి ఎంతోమంది దేశభక్తుల ప్రాణాలు తీసిన సామ్రాజ్య వాదుల దుర్మార్గాన్ని మభ్యపెట్టే ప్రయత్నాన్ని సహించరాదు.

మన స్వాతంత్ర్యాన్ని గురించి చులకన భావంతో పెదవి విరిచే వారు మనమధ్య లేకపోలేదు. చరిత్ర తెలియని అజ్ఞానంతో చేసేపనిఅది. నేడు భారతదేశం ఎదుర్కొంటున్న పేదరికం, ఎవరెస్ట్ శిఖరమంత పెరిగిన ధనిక, పేదవ్యత్యాసాలు, అవినీతి విశ్వరూపం చూసి, నిరుత్సాహపడి 1947 ఆగస్ట్ 15ను వెక్కిరించేవారున్నారు. అసలు మనకు స్వాతంత్ర్యం రానే రాలేదు అనేవారున్నారు. మన సమాజాన్ని పట్టిపీడిస్తున్న రుగ్మతల నిర్మూలనకు పునరంకితం కావాలిగానీ, స్వాతంత్ర్యాన్ని వెక్కిరించరాదు.

### నూతన శకాన్ని ఆవిష్కరింపచేసిన మన రాజ్యాంగం

1947 ఆగస్ట్ 15తో భారతదేశ ఆధునిక చరిత్రలో నూతన శకం ప్రారంభమైంది. దీనికి ముందు రెండు భాగాల్లో బ్రిటిష్ పాలనా, ఒక భాగంలో సుమారు 600 సంస్థానాధీశుల పరిపాలన కొనసాగింది. స్వాతంత్ర్యం ఫలితంగా సంస్థానాలన్నీ రద్దయి, హేతుబద్ధమైన అర్థవంతమైన పద్ధతిలో భాషా ప్రయుక్త రాష్ట్రాలతో దేశం నూతన రూపురేఖలు సంతరించుకుంది. స్వాతంత్ర్యం సాధించిన గొప్ప విజయంగా దీనిని పేర్కొనాలి.

1950 జనవరి 26న, నూతన రాజ్యాంగం అమల్లోకి వచ్చింది. భారతదేశం సెక్యులర్, ప్రజాతంత్ర, సోషలిస్ట్ రిపబ్లిక్‌గా ప్రకటించు కుంది. వయోజన ఓటింగ్ పద్ధతిలో 1952లో ప్రప్రథమంగా ఎన్నికలు జరిగాయి. నాటినుండి నేటివరకు యాభై ఐదు ఏండ్లుగా నిరంతరాయం గా ఎన్నికలు జరుగుతున్నాయి. ఉపఖండంలోని పొరుగుదేశాల్లో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుండగా మన దేశంలో అది స్థిరంగా కొనసాగుతోంది. ఇటీవల ఈ మూడేండ్లలో రాష్ట్రంలో టి.డి.పి., కేంద్రంలో బి.జె.పి. చట్టసభలను స్తంభింపచేసి పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం పాల్జేస్తున్నారు. అయితే వీరు తిరోగమించక తప్పదు. మనది సోషలిస్ట్ రిపబ్లిక్‌గా ప్రకటించుకోవడం పెద్దజోక్‌గా భావించాలి. ఎందుకంటే పాలకపక్షాలకు సోషలిజం అంటరాని పదార్థంగా మారిపోయింది. పచ్చి పెట్టుబడిదారీ విధానాన్ని అమలు జరుపుతూ మనది సోషలిస్ట్ రిపబ్లిక్ అని చెప్పుకోవటం ఆత్మవంచన అవుతుంది.

### ధనస్వామ్యానికి కళ్లెం వేయాలి

ఈ అరవై ఏండ్లలో జరిగిన పరిణామంలో భూస్వామ్య విధానం స్థానంలో ధనస్వామ్యం వేళ్లూనుకుంది. ఫ్యూడలిజంలో భూమి కీలకం. ధనస్వామ్యంలో డబ్బు కీలకం. ప్రత్యక్ష సంకెళ్లు ఫ్యూడలిజం. కనపడని సంకెళ్లు క్యాపిటలిజం. రాజ్యాంగం ద్వారా సంక్రమించిన ప్రజాస్వామ్యం ఈ అరవై ఏండ్లలో వేలం వస్తువుగా తయారుకావడం అత్యంత విచారకర పరిణామం. ఎన్నికల్లో వేలం వెర్రి ఖర్చును నియంత్రించే ఉద్దేశంతో

శాసనసభకు పది లక్షల రూపాయలు, పార్లమెంట్‌కు ఇరవై ఐదు లక్షల రూపాయలు పరిమితి విధిస్తూ చట్టం చేశారు. వామపక్షాలు తప్ప బూర్జువా పార్టీలన్నీ ఈ పరిమితికి పదిరెట్లు ఖర్చు పెడుతూ పరిమితికి లోబడి ఖర్చు చేస్తున్నట్లు నిస్సిగ్గుగా తప్పుడు రిటర్న్ సబ్‌మిట్ చేస్తున్నారు.

ధనస్వామ్యం విశృంఖలతను గుర్తించే వారు సైతం తీవ్రమైన ఎన్నికల సంస్కరణల వైపు ఆలోచించకపోవడం విచారకరం. తమ కార్యక్రమంలో దామాషా ఎన్నికల విధానాన్ని చేర్చుకున్నప్పటికీ అందుకొరకు పట్టువిడుపులు లేని పోరాటం చెయ్యడం లేదు. కారణం ఈ విధానం వల్ల బెంగాల్, కేరళ, త్రిపుర రాష్ట్రాల్లో తమకు ప్రస్తుతం లభిస్తున్న సీట్లు దామాషా విధానంలో తగ్గిపోతాయన్న భయం కావచ్చు లేదా ఆ రాష్ట్రాల మాదిరిగా ప్రస్తుత ఎన్నికల విధానంలోనే అధికారానికి రావచ్చన్న ఆత్మవిశ్వాసం కావచ్చు. కానీ ఈ ఆలోచన సరైనది కాదు. కారణం, పై మూడు రాష్ట్రాల్లో విజయం సాధించి దశాబ్దాలు గడిచినా మిగిలిన 80 శాతం రాష్ట్రాల్లో వామపక్షాల మార్కుటైం సాగిస్తూనే ఉన్నాయి. గణనీయమైన పురోగమనం లేదు.

చిన్న చిన్న పార్టీలకు దామాషా విధానమే తమ బలానికి తగిన సీట్లు సాధించిపెడుతుంది. అవకాశవాద పొత్తులకు కూడా తెరదించడం సాధ్యం. రాజ్యాంగం ధనికునికి, పేదవానికి ఒకే ఓటు హక్కు ఇచ్చినా, ఆచరణలో ఆ సమానత్వం ధనం ముందు నీరుగారిపోతోంది. ఈ విషాయాన్నే అంబేద్కర్ రాజ్యాంగ పరిషత్తు ముగింపు ఉపన్యాసంలో నొక్కిచెప్పాడు. లోక్‌సత్తా నాయకుడు జయప్రకాష్ నారాయణ్ కూడా దామాషా ఎన్నికల విధానం కోసం ఉద్యమం చేపట్టకపోవడం విస్మయం కలిగిస్తుంది.

## మన జాతీయతను గురించిన వక్రభాష్యాలు

బ్రిటిష్ సామ్రాజ్యవాదం పుణ్యమా అని దానితో పోరాడే క్రమంలో భారత జాతీయత రూపుదాల్చింది. అన్ని కులాలను, మతాలను, భాషలను ఏకం చేసింది. చరిత్ర చేతిలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఒక పనిముట్టుగా కొన్ని సానుకూల పరిణామాలకు దోహదం చేసినట్లుగా మార్క్స్ భావించాడు. భాష, చరిత్ర ఆధారంగా భిన్న సంస్కృతులు విశాల భారత్‌లో అన్యోన్యంగా మెలుగుతున్నాయి. భిన్నత్వంలో ఏకత్వంగా అందరూ భారతీయులమన్న భావన బలపడింది. కానీ బి.జె.పి. పరివారం ఈ సాంస్కృతిక వైవిధ్యాన్ని మభ్యపెట్టి, హిందూ జాతీయత అనే భావాన్ని చొప్పించి మత ప్రాతిపదిక మీద సమాజాన్ని విభజించపూనుకుంది. హిందువులు కానివారిని పరాయివారుగా చూడమంటున్నారు.

సెక్యులర్ శక్తులు బలంగా ఉన్నప్పటికీ, హిందూ మతోన్మాద శక్తులబలాన్ని తక్కువ అంచనా వేయరాదు. లౌకికశక్తుల చీలికే బి.జె.పి. బలం. కాబట్టి లౌకిక శక్తుల ఐక్యతను కంటిలోన పాపలాగా కాపాడు కోవడం మీదనే దేశ పురోగమనం ఆధారపడి ఉంది. లౌకిక భావన ప్రజల్లో వేళ్లూనుకోవాలి. చరిత్రకు వక్రభాష్యం చెప్పి యువకుల్లో మతద్వేషాలను రెచ్చగొట్టే బి.జె.పి. పన్నాగాన్ని తిప్పికొట్టాలి. స్వాతంత్ర్యం వచ్చిన ఈ అరవై ఏండ్లలో లౌకికభావన బలపడినప్పటికీ మతోన్మాద శక్తులపట్ల ఉపేక్ష పనికిరాదు. మధ్యప్రదేశ్, గుజరాత్, రాజస్థాన్ లాంటి రాష్ట్రాల్లో స్వంత బలంతోనూ, మరికొన్ని రాష్ట్రాల్లో సెక్యులర్ శక్తులతో చేతులుకలిపి బి.జె.పి. అధికారం చెలాయిస్తోందన్న వాస్తవాన్ని విస్మరించరాదు.

## నిత్యం మండుతూ ఉన్న నక్సల్ సమస్య

ఈ అరవై ఏండ్ల స్వాతంత్ర్యంలో నలభై ఏండ్లుగా దేశాన్ని కుదిపివేస్తున్న మరో సమస్య నక్సల్స్ సమస్య. కొంతమంది మేధావులు, చదువుకున్న యువకులు నక్సల్ సిద్ధాంత ప్రభావంతో కొట్టుకు పోతున్నందు వల్ల దీనిని కొంత వివరంగా పరిశీలించడం అవసరం. అన్యాయాలపట్ల సెన్సిటివ్‌గా స్పందించే స్వభావం గలవారు వీరు. నక్సల్స్ అందరిదీ మావో ఆలోచనా విధానమే అయినా అందులో సాయుధ పోరాట పంథా వీడని మావోయిస్టులను గురించే ప్రజాహితం కోరేవారి ఆందోళన. ఈ నలభై ఏండ్లలో కొన్ని వేలమంది మావోయిస్టులు సుమారు అంతే సంఖ్యలో వారి ప్రత్యర్థులు హత్యలకు గురయ్యారు. అడవుల్లో రక్తం మరకల వార్తలేని రోజు ఉండదు. మొదట్లో సాయుధ పోరాట పంథాతో ప్రారంభించిన కొందరు నక్సలైట్లు క్రమంగా తమ ఎత్తుగడను సవరించుకుని ఆ మార్గం నుండి వైదొలిగారు. వారు ఆచరణ నుండి నేర్చుకున్నారు. అలా నేర్చుకోవడం కూడా మార్క్సిస్ట్ కార్యాచరణలో ఒక భాగమే. ఏమీ నేర్చుకోని వారు మావోయిస్టు పార్టీ వారే. మావోయిస్టులు చేస్తున్నది విప్లవం కాదు. విప్లవంతో చెలగాటం. అది ఒక నికృష్టమైన వ్యక్తి హింసావాదంగా పతనం చెందింది. ప్రజలు పాల్గొనకుండా విప్లవం లేదు. మెజారిటీ ప్రజలు పాల్గొనే విప్లవాన్ని ఏ శక్తీ అణచజాలదు. అడవుల్లో చెల్లా చెదురుగా విహరిస్తున్న సాయుధ ముఠాలు విప్లవం చేయలేవు. అత్యాధునికమైన లక్షల సైనికశక్తి ముందు వీరు ఆగలేరు. తమ శక్తిని ఎక్కువగా అంచనా వేసుకొని, శత్రువు శక్తిని తక్కువగా అంచనా వేసి అనుసరించే ఎత్తుగడలు, దుందుడుకు తనంతో నీరుగారిపోతాయి.

ఇక్కడ కొంచెం గతంలోకి వెళదాం. తెలంగాణ సాయుధ పోరాటపు రెండవ దశలో, అంటే యూనియన్ సైన్యాలు ప్రవేశించిన తరువాత, నైజాం నవాబు లొంగిపోయిన తరువాత, సాయుధ పోరాటానికి ప్రజలు మద్దతు సన్నగిల్లి అగ్రగామి దళం తీవ్రంగా దెబ్బతింటున్న సందర్భంలో ఆ పోరాటాన్ని ఆపమని, ఆయుధాలు కింద పెట్టమని స్టాలిన్ ఇచ్చిన సలహాను ఐక్య కమ్యూనిస్టు పార్టీ శిరసావహించి 1952 ఎన్నికల్లో పాల్గొనిన విషయం బహిరంగమే. అయితే అప్పటికి కూడా సాయుధ పోరాటం మానుకోవలసింది కాదని నేటి మన మావోయిస్టుల వాదన. ఇది ఎంతకరుడుగట్టిన పిడివాదనో అర్థం చేసుకోడానికి మార్క్సిస్ట్ విజ్ఞానం అవసరంలేదు. మామూలు ప్రపంచజ్ఞానం సరిపోతుంది.

చైనా అనుభవాన్ని ఇక్కడ స్పృశించకుండా ఉండలేం. చైనా విప్లవ అనుభవాన్ని యాంత్రికంగా భారత్‌లో అమలు జరుప పూనుకోవడమే మన మావోయిస్టుల చారిత్రక తప్పు. ఆ మాటకొస్తే విప్లవాలకు నమూనాలు వెతకడం తప్పని భారత కమ్యూనిస్టు పార్టీ చాలా విలువైన గుణపాఠం నేర్చుకుంది. ఇతర దేశాల విప్లవాలను అధ్యయనం చేయడం అవసరమే కాని అనుకరించరాదు. వ్యవసాయ విప్లవం ఇరుసుగా సామ్రాజ్యవాదుల తొత్తైన ప్రభుత్వంతో 1927లో ప్రారంభించిన సుదీర్ఘ సాయుధ పోరాటం అనుకూల చారిత్రక పరిస్థితుల్లో ఇరవై రెండేండ్ల అనంతరం విజయం సాధించింది. భారతదేశంలోని కాంగ్రెస్ ప్రభుత్వం సామ్రాజ్యవాదుల తొత్తుకాదు. ఇక్కడున్న జాతీయ బూర్జువా వర్గం చైనాలో లాగా సామ్రాజ్యవాదుల మీద ఆధారపడి వ్యాపారం సాగిస్తున్న దళారీ బూర్జువా వర్గం కాదు. నాటి చైనాకు, నేటి భారత్‌కు పోలికే లేదు. ఫ్యూడల్ భూస్వామిక విధానం రద్దయి, వాటి అవశేషాలు మాత్రమే

మిగిలి ఉన్న వ్యవసాయం మనది. మన వ్యవసాయరంగంలో పెట్టుబడిదారీ విధానం నానాటికీ చొచ్చుకుపోతోంది. నేటి భారతీయ విప్లవంలో పరిశ్రమలు, వ్యవసాయ రంగాల్లోని కార్మికులు, పట్టణ, గ్రామీణ పేదలు ప్రధాన పాత్ర వహించగల వర్గాలు. ఇరవై రెండేండ్లలో చైనా విముక్తి సాధిస్తే, నలభై ఏండ్ల నుండి సాయుధ పోరాటం సాగిస్తున్న నక్సలైట్లు ఒక్క విముక్తి స్థావరమన్నా ఏర్పాటు చేసుకోగలిగారా? విముక్తి సైన్యం ఏదీ? తెలంగాణ సాయుధ పోరాటంలో మూడువేల గ్రామాలను విముక్తి చేసి, పదిలక్షల ఎకరాలను పంచారు. మావోయిస్టులు ఈ నలభై ఏండ్లలో సాధించిందేమిటి?

దేశంలో విప్లవ పరిస్థితి ఉన్నప్పుడే విప్లవం సాధ్యం. ఆ పరిస్థితి నక్సలైట్లు సాయుధ పోరాటం ప్రారంభించినప్పుడు గానీ, ఇప్పుడు గానీ లేదు. లెనినిస్ట్ విశ్లేషణ ప్రకారం విప్లవ పరిస్థితికి మూడు సానుకూల అంశాలు ఉండాలి. ఒక ఊపు ఊపితే, పడిపోయేటంత బలహీనమైన ప్రభుత్వం ఉండాలి. అంటే అది రాజకీయ సంక్షోభంలో ఉండాలి. ఆ ప్రభుత్వాన్ని కూలదోస్తే గాని మనుగడలేని దుస్సహ పరిస్థితిలో ప్రజలు ఉండాలి. ప్రజలను నడపగల శక్తివంతమైన, దేశవ్యాప్త విప్లవపార్టీ ఉండాలి. అప్పుడే విప్లవం జయిస్తుంది. ఈ మూడు లేకుండా చేసేది నేలవిడిచి చేసే సాముతో సమానం. రోజులు గడిచేకొద్దీ మరిన్ని హత్యలు, రక్తపాతం తప్ప ముందుకు పోయేది ఉండదు. విప్లవ పార్టీకి ఓటములు ఎదురైనప్పుడు తిరోగమనం తెలిసి ఉండాలి. తిరోగమనం మార్క్సిజానికి వ్యతిరేకం కాదు. చర్చల్లో నక్సలైట్లు ప్రభుత్వం ముందు పెట్టిన కోర్కెల సాధనకు రాజ్యాంగ హక్కు ప్రకారం ఇతర వామపక్షాలతో కలిసి ఉద్యమం జరిపితే నెరవేరనివి కావు. మావోయిస్టులు తమ పంథా మార్చుకుంటే వారికీ, దేశానికీ మంచిది.

### భవిష్యత్తుకు బాట

అరవై ఏండ్ల స్వరాజ్యం తరువాత మనం ఎక్కడున్నాం, భవిష్యత్తు ఏమిటి, ఎటు అని బాధ్యతగల పౌరుడు వేసుకునే ప్రశ్న ఇది. అరవై ఏండ్ల కిందట బ్రిటిష్ పాలనను అంతమొందించి మనదేశ భవిష్యత్తును మన చేతిలోకి తీసుకున్నాం. అయితే ఆశించిన లక్ష్యాలు నెరవేరాయా? గాంధీ, నెహ్రూ, భగత్‌సింగ్ కన్న కలలు నెరవేరాయా? రామరాజ్యం ఏమోగాని, శ్రేయోరాజ్యమైనా సాధించుకున్నామా? రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు అమలు జరిగాయా? సోషలిజం దేవుడెరుగు, కనీసం పేదరికం, అజ్ఞానం, నిరక్షరాస్యత లేని భారత్‌ను సుదూర భవిష్యత్తులో మనం చూడగలమా?

అవును ఇది సాధ్యమే. అయితే ఎలా? 2020కి మనదేశం సూపర్ పవర్ అవుతుందనీ, అభివృద్ధి చెందిన దేశంగా అవతరించగలదనీ అత్యుత్సాహవంతుల అంచనా. కొన్ని రంగాల్లో ఇది సాధ్యం కావచ్చు. సాంకేతిక రంగంలో ఇది సాధ్యం కావచ్చు. సర్వీసెస్ రంగంలో సాధ్యం కావచ్చు. కొన్ని వర్గాలు అభివృద్ధి శిఖరాలు అందుకోవచ్చు. 10-20 శాతం జనాభాకు అత్యంత విలాసవంతమైన జీవితం సాధ్యం కావచ్చు. అయితే దీనినే సూపర్‌పవర్ అని గానీ, అభివృద్ధిచెందిన దేశంగా గానీ, పిలిస్తే అది ఆత్మవంచనే అవుతుంది.

సమస్యల్లోకెల్లా సమస్య పేదరికం. మన దేశంలో ముప్పై కోట్ల మంది పేదలు ఉన్నారు. నిరుద్యోగులు కోకొల్లలు. పేదలు, ధనికులమధ్య అఖాతం పెరుగుతోంది. నిరుద్యోగమే పేదరికానికి ప్రధాన కారణం. పేదరికాన్ని రూపుమాపగలమా అనేది మిలియన్ డాలర్ల ప్రశ్న. కంప్యూటర్‌రంగ ఉద్యోగాలు పరిమితం. దానికి అర్హులైనవారు బహు స్వల్పం. కాబట్టి పరిశ్రమలు, వ్యవసాయ రంగాల్లో పునరుజ్జీవం రావాలి. సంపూర్ణ పారిశ్రామికీకరణ నిరుద్యోగానికి కీలక పరిష్కారం. సెజ్‌లైనా ఫరవాలేదు. అయితే అవి ఉపాధి కల్పించేవిగా ఉండాలి. గిట్టుబాటుగాని, తరచు కరువుల బారినపడ్డ మెట్టప్రాంతాల్లో వీటిని నెలకొల్పాలి. మన వ్యవసాయం 70 శాతం జనాభాను భరించలేదు. మన పేదరికానికి ప్రధానకారణం ఇది. ఇందులో సగం మందిని పరిశ్రమల్లోకి తరలించాలి. ఇందుకు ఎంతో భూమి కావాల్సి ఉంటుంది. బంజర్లు, బీడు భూములు, మెట్టభూములు ఇందుకు వినియోగించాలి. వ్యవసాయ భూమి తగ్గిపోయే మాట నిజం. అయితే తక్కువ భూమితో, తక్కువ నీటితో ఎక్కువ పంట పండించే విధానం ఎంచుకోవాలి. పంటభూమి మనకంటే సగంఉన్న చైనాలో మనకంటే రెండింతలు పండిస్తున్నారు. టెక్నాలజీలో మార్పురావాలి.

నాణ్యమైన విత్తనాలమీద పరిశోధన కేంద్రీకరించాలి. దేశవాళీ పాడిపశువుల స్థానంలో నాణ్యమైన జాతి పశువులను చేర్చుకోవాలి. మన వ్యవసాయ సీజన్ మూడు మాసాల నుండి ఆరు మాసాలు మాత్రమే. అందువల్ల సీజన్‌లోనూ, అన్ సీజన్‌లోనూ చైనాలో లాగా ఉపవృత్తులను ఎంచుకోవాలి. ఎనిమిదవ తరగతి వరకు విద్య నిర్బంధం కావాలి. 6-8 తరగతుల్లో ఇంగ్లిష్‌లో ప్రాథమిక జ్ఞానం కలిగించాలి. వృత్తి విద్య జతచేయాలి. మోటు శ్రమస్థానంలో నైపుణ్యమైన శ్రమ రావాలి. అప్పుడే విజ్ఞానంతోపాటు ఆదాయం పెరుగుతుంది. వ్యవసాయాధారిత పరిశ్రమలు విస్తృతస్థాయిలో నెలకొల్పాలి. పై వ్యూహాన్ని అనుసరిస్తే ప్రధానంగా నిరుద్యోగం, పేదరికం పరిష్కారమవుతాయి. ఆహార భద్రత కొరకు అరవై శాతంగా ఉన్న వర్షాధార భూములకు పారుదల సౌకర్యం కలిగించాలి. నదుల అనుసంధానం చేసి సముద్రం పాలయ్యే విలువైన నీటిని మెట్ట ప్రాంతాలకు మళ్లించాలి. వై.ఎస్. ప్రభుత్వ జలయజ్ఞం దేశానికి ఆదర్శం కావాలి. వ్యవసాయ ఉత్పాదకతను బాగా పెంచాలి. మన వ్యవసాయంలోని 'అకిలీస్ హీల్' ఇదే.

ఒకదేశ సౌభాగ్యానికి కొలబద్ద ఆదేశపు తలసరి విద్యుత్ వాడకం బట్టి తేలుతుంది. విద్యుత్ అంతకీలక పాత్ర వహిస్తుంది. కార్లు, బైకల స్థానంలో చక్కని మాస్‌ట్రాన్స్‌పోర్ట్ రావాలి. మాస్‌ట్రాన్స్‌పోర్ట్‌కు విద్యుత్‌ను ఇంధనంగా వాడాలి. విద్యుత్ ఉత్పాదనలో అణుఇంధనం పాత్ర పెరగాలి. కాలుష్యం లేకుండా పరిశ్రమలు ఉండవు. ఆ కారణంతో పరిశ్రమలను అడ్డుకోరాదు. కాలుష్య నివారణకు సాధ్యమైనమేర చర్యలు తీసుకోవాలి.

మన అరవై ఏండ్ల స్వాతంత్ర్యానంతరం నూతన అధ్యాయం ప్రారంభం కావాలంటే రాజకీయ సమీకరణల్లో మార్పురావాలి. శ్రమ జీవులకు భాగస్వామ్యం ఉండే ప్రభుత్వం రావాలి. వామపక్షాల బలం మరింతగా పెరగాలి. ఆ మూడు రాష్ట్రాలు తప్ప మిగిలిన విశాల భారతం లో మార్పుల్లైం సాగించేస్థితికి స్వస్తిచెప్పాలి. వామపక్షాల పురోగమనం మీదనే దేశ పురోగమనం ఆధారపడి ఉంది. అంతవరకు సూత్ర బద్ధమైన పొత్తులతో, సెక్యులర్ శక్తుల ఐక్యతతో ముందుకు సాగడంతప్ప మరో మార్గంలేదు. పార్లమెంటరీ బలం మీదనే ఆధారపడకుండా ప్రజా సమీకరణ ద్వారా సానుకూల విధానాలవైపు మొగ్గేటట్లు ఒత్తిడితేవాలి.

అరవై ఏండ్ల స్వరాజ్యం తరువాత వేలాది మంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారంటే జాతికి సిగ్గుచేటు. సాటి దేశాల్లో తలెత్తుకుని తిరగలేం. ఇది పోవాలి. పేదరికం, నిరుద్యోగం, ఆత్మహత్యలు లేని, ఏ ఒక్కరూ కంట తడిపెట్టని, శ్రీశ్రీ మాటల్లో చెప్పాలంటే బాధాసర్ప దష్టులేని సుభిక్ష భారత్‌కై పునరంకితమవుదాం. ◆

**వ్యవసాయ, కార్మిక రంగాలలో గత పాతికేళ్లలో వచ్చిన మార్పులు, ప్రజల స్థితిగతులు తెలుగు సాహిత్యంలో ఎలా ప్రతిఫలించాయో చెబుతున్నారు బి.వి.ఎన్. స్వామి**

# చారిత్రక సాక్షిగా తెలుగు కథ

అనంతకాలంలో రెండు దశాబ్దాలు చాలా చిన్న పరిధి. సామాజిక జీవనంలో ఈ కాలాన్ని రెండు తరాలుగా లెక్కించవచ్చు. 1980 నుండి నేటి వరకు గల కాలం ప్రజాజీవనం లో అనేక ప్రభావాలను చూపింది. జాతీయ, అంతర్జాతీయ రంగాలలో చోటు చేసుకున్న మార్పులు మారు మూల పల్లెను ఏ విధంగా మార్చాయో నిశితంగా గమనిస్తే తెలుస్తుంది. అభివృద్ధి, ఆర్థిక ప్రగతి, సాంకేతికత, సంప్రదాయం తమతమ పరిధిలో అనేక మార్పులకు గురయ్యాయి. ఈ మార్పుల వల్ల చేకూరిన ఫలాలు సమాజాన్ని ఎంత వరకు ప్రశాంతంగా ఉండనిచ్చాయో పరిశోధించాల్సిన అవసరం ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో 1980వ దశకం వచ్చేసరికి మధ్య తరగతి బలపడింది. తెలంగాణ, కళింగ ప్రాంతాల్లో నక్సల్బరీ పోరాట గాలులు బలంగానే ఉన్నాయి. కోస్తాంధ్ర నూతన శతాబ్ది వైపు వేగంగా పరుగులిడుతోంది. ఫ్యాక్షన్, కరువు దాడులతో రాయలసీమ సతమత మవుతోంది. ఆ విధంగా ఆంధ్రప్రదేశ్ చిత్రపటం రెపరెపలాడుతుండగా నూతన ఆర్థిక సంస్కరణలు వచ్చిచేరాయి. నూతన ఆర్థిక విధానమంటే సరళీకృత ఆర్థిక విధానం. ప్రభుత్వ నియంత్రణ నుండి అంతర్జాతీయ ద్రవ్యనిధి విధానాలకు అనుగుణంగా వివిధ దేశాల ఆర్థిక వ్యవస్థలను ప్రపంచ బ్యాంకు నియంత్రణ లోనికి తేవడమే సరళీకృత ఆర్థిక విధానం. ఏ దేశ ఆర్థిక విధానాన్నయినా ప్రపంచానికి తెరచిఉంచడం ప్రపంచీకరణ లోని ఒక పార్శ్వం. భిన్న దేశాల మధ్య సరుకులు, సేవలు స్వేచ్ఛగా వినిమయం కావటానికి స్వేచ్ఛా మార్కెట్‌ను ఏర్పరచటం దీని లక్షణం. సరళీకరణ విదేశాలకు ద్వారం తెరచింది. దాంతో శీతల పానీయాలు చొరబడ్డాయి. కోకాకోలా లాంటి విదేశీ పానీయాలు తెలుగు దేశంలో సాంస్కృతిక మార్పులకు బీజం వేశాయి. ఈ మార్పుల వల్ల జరిగిన ప్రతి పరిణామాన్నీ తెలుగు కథ రికార్డ్ చేసింది. సరళీకృత ఆర్థిక విధానాల ప్రభావంలో కొట్టుకపోకుండా విలువల కోసం ఘర్షణ పడే స్త్రీని ఓల్గా రాసిన 'కోకాకోలా' కథలో చూడవచ్చు. స్వదేశీ కంపెనీలను, విదేశీ కంపెనీలు ఏ విధంగా అణచివేస్తున్నాయో ఈ కథలో గమనించవచ్చు. ఈ ధోరణిలో వచ్చిందే ఖదీర్‌బాబు రాసిన 'పెండెంసోడా సెంటర్' కథ.

వ్యవసాయిక ఒప్పందం భూమికగా వ్యవసాయంలో వచ్చిన మార్పులను, ఆ మార్పుల వల్ల మారిన గ్రామీణ ముఖచిత్రాన్ని చిత్రిస్తూ అనేక కథలు వచ్చాయి. ప్రపంచీకరణ వ్యవసాయ రంగంలో తెచ్చిన మార్పులనూ, ఆ మార్పులు రైతాంగ జీవితాల్లో కలిగించిన సంక్షోభాన్నీ, చేసుకున్న ఆత్మహత్యలనూ తెలుపుతూ అనేకులు కథలు రాశారు. భూమినే నమ్ముకున్న రైతు రోజు రోజుకూ ఆర్థికంగా దిగజారిపోవడానికి మూలాలు భూమిలో కాక, వ్యవసాయిక విధానాల్లో ఉన్నాయనీ, భూమిని నమ్ముకున్న రైతు భూమికే పరాయిగా మారడం జరుగుతోందని కాలువ మల్లయ్య రాసిన 'నేలతల్లి' చెబుతుంది. కోస్తా ఆంధ్ర ప్రాంతం నుండి ఉత్తరాంధ్రకు వలస వెళ్లినవారు అక్కడి భూములను చౌకగా కొని, పెట్టుబడులు పెట్టి, ఆహార పంటలకు బదులు వ్యాపార పంటలు పండించడం వల్ల గ్రామీణ జన జీవితంలో ఏర్పడిన సంక్షోభం గంటేడు గౌరునాయుడు రాసిన 'తిరుగుడు గుమ్మి', 'నరాలు తెగుతున్న నేల' కథల్లో కనపడుతుంది. కార్పొరేట్ వ్యవసాయ విధానం వల్ల ఊరిలోని మానవ సంబంధాలు, సమష్టితత్వం దెబ్బతినడం, రైతుల బతుకే కాదు, పశులకాపర్ల జీవితం కూడా దుర్భరం కావడం కథల్లో కనపడుతుంది. బండి నారాయణ స్వామి రాసిన 'తెల్లదయ్యం' అనే గ్రామవివక్ష కథ విలక్షణమైంది. ఈ దేశపు మట్టిమీద, నీళ్లమీద, సకల వనరుల మీద ఆధిపత్యం స్థాపించుకొని విదేశీయుల ప్రయోగశాలగా దేశాన్ని మారుస్తున్న వారి వైనం ఇందులో కనపడుతుంది. శిల్పపరంగా సమున్నతమైన కథ ఇది. కొత్త వస్తు ప్రపంచం, కొత్త అవకాశాలు, చదువుకున్న యువతరాన్ని నగరబాట పట్టించాయి. కుటుంబ అవసరాల కోసం ఊళ్లో భూమిని అమ్ముకునే ఆలోచన దిశగా యువతరం ఆలోచనలు మళ్లాయి. నమ్ముకున్న భూమిని కొడుకు కలిగించిన ఒత్తిడి వల్ల అమ్మడానికి బయల్దేరడం 'క్షతగాత్ర గానం' కథలో వినపడుతుంది. హరిత విప్లవం వ్యవసాయాన్ని వాణిజ్య ధోరణిలోకి మార్చడం వల్ల సన్నకారు రైతు వ్యవసాయం చేయలేక, భూమికి పరాయి అయి, జీవితాన్ని వెళ్లదీయలేక ఆత్మహత్యలు చేసుకోవడాన్ని అనేక కథలు చిత్రించాయి. ఆవు, పులి మరికొన్ని కథలు, నీటిపిట్టలు కథలు రాసిన డా. వి. చంద్రశేఖరరావు మార్మికత ప్రధాన శిల్పంగా చేసుకొని గ్రామీణ వ్యవసాయక జీవిత సంక్షోభాన్ని వెల్లడించారు. బహుళజాతి సంస్థలు స్వయంగా పంటను పండించి మార్కెట్లోకి ప్రవేశపెట్టినపుడు నాణ్యతలో గానీ, ధరలో గానీ పోటీపడడం సామాన్య రైతుకు సాధ్యపడదు. ఈ విషయాన్ని అశోక్‌కుమార్ 'కీలుబొమ్మ' కథలో వివరించారు. కేతు విశ్వనాథ రెడ్డిరాసిన 'విరూపం' కథ రిపోర్ట్ రూపంలో ఉన్న రైతాంగ జీవిత సంక్షోభం. గ్రామీణ జీవిత సంక్షోభాన్ని చిత్రించిన కథలలో చాలా వరకు వ్యవసాయ ఉత్పత్తి విధానాలలో వచ్చిన మార్పుల వల్ల కుదేలైన రైతు, ఆత్మహత్యలే పరిష్కార మార్గంగా ఎన్నుకున్న వస్తువును ప్రధానంగా చేసుకొని చాలా కథలు వచ్చాయి. ముదిగంటి సుజాతారెడ్డి 'జవాబులేని ప్రశ్నలు', గీతాంజలి రాసిన 'సంటిది', బుర్రరాములు రాసిన 'గీ బతుకెందుకు', శాంతి నారాయణ

'రతనాలసీమ', కాసులప్రతాపరెడ్డి 'శిథిలం', బమ్మిడి జగదీశ్వరరావు 'గతుకులు', సింగమనేని 'అదును', కాట్రగడ్డ దయానంద్ 'తలపాగ స్వగతం', స్వామి 'వానరాలె' లాంటి అనేక కథలు వ్యవసాయిక దేశంలో రైతు జీవితంలోని దుర్భర పరిస్థితులను చూపించాయి.

దేశ సౌభాగ్యాన్ని నిలబెట్టే ద్వితీయ రంగానికి చెందిన పరిశ్రమలు ఆంధ్రప్రదేశ్‌లో పెద్దగా అభివృద్ధిలో లేవు. ఆంధ్రప్రదేశ్‌లో బొగ్గుగనులు పారిశ్రామిక రంగానికి అడ్రస్‌గా ఉన్నాయి. వ్యవసాయోత్పత్తిలోకి బలంగా చొరబడ్డ వాణిజ్య విధానాలు, గ్రామీణ భూస్వామ్య పీడన, తెలంగాణలోని పేద, సన్నకారు రైతులను తమ భూములకు పరాయిగా మార్చి ఊర్ల నుంచి తరిమి వేశాయి. ఆ సమయంలో వారిని అక్కున చేర్చుకున్నవి బొగ్గుగనులు. బొగ్గుగని కార్మికులుగా మారిన వీరి జీవితం గనుల వద్ద, పారిశ్రామిక వాడల మధ్య పీడనకు గురైంది. మస్టర్లకోత, గనుల్లో వసతుల లేమి, నీటి సమస్య, గూడు సమస్య కార్మికులను దిక్కుతోచని పరిస్థితుల్లోకి నెట్టివేశాయి. ఈ పరిస్థితుల్లో జరిగిన అభివృద్ధి అసమానతలను పెంచింది. పారిశ్రామిక రంగంలోని ప్రత్యక్ష, పరోక్ష హింస, సంఘర్షణలను కథలు నమోదు చేసాయి. పూటగడవడం కోసం తట్టబొగ్గు తెచ్చుకోవటం నేరమై కార్మికుడు రాజ్య విచారణకు గురి కావడాన్ని వస్తువుగా చేసుకున్న కార్మిక కథ 'దొంగలు'. కార్మికుల కడగండ్లను విప్లవోద్యమం పట్టించుకుంది. విప్లవ కార్యకర్తలు తమ ఉనికి ద్వారా, ప్రవర్తన ద్వారా, ఆచరణ ద్వారా ప్రజలలో భాగమై జీవితంలో విడదీయరాని బంధమై సకల మానవ సంబంధాలలో తమ ప్రభావాన్ని అడుగడుగునా వదిలి వెళ్లిన తీరును అద్భుతంగా చిత్రించింది 'అతడు' కథ. కార్మికుల దారిద్ర్యం వారిని మరుగుజ్జులుగా మార్చి తమలో తాము శత్రువులై కలహించే దౌర్భాగ్యానికి దిగజార్చటం వల్ల అసలు శత్రువులు ఎవరో తెలుసుకోకపోవటాన్ని ఎత్తి చూపుతుంది తుమ్మేటి రఘోత్తమరెడ్డి రాసిన 'ఉరి' కథ. సింగరేణి బొగ్గుగనుల వల్ల భూములను, జీవనోపాదులను కోల్పోయి, సహజ వనరులను కోల్పోయి బికారులుగా నష్టపరిహారం కోసం ఎదురు చూసే వారి జీవితాల్ని పి. చంద్ భూ నిర్వాసితులు పేర కథలుగా రాశారు. నూతన పారిశ్రామిక ఆర్థిక విధానాలు, ప్రపంచ బ్యాంక్ అప్పులు, పరిశ్రమల మూసివేత వేలాది మంది బతుకుల్లో కల్లోలం లేపడం వెనుక ప్రపంచీకరణ ఉంది. పులుగు శ్రీనివాస్ రాసిన కార్మిక కథల్లో, ఆడెపు లక్ష్మీపతి రాసిన 'జీవన్మృతుడు' కథలో ఈ విధ్వంస దృశ్యాన్ని చూడవచ్చు. ఉద్యోగం లేదని తీసివేస్తే, బతుకు దుర్భరమై చనిపోయిన కార్మికుని ఆత్మఘోషే గొరుసు జగదీశ్వరరెడ్డి 'బతుకుగోస' కథ. ప్రపంచీకరణ లక్ష్యంగా గల నూతన ఆర్థిక విధానాల ఫలితంగా ప్రభుత్వరంగసంస్థల మూసివేత, చిన్నపరిశ్రమల మూసివేత ముమ్మరమవుతున్న సందర్భం ఇది. లాకౌట్లను ప్రకటించడం, కార్మికుల పనిహక్కుకు భంగం కలిగించటం చేస్తూ అన్యాయంగా కార్మికుల జీవితాలను బజారున పడేస్తున్న పారిశ్రామిక విధానం జీవితంలో, మానవ సంబంధాలలో తెస్తున్న మార్పును కార్మిక కథలు చిత్రించాయి. 'నల్లకలువలు' కథా సంకలనంలోని కథలు కార్మికుల కడగండ్లను బహుముఖంగా చిత్రించాయి. చిన్న పరిశ్రమలు ఖాయిలా పడటానికి, క్రమంగా మూతపడడానికి వెనుక ఉన్న పెద్ద కథ గురించి కథలు అల్లిన రచయిత్రి సోమరాజు సుశీల. వీరి చిన్న పరిశ్రమలు – పెద్ద కథలు ప్రపంచీకరణ ప్రభావాన్ని తెలుపుతాయి. కె. వరలక్ష్మి రాసిన 'మట్టి–బంగారం' కథ కూడా ఈ కోవలోనిదే.

వర్గపోరాటాలు దళిత సమస్యకు పరిష్కారాన్నివ్వజాలవని, కులస్పృహతో వర్ణవ్యవస్థను ఎదిరించాలనే దృక్పథంతో, దళిత పీడనకు, దోపిడీకి వ్యతిరేకంగా తిరుగుబాటు జెండా ఎగరవేయాలనే నేపథ్యంలో కథలు అనేకం వచ్చాయి. పిల్లల నుండి పెద్దల వరకు, స్త్రీ–పురుషులు, రైతుకూలీలు, ఉద్యోగస్తులు, వర్ణవివక్ష కారణంగా దళితులెందరో ఎన్నో దశలలో అణచివేతలను, అవమానాలను ఎదుర్కొంటున్న తీరును ఈ కథలు సభ్యసమాజానికి విప్పిచెప్పాయి. ఉద్యోగం చేసే చోట ఉనికి కోసం, ఉన్నతికోసం దళితులు ఎంతెంత ఒంటరి పోరాటాలు చేయవలసి ఉంటుందో స్వామి రాసిన 'ప్రశాంతం' లాంటి కథలు చూపించాయి. 'బఫల్లోస్ క్లబ్' కథలో రిజర్వేషన్ ద్వారా రాజకీయాధికారాన్ని పొందిన దళిత స్త్రీలు యథాపూర్వకంగా పెత్తందార్ల అధికారానికీ, పీడనకూ గురి కావటాన్ని చెప్పాయి. దళిత స్త్రీలను బసివినులుగా మార్చే సంప్రదాయంలో ఎంత హింస దాగివుందో, గ్రామ పెద్దల పెత్తందార్ల ప్రయోజనాలు ఎట్లా ఇమిడి ఉన్నాయో నాగప్పగారి సుందర్రాజు రాసిన 'నడిమింటి బోడెక్క బసివిరాలయ్యేద' కథ చూపించింది. గుండెడప్పు కనకయ్య మాదిగ కులస్తుల జీవిత విధానాన్ని, వాళ్ల పెళ్లి పేరంటాలను, సాంస్కృతిక విశేషాలను చిత్రిస్తూ రాసిన 'యక్షగానం', 'మహావీరులు' కథలు ఇందులో భాగంగా వచ్చినవి. స్వీయ జీవితానుభవాలకు, దళిత సామాజిక దృక్పథాన్ని కలిపి ఎండ్లూరి సుధాకర్ చెప్పిన 'మల్లెమొగ్గల గొడుగు' కథలు ఈ మార్గంలో జరిగిన మంచి ప్రయోగం. బి.ఎస్. రాములు 'తెల్లబట్ట', 'ఇల్లాలు', కాలువ మల్లయ్య రాసిన 'ఎంగిలి చేత్తో', 'ఉద్ధరింపు' కథలు దళిత సమస్యపై వచ్చిన మంచి కథలు. 'దక్షయజ్ఞం' దళిత కథకు ఉదాహరణగా నిలుస్తుంది. బోయ జంగయ్య కథలు దళిత సమస్యలను ఎలుగెత్తి చెప్పాయి. జింబో రాసిన 'చెప్పులు', దార్ల రామచంద్ర 'బతుకుబడి', జూకంటి జగన్నాథం 'కళేబరం' దళితుల విముక్తి గురించి వచ్చిన మంచి కథలు. ఆడెపు లక్ష్మీపతి 'రాబందులు', సదానందశారద 'ఉప్పునీళ్లు', ఇంకా ఇతరులు రాసిన 'పాలు', 'కర్రోడు', 'ఊరిబాయి' లాంటి కథలు దళిత కథకు వన్నెతెచ్చాయి. కొలకలూరి ఇనాక్ లాంటి సీనియర్ రచయితలు దళితకథకు జీవంపోస్తున్నారు. సీరియస్ గా వచ్చిన దళిత కథా సంకలనాలు దళిత కథకు చిరునామాగా మిగిలాయి.

వర్గ దృక్పథం తమ సమస్యలకు పరిష్కారాన్నివ్వకపోవడం వల్ల, విస్మృతికి గురైన శ్రేణులు ప్రత్యేక అస్తిత్వ ధోరణులతో ముందుకొచ్చాయి. అందులో స్త్రీవాదమొకటి. పితృస్వామిక, లైంగిక, రాజకీయాల కోణం నుండి స్త్రీ జీవితం లోని భిన్న పార్శ్వాలు, భిన్న అనుభవాలు కొత్తగా వ్యాఖ్యానించబడ్డాయి. ఈ వ్యాఖ్యానాలకూ, జీవితాలకూ తెలుగు కథ పెద్దపీట వేసింది. స్త్రీలను వాళ్ల శరీరావయవాల మధ్య బందీలుగా చేసిన పితృస్వామిక సంస్కృతీ రాజకీయాలను ఓల్గా రాజకీయ కథలు బయటపెట్టాయి. స్త్రీల జీవిత విధానాన్ని శాసించే సామాజిక, ఆర్థిక, రాజకీయ చీకటి విధానాల నుండి స్త్రీలు వెలుతురులోకి రావాలని ఆశిస్తూ అనేక కథలు వచ్చాయి. ఈ కథలు తెలుగు సాహిత్యానికి కొత్త శక్తిని ప్రసాదించాయి. స్త్రీ తనెవరని అన్న ప్రశ్నలో తనను తాను తెలుసుకొనటానికి చేసిన ప్రయత్నంలో సాగించిన ప్రస్థానాన్ని పి. సత్యవతి 'ఇల్లలకగానే' అనే కథలో చూపించారు. వివాహం స్త్రీల స్వేచ్ఛను హరిస్తుందని, ఒంటరిగా బతకడానికి సిద్ధమవుతున్న సింగిల్ ఉమెన్‌ను

వస్తువుగా చేసుకొని కుప్పిలి పద్మ 'ముక్త', 'కేసు', 'ఇల్లీగల్' వంటి కథలు రాసింది. కుటుంబంలో అన్ని అవసరాలకు తానే అవుతూ కూడా ఎవరి గౌరవానికీ, కృతజ్ఞతకూ నోచుకోని స్త్రీ స్థితిని మసిగుడ్డతో పోలుస్తూ రాసిన 'మసిగుడ్డ' కథ చెప్పుకోతగింది. కట్నాల కోసం స్త్రీలను వేధించే వ్యవస్థలో స్త్రీల ఇంటి చాకిరికి మాత్రం ఖరీదు లేకపోవటాన్ని ప్రశ్నిస్తూ 'ఖరీదు', స్త్రీలు స్వేచ్ఛగా స్వతంత్రులుగా ఎదగటానికి కృతనిశ్చయులై ప్రయత్నపరులవుతున్న సందర్భాన్ని అభినందిస్తూ 'రెక్కలున్న పిల్ల' లాంటి కథలు రాసి ఎస్. జయ స్త్రీవాద కథకు బలాన్నిచ్చారు. సి. సుజాత 'రెప్పచాటు ఉప్పెన', నల్లూరి రుక్మిణి 'చంద్రవంక', 'బిగించి కట్టిన మూటలు', కొండెపూడి నిర్మల 'ఎద్దుపుండు', 'నరకంలో నాలుగు నిమిషాలు', 'అతని భార్య' మొదలైన కథలు స్త్రీవాద కథకు జవజీవాల్నిచ్చాయి. ప్రపంచీకరణ ప్రభావాలు స్త్రీ జీవితం పై ఎలా ఉంటాయో ముదిగంటి సుజాతారెడ్డి 'నిశ్శబ్దం' అనే కథలో అద్భుతంగా చిత్రించారు. ప్రపంచీకరణ అనేది మన బెడ్‌రూంల్లోకి వచ్చి చేరింది అన్న కుప్పిల పద్మ మాటలు అనేక రంగుల్లో స్త్రీవాద కథల్లో దర్శనమిస్తాయి. ఇందుగలడందులేదని, 'పనికిరాని సగం', 'తాయమ్మకథ', 'రేణ', 'రెక్కలు', 'సతి', 'పుట్టినిల్లు–మెట్టినిల్లు', 'బిడ్డలు గల తల్లి', 'నోరుగల్ల ఆడది' లాంటి వందలాది కథలు స్త్రీవాద కథాసాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. జి. కళ్యాణరావు రాసిన 'అంతమ్మ మనసు' వినూత్న తరహాలో ఉంది. దళిత కులాల పురుషులు వర్గ, కుల పీడనలకు లోనవుతుంటే దళిత స్త్రీ ఆ రెంటికీ తోడు లైంగిక పీడనకు కూడా గురి అవుతోంది. ఈ కోణంలో కూడా అనేక కథలు వచ్చాయి.

దేశంలో రెండవ శ్రేణి పౌరులుగా బతుకులీడుస్తున్నామనే భావన ముస్లింలలో కలగడానికి అనేక కారణాలున్నాయి. మాతృదేశానికి పరాయిగా బతకడం, తమ దేశభక్తిని నిరూపించుకోవాల్సి రావడం దుర్భరం. అయోధ్య ఘటన దానికనుగుణమైన రాజకీయ భావజాలం, ముస్లింవాదం ముందుకు రావడానికి కారణాలయ్యాయి. ఈ సమయంలో ముస్లింల జీవిత సమస్యలకు, మనోభావాలకు అద్దం పడుతూ కథలు రాయడం ప్రారంభమైంది. ఖదీర్‌బాబు రాసిన 'దావత్' కథ ముస్లింల వివాహ విందు సందర్భాన్ని వస్తువుగా చేసికొని స్త్రీల పట్ల అమలవుతున్న వివక్షా స్వభావాన్ని, హింసను, పురుషుల దాష్టికాన్ని చిత్రించింది. పేదరికం, భర్త నిరాదరణ ముస్లిం స్త్రీల జీవితంలో సృష్టించే చీకటిని చిత్రిస్తూ స్కైబాబ 'భడక్తా చిరాగ్' కథ రాశారు. హిందూ, ముస్లిం శత్రుత్వాన్ని పెంచి పెద్ద చేసి సాంద్రీకరించి ఘనీభవింప చేసిన దేశభక్తి భావనను కేంద్రంగా సౌదా రాసిన వ్యంగ్య కల్పనా కథ 'నల్లగుర్రపునాడా'. అనేక చారిత్రక, వర్తమాన కారణాల వల్ల ప్రధాన వైరిపక్షాలుగా హిందూ, ముస్లిం ప్రజలు నిలిచారు. ఈ ధోరణి ప్రతిఫలనాలను 'ఖబూతరాఀ', 'మసీదు పావురం', 'వివక్ష', 'మదర్సా', 'హైవాన్' లాంటి కథలు ప్రతిబింబించాయి. ముస్లిం అగ్రవర్ణ ఫండమెంటలిజం బారిన పడ్డ జీవితాల యాతనల్ని చిత్రిస్తూ కథలు వచ్చాయి. కేవలం ముస్లిం కథకులు రాసిన కథలతో కూడిన సంకలనం 'వతన్' పేర వెలువడింది. ముస్లిం సమాజంలోనూ ఆధిపత్య, అణచివేతలకు చెందిన వర్గాలు స్పష్టంగా కనబడతాయి. పరదా పద్ధతి కిందిస్థాయి ప్రజల్ని అధికంగా మెలిపెట్టింది కనుకనే సంకలనంలోని అనేక కథలు ఈ పద్ధతిని నిరసించాయి. తెలంగాణ ప్రాంతానికి చెందిన చారిత్రక వాస్తవాల ఆధారంగా వచ్చిన కథ 'ముల్కీ'. 'వతన్' సంకలనం లోని కథలన్నీ ముస్లింల కష్టాలను, కడగండ్లను, వివక్షలను... ఒకటేమిటి సమస్తాన్ని తెలియజేశాయి.

పర్యావరణ కాలుష్యం అనేది ప్రపంచ దేశాల ఉమ్మడి సమస్య. అగ్రదేశాల అణువిన్యాసాలకు, వాణిజ్య అవసరాలకు, యుద్ధకండూతికి ఓజోన్ పొర బలి అయింది. దాని ప్రభావం మానవ జీవితం పై పడింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులు కూడా కారణాలయ్యాయి. విత్తనం వేసి మొక్కలు పెంచి పంటలు తీసే రైతు ఆర్థిక అవసరాల కోసం, అప్పులు తీర్చటం కోసం చెట్లు కొట్టేసుకు పోవలసిన పరిస్థితులోకి నెట్టబడటం కేతు విశ్వనాథరెడ్డి రాసిన 'ఒక దృశ్యం – మరొక చిత్రం' కథలో కనపడుతుంది. పర్యావరణాన్ని కాపాడుకునే రైతు విధ్వంసానికి దిగాల్సిన సామాజిక వైరుధ్యాన్ని సృష్టిస్తున్న రాజకీయార్థిక కోణాలను ముందుకు తీసుకొని రావడం ఈ కథ చేసిన పని. పాపినేని శివశంకర్ రాసిన 'చింతలతోపు' కథ కూడా ఇటువంటిదే. డబ్బు సంపాదన యావలో పడి చెట్లు కొట్టే వాళ్లు పర్యావరణ విధ్వంసకులు అని తేల్చి చెప్పిన కథ. దాదా హయత్ రాసిన 'మురళి ఊదే పాపడు', 'భూమిపుత్రుడు', 'మానవ ఫాక్టర్' కథలు భూమితో సంబంధం లేని సాంకేతిక శాస్త్రాభివృద్ధి నిరర్థకమని తెలిపాయి. మానవ నాగరికత నదీతీరాలల్లో వెల్లివిరిసిందనేది సత్యం. అటువంటి నదులు ఎండిపోవడం ఒక విపరితమైతే నదీగర్భం లోని ఇసుకను ఖాళీ చేయటం తద్వారా డబ్బు సంపాదించడాన్ని చర్చకు పెట్టింది దేవయాని రాసిన 'పేగుముడి' కథ. శాస్త్రీయ నేపథ్యం ఆధారంగా 'పత్రహరితం ప్రశ్నిస్తోంది' లాంటి కథలను సంపత్‌కుమార్ రచించాడు. ఇంకా అనేక పర్యావరణ సంబంధిత కథలు ఈ కాలంలో వచ్చాయి.

వాస్తవికతకు, కాల్పనికతను అద్ది కథలు పండించే క్రమంలో అనేక కథనరీతులను కథకులు అందిపుచ్చుకున్నారు. ఈ రెండు దశాబ్దాల్లో యూరో–అమెరికన్, ఆఫ్రికన్ కథలు, రీతులు తెలుగు కథకులకు చేరువయ్యాయి. వస్తురీత్యానూ, శిల్పరీత్యానూ తెలుగు కథ వన్నె తీరింది. ఇందుకు యువకథకులు తమ శక్తిని ధారపోశారు. చైతన్య స్రవంతి, మ్యాజిక్ రియలిజం పేర వస్తున్న కథలు చదివింపజేసేవిగా ఉన్నాయి. స్థూలంగా చెప్పుకోవాలంటే వస్తు, శిల్పాల సమన్వయం సరికొత్తగా సాధించారు. కుల, వర్గ, జెండర్, మత, ప్రాంతీయ అస్తిత్వాలు బలంగా ముందుకు వస్తున్న సమయంలో వస్తువు దేశీయంగా ఉండక తప్పని పరిస్థితి. ఈ సమయంలో పాశ్చాత్య శిల్పరీతుల్లో దేశీయ వస్తువును కూర్చుతూ అనేక కథలు వెలువడ్డాయి. దేశీయ శిల్పరీతిగా మిగిలిన జానపద బాణీలో సైతం వస్తువును పొదిగి కథను పండించిన దాఖలాలు ఉన్నాయి. కథ ఎన్ని పోకడలు పోయినా, పాఠకునికి చేరవేయడానికి సాధనంగా పని చేసేది భాష. కథను వండివార్చే క్రమంలో ఒక చోట ప్రామాణిక భాషగా, మరోచోట జీవద్భాష పేర మాండలికంగా, ఇంకోచోట ఆంగ్ల ప్రభావిత తెలుగుగా రకరకాలుగా కథను బలోపేతం చేసింది. ఈ దశలోనే శైలీ, శిల్పాలకు ప్రాధాన్యతలిచ్చే కథలు రావడం మొదలైంది. బాల్య జ్ఞాపకాలు, ప్రాంతీయ విశిష్టతల స్మరణ, వ్యక్తిగత అనుభూతులు, అశ్లీలాన్ని శృంగారంగా భ్రమింపజేసే జుగుప్సాకర ధోరణులు, సబ్ కాన్షియస్ చిత్రణ పేర సెక్స్‌ను సాహిత్యంగా అందించడం, వాస్తవికతకు అభూతకల్పనల జోడింపు, అధివాస్తవికత, అబ్సర్డ్‌నెస్, స్వీయ సైకాలజీ బేస్డ్‌గా కథలు వచ్చాయి. ఈ కథల్లో శైలి అద్భుతమైన పోకడలు పోయింది. శిల్పం వేయిరేకులు విచ్చుకుంది. రూపవాదం వేయి పడగలు దాల్చింది. వ్యక్తివాదాన్ని ఎవరెస్ట్ మీద నిలిపే

**టీవీ చూసే పిల్లల సంఖ్య, చూసే వ్యవధి ఎక్కువగానే ఉన్నా వారికోసం రూపొందుతున్న సరైన కార్యక్రమాలు లేవంటున్నారు నాగులపల్లి భాస్కరరావు, నాగసూరి వేణుగోపాల్**

# బాలల బుల్లితెర ఎక్కడ?

నేడు టీవీ చూసే వీక్షకులలో సగానికి పైగా పదిహేను సంవత్సరాల లోపు పిల్లలే ఉన్నారు. కానీ వివిధ ఛానళ్లు వండి, వడ్డిస్తున్న కార్యక్రమాలలో పిల్లలకు సంబంధించినవి కానీ, లేదా వారికి ఉపయోగపడేవి కానీ దాదాపు లేవేమో. ఛానళ్లు అన్నీ ఎక్కువ మంది వీక్షకులను పెంచుకోవాలనే తాపత్రయంతో పోటీపడుతున్నాయి. ఈ హడావిడిలో బాలల కోసం అని కాకుండా కేవలం వారికి ఆసక్తి కల్గించే, ఆకర్షించే వాటి మీద ఛానళ్లు దృష్టి పెడుతున్నాయి. ఈ పరిస్థితి గురించి ప్రభుత్వం కానీ, తల్లిదండ్రులుగానీ, ఉపాధ్యాయులుగానీ పట్టించుకోవడం లేదు. పొద్దస్తమానం ఇప్పుడు టీవీలో ప్రదర్శించే అంశాలే రేపటి తరాన్నీ, సమాజాన్నీ మలుస్తాయని వేరుగా చెప్పనక్కర్లేదు.

టీవీని పిల్లలు బాగా చూడటంవల్ల కలిగే రకరకాల అనర్థాల గురించి ప్రపంచవ్యాప్తంగా పరిశోధనలు చాలా వివరిస్తున్నాయి. హింసాత్మకమైన, అనైతికమైన ప్రవర్తన అనేది పిల్లలు టీవీ చూడటం వల్ల కలిగే ప్రత్యక్ష పర్యవసానం. దీనికి మనదేశం అతీతం కాదు. మానభంగం, దోపిడీ, ప్రతీకారం, హత్య, ఆత్మహత్య, కిడ్నాప్ వంటి వాటికి సంబంధించి ఆలోచన, వ్యూహాన్ని ఎలా టీవీ కార్యక్రమాల నుంచి స్ఫూర్తి పొందారో – కొంతమంది మనసు విప్పి చెప్పారు. వీరిలో కొందరైతే తమ జీవితకథల్లో రాశారు కూడా. ఇటువంటి టీవీ ప్రభావం గురించి న్యాయస్థానాల తీర్పుల్లో కూడా వ్యాఖ్యానించారు. టీవీ ప్రభావం అనేది రెండంచుల కత్తిలాంటిది. ఇందులో ఉపయోగపడేదానికన్నా అవాంఛనీయమైనదే ఎక్కువగా ఉంది. నిజానికి టీవీని బాలల విషయంలో ఉపయోగకరమైన రీతిలో ఎలా వినియోగించుకోవాలో, సరైన ప్రయత్నాలు సాగడంలేదు. దీని గురించి ఎక్కువ పట్టించుకోవాల్సిన తల్లిదండ్రులు మిన్నకుండటం ఆశ్చర్యంగావుంది. ఈ విషయానికి సంబంధించి సెంటర్ ఫర్ మీడియా స్టడీస్ (సి.ఎం.సి.) అధ్యయనం చేసింది. పంజాబ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో ఒకే రకమైన కార్యక్రమాలను

---

ప్రపంచీకరణ నీడ ఈ సాహిత్యంపై స్పష్టంగా అగుపిస్తుంది. ఈ కథ కమర్షియల్ ముద్రకు దూరంగా నిలిచినా, సీరియస్ కథలో మమేకం కాలేకపోయింది. పాఠకులకు సంబరాన్ని పంచిన ఈ కథలు ఎంటర్‌టైన్‌మెంట్ సాహిత్యంగా మిగిలాయి. ఇటువంటి కథలు పరిశీలిస్తుంటే సీరియస్‌గా ప్రజల మధ్య తారట్లాడిన కథలు జ్ఞాపకం వస్తుంటాయి. అందుకు ఉదారహణగా గిరిజన కథను పేర్కొనవచ్చు. శ్రీకాకుళోద్యమ నిప్పురవ్వల వెలుగులో సువర్ణముఖి 90వ దశకంలో కథలు రాశారు. 'అన్నలోస్తున్నారు', 'సికాకొలం', 'బెద్దశిస్తు', 'తగవులు' మొదలైన కథలు వర్తమాన దోపిడీని సమీక్షించాయి. గంటేడు గౌరునాయుడు అనేక గిరిజన కథలు రాశారు. 'రక్తాశ్రువు', 'బతుకాకు' వంటి కథలలో గిరిజనుల యాతన కళ్లకు కట్టినట్టు కనపడుతుంది. గిరిజన ప్రాంతాల స్త్రీలు మైదాన ప్రాంతాల నుండి వచ్చిన కాంట్రాక్టర్ల, ఉద్యోగస్తుల లైంగిక పీడనకూ, దోపిడీకీ గురవుతున్న స్థితిని, ప్రతిఘటనా చైతన్యంతో వాళ్లు నిలదొక్కుకోవటాన్ని 'కొండమల్లె' వంటి కథలు చిత్రించాయి. ఇదే ధోరణిలో కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల నుండి గిరిజన కథా సాహిత్యం వచ్చింది. ఇంద్రవెల్లి కాల్పుల తరువాత వచ్చిన కథా సాహిత్యం గిరిజనుల అరణ్యరోదనలను పట్టించుకుంది. గిరిజనులు దోపిడికి గురయ్యే విధానాన్ని చిత్రిస్తూ కిసింగార్ వెంతా వరుసలో ఐదారు కథలు వచ్చాయి. ఆదివాసుల ఉచ్ఛ్వాస, నిశ్వాసాల్ని ఊపిరులుగా చేసుకొని సాహితీ సృజన చేసిన సాహు కథ 'రక్తపింజెర'. గిరిజన సాహిత్యంలో ఇదొక ఆణిముత్యం. బి.ఎస్. రాములు 'అడవిలో వెన్నెల', పి. చంద్ 'అనామతుఖాత', అల్లం రాజయ్య 'బురద', గోపీభాగ్యలక్ష్మి 'జంగుబాయి' మొదలగు కథలు గిరిజన జీవితాలను, వారి పోరాట క్రమాన్ని చిత్రించాయి.

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలతో పోలిస్తే తెలంగాణది ఒక ప్రత్యేకమైన చరిత్ర. ఇక్కడి నీరు గురించీ, వెనకబాటుతనం గురించీ, ప్రత్యేక అస్తిత్వ ముద్రను ధరించుకొని అనేక కథలు వెలువడ్డాయి. 'నిత్యగాయాలనది', 'కుంపటి' లాంటి అనేక కథలు ఈ ఒరవడిలో వచ్చినవే. 'బోరుపొక్కులు' తెలంగాణ నీటి పారుదల, వ్యవసాయం గురించి తెలిపే మంచి కథ. శతాబ్దాల నవాబుల పాలన, భూస్వాముల పీడన, సాంస్కృతికమైన అణచివేత, ఏండ్లపాటు సాగిన సాయుధ పోరాటం, రైతాంగ ఉద్యమాలు, నక్సలిజం దాని ప్రతికూల ఫలితాలు, పోలీసు జులుం మొదలగు అనేక సమస్యలను నేపథ్యంగా తీసుకొని పాత, కొత్త కథకులు చాలా మంది కథలను వెలువరించారు. ఇటీవలి కాలంలో ఉవ్వెత్తుగా లేచిన అస్తిత్వ కాంక్షకు తెలుగు కథ పట్టం కట్టింది. తెలంగాణ కాంక్షలు కథల్లో ప్రతిబింబించాయి. స్థానికత అనేది ప్రపంచీకరణను ఎదుర్కొనే ధీటైన శక్తి, ప్రత్యామ్నాయ వనరు అనే తలంపుతో కథకులు కథలల్లారు.

సుమారుగా రెండున్నర దశాబ్దాల తెలుగు కథా స్రవంతి ఇది. అక్కడక్కడ చెప్పిన కథలు ఉదాహరణలు మాత్రమే. వేలాదిగా వెలువడ్డ కథల్ని చెప్పడం కుదరక వదిలాను. కనుక ఇదొక విహంగ వీక్షణం. ఆధునిక కథ సాగిన మార్గం. ◆

పిల్లలతో కలిసి చూడటం పరిపాటి కాగా తమిళనాడు, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల్లో మాత్రం పిల్లల కోసం తల్లిదండ్రులు కొంత సంయమనం పాటించడం కనబడింది. కొన్ని చోట్ల ఉపాధ్యాయులు, సామాజిక కార్యకర్తలు టీవీ కార్యక్రమాల ప్రభావం గురించి ప్రదర్శనలు ఇవ్వడం ఉంది. కొన్ని సంవత్సరాల క్రితం భారతీయ జనతా పార్టీ తమ ఎన్నికల మానిఫెస్టోలో ఈ అనారోగ్యపోకడ గురించి పేర్కొంది. కానీ తర్వాత అధికారంలోకి వచ్చిన తరువాత చేసింది శూన్యం.

ప్రకటనలకు సంబంధించిన నియమావళి (కోడ్) అసంపూర్తిగా ఉన్నా, కాలం చెల్లివున్నా, కొన్ని ప్రసారాల వల్ల కలిగే సమస్యల గురించి, నియమావళి దుర్వినియోగం గురించి గ్రహించడం గుర్తించాలి. బుల్లితెర మీద ప్రకటనల్లో కనబడే వస్తువును కలిగి ఉండకపోయినా, లేదా వాడకపోయినా తాము తక్కువ వారమనే అభిప్రాయాన్ని పిల్లలలో కల్గించకూడదు. అలాగే ఫలానా బ్రాండు వాడకపోయినా లేదా వాడినా ఇతర పిల్లలతో అపహాస్యానికి గురికాకూడదు. ఇటువంటి ప్రకటనలు నియమావళి ప్రకారం నిషిద్ధం. నిజానికి ఈ కోవ ప్రకటనలు టీవీలో చాలా కనబడినా, సరైన పర్యవేక్షణ కానీ, కచ్చితమైన చర్యలు కానీ కనబడవు. నిజానికి పిల్లల ఛానళ్లు అనేవి చాలా బ్రాండులకు మార్కెటింగ్ అవుట్ లెట్స్‌లాగా మనదేశంలో పని చేస్తున్నాయి.

ఈ నేపథ్యంలో భారతీయ టీవీ రంగంలో ద్యోతకమవుతున్న ఇటీవలి ధోరణుల గురించి మనం పట్టించుకోవాలి. పిల్లల కోసం కార్యక్రమాలు ప్రసారం చేసే ఛానళ్లు పెరుగుతున్నాయి. నిజానికి తమ ఛానళ్లు బాలల ఛానళ్లు అని చెప్పుకోవడానికి ఉత్సాహపడుతున్నాయి. ఈ దేశంలో దీని గురించి పట్టించుకోవడానికి ప్రభుత్వం కానీ, మరొకరు కానీ లేనట్టు ఈ రకమైన ఛానళ్లు మన దేశంలోకి వస్తున్నాయి. వీటి గురించి మనం గమనించాల్సిన విషయాలు :

1. పిల్లల ఛానళ్లు, కార్యక్రమాలు అని ప్రచారం చేస్తున్న వాటిలో చాలాభాగం విదేశాల్లో తయారైనవి. అక్కడ చాలాసార్లు ప్రదర్శించబడినవి.
2. ఇవి పిల్లల చదువుకుకానీ, నైతికస్థాయికి కానీ ఏ మాత్రం తోడ్పడని రీతిలో ఉంటాయి. (అవి చాలావరకు మంచి 'ప్రీ స్కూల్' కార్యక్రమాలు)
3. ఈ విదేశీ ఛానళ్లు ఇప్పుడు రెండవ దశలో ప్రవేశించి సీరియళ్ల ద్వారా బొమ్మలు, పరికరాలు అమ్మడానికి సిద్ధమవుతున్నాయి.

ఇందులో మరింత బాధాకరమైన అంశం ఏమిటంటే పిల్లల కోసం స్థానికంగా రూపొందే కార్యక్రమాలు, భారతీయ ఛానళ్లలో కూడా క్రమంగా తగ్గిపోవడం. ఇప్పుడు ఈ సమస్యను మరింత జఠిలం చేస్తూ ఈ విదేశీ కార్యక్రమాలు మన భాషల్లోకి తర్జుమా అవుతున్నాయి.

భారతదేశం వంటి దేశాల్లోకి పిల్లల యానిమేషన్ సీరియళ్లు పెద్ద ఎత్తున దింపడానికి అంతర్జాతీయ స్థాయిలో భారీ కుట్ర జరుగుతోంది. ఈ రీతిలోనే నేడు పిల్లలటీవీ అంటే కార్టున్లు అనే భావం స్థిరపడుతోంది. ఈ సీరియళ్లు అన్నీ తగినంత పరిశోధన తర్వాతనే రూపొందుతున్నాయి. అయితే ఇవన్నీ కంటి పాపలను ఆకర్షించి, కట్టేయాలనే దృష్టితోనే రూపొందుతున్నాయి కానీ వారి విద్యా సంబంధమైన లేదా అవసరమైన సామాన్య పరిజ్ఞానం పెంచడం కోసం కాదు.

పోటాపోటీగా ప్రారంభమౌతున్న డైరెక్ట్ టు హోం (డి.టి.ఎచ్.) సేవల నేపథ్యంలో, ఇలా వచ్చిపడే విదేశీ ఛానళ్లు గురించి, వాటి కార్యక్రమాల గురించి ప్రభుత్వం తక్షణమే ఆలోచించాల్సిఉంది. అంతేకాక మంచి ప్రయోజనాలకోసం టెలివిజన్‌ను తీర్చిదిద్దేలా చర్యలు తీసుకోవాలి. ప్రభుత్వం కనీసం కొంత శాతం స్థానికంగా రూపొందించిన పిల్లల కార్యక్రమాలు ఉండాలని ఛానళ్లను నిర్దేశించవచ్చు. అదే పిల్లలకోసం ఛానళ్లు అనే వాటిలో ఈశాతం ఇంకా అధికంగాఉండాలి. కెనడా, యూరొప్ దేశాలలో ఇటువంటి నియమాలు ఉన్నాయి. అదే ఫ్రాన్స్‌లో అయితే స్థానికంగా రూపొందించే కార్యక్రమాల శాతం 30 అని నిర్దేశించారు. మరి భారతదేశంలో ఈ శాతం మరింత ఎక్కువ ఉండాలి.

వినోదం రూపేణా జానపద కథలు, నానమ్మ కథలు ద్వారా విలువలు, క్రమశిక్షణ, నైతికవర్తన పెంపొందించే విలువైన సంప్రదాయం మన దేశంలో ఉంది. కొన్ని దశాబ్దాల క్రితం మాలో కొందరం, ఈటీవీ నెట్‌వర్క్ బాగా విస్తృతమవుతున్నప్పుడు, రంగుల టీవీ వస్తున్నప్పుడు, పిల్లల కార్యక్రమాలు మరింత ఆదరణకు నోచుకుంటాయనీ, మన దేశంలో ఉన్న గొప్ప సంప్రదాయానికి గౌరవం దక్కుతుందనీ భావించాం. అయితే అలా కాకుండా మరోలా జరుగుతోంది. ఇక్కడ మినహాయింపులు కొన్ని మాత్రమే. ఆ మినహాయింపులు 'మాల్గుడి డేస్', 'పంచతంత్రా', 'తెనాలి రామన్' వగైరా. మన దేశపు గొప్ప సంప్రదాయాల బలం గమనించిన విదేశీ నిర్మాతలు యానిమేషన్ వంటి టెలివిజన్ కార్యక్రమాలకు తెలివైన వారికోసం అన్వేషణ ప్రారంభించారు. అయితే మన ప్రయత్నాలు ఏంటి?

మనం అనుభవాలనుంచి పాఠాలు నేర్చుకోవడానికి సిద్ధంగా లేము. ఇంతకాలం ఆకాశవాణి పిల్లల కార్యక్రమాల ద్వారా పాఠశాల విద్యకు అదనంగా వినోదం, విజ్ఞానం, అందించేరీతిలో ప్రయత్నం చేసింది. నిజానికి ఈ కార్యక్రమాలు ఎలా ఉండేవంటే, పిల్లలు కేవలం పాల్గొనడమే కాక, వారికి నమ్మకాన్ని, ధైర్యాన్ని కల్గించేవిగా, పెద్దలను, పర్యావరణాన్నీ గౌరవించే రీతిలో ఉండేవి. కానీ నేడు దిగుమతి అవుతున్న బాలల కార్యక్రమాలు పాదార్థిక దృష్టినీ, స్వార్థాన్నీ, వినియోగ దృక్పథాన్నీ, 'ఎలాగైనా' సాధించుకునే మార్గాన్ని బోధిస్తున్నాయి.

బాలబాలికలకు సంబంధించి జన మాధ్యమాల ప్రాధ్యాన్యతను గుర్తించిన ఐక్యరాజ్యసమితి ప్రతి ఏటా ఒకరోజు బాలబాలికలు కార్యక్రమ నిర్వాహకులుగా కార్యక్రమాలు రూపొందించాలని భావించింది. సృజనాత్మకమైన టెలివిజన్ కార్యక్రమాల ద్వారా, మరీ ముఖ్యంగా ఆరు నుంచి పన్నెండు సంవత్సరాల బాలబాలికలకు తోడ్పడాలి. బాలబాలికల సంక్షేమం కోసం తగిన స్థాయిలకు సూచించే ఐక్యరాజ్యసమితి 'కన్వెన్షన్ ఆన్ రైట్స్ ఆఫ్ చైల్డ్' ఉంది. దురదృష్టవశాత్తు వర్తమాన సమాజం వైపు నుంచి పబ్లిక్ ట్రస్ట్ కానీ, ఫౌండేషన్ కానీ దీనికి లేదు. చాలామంచి ప్రయత్నాలు చేస్తున్న 'పబ్లిక్ సర్వీస్ బ్రాడ్‌కాస్టింగ్ ట్రస్ట్' సైతం పిల్లల కోసం కృషి చేయాల్సి ఉంది. పిల్లలకోసం పాటుపడుతున్నామనే చాలా ప్రభుత్వ సంస్థలు భారత సమాచార, ప్రసార మంత్రిత్వశాఖ ఈ లోటు గురించి ఆలోచించడం లేదు. నిజానికి చాలా రకాలుగా అనుకూలమైన, ఆశావహమైన సవ్యమైన కార్యక్రమాలు మరింత బాగా రూపొందితే అవకాశాలున్నాయి. పిల్లల సినిమాల కోసం చిల్డ్రన్ ఫిల్మ్ సొసైటీ, పుస్తకాల ప్రచురణ కోసం చిల్డ్రన్ బుక్ సొసైటి ఉన్నాయి. నిజానికి టెలివిజన్ చూసే పిల్లల సంఖ్య, చూసే వ్యవధి కూడా బాగానే ఉంది. కానీ బాలబాలికల టీవీ కార్యక్రమాల కోసం అటువంటి సంస్థ లేకపోవడం గమనార్హం. ◆

**లాటిన్ అమెరికా, పశ్చిమాసియా, జింబాబ్వేల్లో సంభవిస్తున్న పరిణామాలు ప్రపంచంలో ఇంకా పెరిగే అవకాశం ఉందని అంటున్నారు మిత్ర**

# ఇటీవలి ప్రపంచ పరిణామాలు

నేడు ప్రాంతీయ, ప్రపంచస్థాయిలో కొత్త రకమైన సర్దుబాట్లతో ద్వైపాక్షిక, బహుళపక్ష సంబంధాలు పెరుగుతున్నాయి. బహుళధృవాల సమీకరణ ధోరణి క్రమం పెరుగుతోంది. అన్ని ప్రాంతీయ వేదికల మధ్య అంతరంగిక సమైక్యతా, సహకారం పెరుగుతోంది. 2006లో వివిధ ప్రాంతీయ వేదికల ఆధ్వర్యంలో ప్రపంచమంతా నలభై శిఖరాగ్ర సదస్సులు జరిగాయి. ఇటీవలి కాలంలో ఇవి అరుదు. కొత్త ధోరణి అభివృద్ధి చెందిన దేశాలు, వారి మధ్య తీవ్ర వైరుధ్యాలతో ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందం కుదరడం లేదు. అవే ప్రపంచీకరణ అగ్రజులు. పశ్చిమ దేశాలు ద్వైపాక్షిక, బహుళపక్ష, ప్రాంతీయ వేదికలతో మమేకమయ్యే ధోరణి పెరుగుతోంది. ఇవి ప్రపంచ వాణిజ్య సంస్థను మరుగున పరిచే స్థాయికి చేరుకుంటున్నాయి.

ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందానికి అమెరికా, యురోపియన్ యూనియన్ (ఇ.యూ), జపాన్‌ల మధ్య సయోధ్య కుదరకపోవడం మాత్రమే కాదు, వివిధ కూటముల మధ్య వారి వారి రక్షణలు, ప్రయోజనాలు, ఎన్నటికీ పొసగకపోవడం వలన వివిధ బ్లాక్‌ల మధ్య వైరుధ్యాలు ఇంకా పెరుగుతున్నాయి. ప్రపంచ వాణిజ్య సంస్థపై చైనా ఇదివరకటి మౌనపాత్రను వీడటం, ఇండియా అభివృద్ధి చెందుతున్న దేశాల సరసన చేరడం కీలకపరిణామం. ప్రపంచవాణిజ్య సంస్థలో కొత్తశక్తులు రావడంతో అభివృద్ధి చెందుతున్న దేశాలసమీకరణలు పెరిగే అవకాశం ఉంది. ఇవి ప్రపంచ వాణిజ్య సంస్థలో ఇంతకంటే మెరుగైన ఒప్పందం జరగడానికీ, ఈ అసమాన స్థితి కొనసాగడానికీ లేదా ప్రపంచ వాణిజ్య సంస్థ విచ్ఛిన్నానికీ దారితీయవచ్చు. ప్రపంచ వాణిజ్య సంస్థను సంఘటితం చేసేకంటే ఏదో ఒకరూపంలో వ్యతిరేకించే ధోరణి పెరుగుతోంది.

ప్రముఖ ఆర్థికవేత్తలు ప్రపంచీకరణ ఉల్లాసం ముగిసిందని వ్యాఖ్యానిస్తున్నారు. అమెరికా, యురోపియన్ యూనియన్‌లు విదేశీ ఎగుమతుల నుంచి తమ మార్కెట్లను కాపాడుకోవడానికి 'రక్షణవాదాన్ని' చేపట్టాయి. ప్రపంచీకరణను యథాస్థితిలో కొనసాగించలేని పరిస్థితి పెరుగుతోంది. నేడు కొనసాగుతున్న ప్రపంచీకరణ ప్రారంభమైననాటి లక్షణాల స్వభావాన్నే పూర్తిగా కలిగిలేదు. అది అనేక మార్పులకు గురి అవుతోంది. తిరోగమన దిశలో ఉంది.

'పెట్టుబడిదారీ ప్రపంచీకరణ' వైవిధ్యమైన అనాగరికతతో 'దానికదే నాశనమౌతుందనీ', 'దానికి ప్రత్యర్థులు లేరనీ' విశ్లేషకులు వ్యాఖ్యానిస్తున్నారు. ఇది సరైనదేనా, దానికంటే అభివృద్ధికరమైన దాని ప్రమేయం లేకుండా అనాగరికమైన (పాత) లక్షణం, భవిష్యత్ సమాజానికి ఉపయోగపడని లక్షణం నశిస్తుందా?

పెట్టుబడిదారీ ప్రపంచీకరణ సంక్షోభానికి కారణం దాని ఉత్పత్తి విధానానికి భిన్నమైన, మరొక అడుగు ముందుకేసిన ఉత్పత్తి, పంపిణీ విధానం కొనసాగుతోంది. ఈ చౌక వస్తు ఉత్పత్తి విధానానికి చౌక శ్రమ, మౌలిక సదుపాయాలలో భారీ వెసులుబాట్లు వివిధ కన్సెషన్స్, పన్ను విధానంలో కాలానుగుణ మార్పులు, పారిశ్రామిక ఆర్థిక విధానాలలో సరికొత్త పద్ధతి కారణంగా ఉన్నాయి. ప్రభుత్వరంగ సంస్థలలో వస్తు ఉత్పత్తి ధరలు మార్కెట్‌ను కైవసం చేసుకునే విధంగా నిర్ణయించడం జరుగుతోంది. ప్రభుత్వ కంపెనీలకు భారీ ప్రోత్సాహం, మద్దతు ఇవ్వడం, ఉత్పత్తి విధానంలో వ్యవస్థాగత మార్పుల వల్ల చౌక ఉత్పత్తి విధానం కొనసాగుతోంది. ఈ రకమైన ఉత్పత్తి విధానం పెట్టుబడిదారీ గ్లోబలైజేషన్ ఉత్పత్తికి పూర్తి భిన్నమైనది. ఈ ఉత్పత్తి విధానానికి చైనా కేంద్రంగా ఉంది. ఇది గ్లోబలైజేషన్ ఉత్పత్తి విధానానికి అభిముఖంగా, దాన్ని దెబ్బతీసే లక్ష్యంతో సాగుతోంది.

ఈ వస్తుఉత్పత్తి విధానంలో మార్పులు, భారీ పెరుగుదల వల్ల 'వస్తుఉత్పత్తి విలువ' గణనీయంగా తగ్గుతుంది. వస్తుఉత్పత్తితో పోల్చితే ద్రవ్య విలువలో కూడా అదేస్థాయిలో మార్పులకూ, ద్రవ్యవిలువ తగ్గడానికీ కారణమవుతోంది. కొన్ని కీలక సాంకేతిక పరిశ్రమలు, వివిధ విభాగాల ఉత్పత్తిలో అసమానతలు, గుత్తాధిపత్యం వల్ల ఇప్పటికీ వివిధ వస్తువుల ఉత్పత్తి విలువలు హెచ్చుగానే ఉన్నాయి. వస్తువుల విలువ, ద్రవ్య విలువ గణనీయంగా తగ్గినప్పటికీ, కీలక వృత్తి నిపుణుల, టెక్నోక్రాట్స్ గుత్తాధిపత్యం కలిగిన విభాగాలలో ఇంకా విలువలు గణనీయంగానే ఉన్నాయి.

అమెరికా ఆర్థిక వ్యవస్థ క్షీణించడం డాలర్ విలువ గణనీయంగా తగ్గడానికి కారణం అవుతోంది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో యూరోపియన్ యూనియన్, చైనా, రష్యా, జపాన్‌లు కొత్త ఆర్థిక శక్తులుగా ముందుకు వచ్చాయి. ప్రపంచ ఆర్థికవ్యవస్థలో అసమతుల్యత పెరుగుతోంది. ప్రపంచ అర్థవ్యవస్థలో కొత్త శక్తులు తమ వాటాను పెంచుకుంటూ తమ ప్రయోజనాల కొరకు మునుపెన్నడులేని విధంగా పోటీపడుతున్నాయి.

మౌలిక ద్రవ్యమైన బంగారం, దాని ప్రమాణం అయిన డాలర్ అంతర్జాతీయ ద్రవ్య విలువ నుంచి పక్కకుపోతోంది. దీని స్థానంలో 'జాతీయ కొనుగోలు శక్తి' పై ఆధారపడే ద్రవ్య ప్రమాణాన్ని నెలకొల్పాలనే

ప్రతిపాదనలకు బలం చేకూరుతోంది. డాలర్‌లో కాక యూరోలో చెల్లింపులు చేయమనే స్థితి వలన ఏ రోజైనా డాలర్ క్షీణించవచ్చు. ప్రధాన సామ్రాజ్యవాద దేశాలకు ఆమోదమైన ప్రపంచ ద్రవ్యం, ద్రవ్య నిర్వహణ వ్యవస్థ ఏర్పడవచ్చు. అయినా వివిధ కూటములలో ప్రాంతీయంగా యూరో కాని, ఆసియాలో ప్రాంతీయ కరెన్సీలు ఏర్పడడానికి ఒకే సమయంలో కొనసాగడానికి అవకాశం ఉంది. ఈ ద్రవ్య మార్పులు ఏకధృవ ప్రపంచంలో తీవ్ర మార్పులకు, బహుళ ధృవ ధోరణులు పెరిగి వ్యవస్థీకృతమౌతాయి. దానికనుగుణమైన ప్రపంచ వ్యవస్థ ఏర్పడుతుంది. అప్పుడు బంగారం ప్రత్యేక ఆదరణ తగ్గి విలువైన లోహంగా ఉండవచ్చు.

విదేశీ ద్రవ్యనిల్వలు ఇదివరకు తీవ్ర ఆర్థికసంక్షోభాలకు, వివిధ ప్రాంతాల, దేశాల ఆర్థికవ్యవస్థల విధ్వంసానికీ, అస్థిరతకూ కారణమయ్యాయి. విదేశీ ద్రవ్య నిల్వలు ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో తరచూ తీవ్ర అస్థిరతను కలిగించే పాత్రను పోషించాయి. కానీ చైనా విదేశీ ద్రవ్య నిల్వలను ప్రతిభావంతంగా దేశ ఆర్థిక వృద్ధికి నిర్వహించే వ్యవస్థను నెలకొల్పింది. ఈ విధానం ఆసియా – 3 (చైనా, జపాన్, సౌత్ కొరియా) పేరిట విదేశీ ద్రవ్య నిల్వలను సంయుక్తంగా నిర్వహించే వ్యవస్థను నెలకొల్పాయి. ప్రాంతీయ ద్రవ్య వ్యవస్థల ఏర్పాటు, దేశీయ ఆర్థిక వ్యవస్థల అభివృద్ధికి తోడ్పడుతుంది. నేడు కొనసాగుతున్నట్టు విదేశీ ద్రవ్య నిల్వలను నిరుపయోగంగా, డాలర్ కరెన్సీలో ఉంచాలనే ధోరణి తగ్గవచ్చు. అప్పుడు ఏకైక అసమాన, గుత్తాధిపత్య అంతర్జాతీయ ద్రవ్య ప్రమాణం అయిన డాలర్ ఇంకా క్షీణిస్తుంది. ప్రాంతీయంగా ఇంకా కొత్త ద్రవ్య వ్యవస్థలు నెలకొనవచ్చు. మరే ఇతర అసమాన గుత్తాధిపత్య ప్రపంచ కరెన్సీ ఏర్పడే అవకాశం లేకపోవచ్చు.

'పర్యావరణ మార్పు – ప్రపంచ ఉష్ణోగ్రత' పెట్టుబడిదారీ వ్యవస్థలో ఏ రకమైన వ్యవస్థాగత మార్పులకు దారి తీస్తుంది? సమాజంలో ఏ రకమైన మార్పులకు దారి తీయవచ్చు? ఈ పరిణామాలు ఎటువంటి మెరుగైన ప్రపంచానికి దారితీస్తాయి? ఇంతకంటే, ఇంకా ఎక్కువ సహజ వనరులు కొల్లగొడుతూ, పర్యావరణాన్ని విధ్వంసం చేస్తే మానవాళికి విపత్తు సంభవిస్తుందని పర్యావరణ నిపుణులు, ప్రభుత్వేతర వేదికలు ఏకాభిప్రాయం వ్యక్తం చేస్తున్నాయి. అప్పుడు పెట్టుబడిదారీ వ్యవస్థ కార్యసరళి, లక్ష్యం ఏమిటి? దాని ఉనికి సాధ్యమౌతుందా? ప్రకృతిని నాశనం చేసే, మానవాళి ఉనికికే పెనుముప్పు కలిగించే పెట్టుబడిదారీ విధానం సహజ గమనానికి, 'ప్రకృతి, సామాజిక నియమాలను' అధిగమించలేని సహజస్థితి ఎదురౌతుంది. పెట్టుబడిదారీ విధానాన్ని అంతమొందించే పరిస్థితులను తానే ఉత్పత్తి చేస్తుంది. ఇక ఎనర్జీ ఫ్రీ సమాజంగా ఉత్పత్తి శక్తుల విప్లవాత్మక అభివృద్ధికి తోడ్పడుతుంది. మానవాళి క్రమంగా మన్నికశక్యమైన సమాజం వైపు వెళుతుంది. ఇది పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రకృతి, సామాజిక నియమం విధించిన అధిగమించలేని అడ్డుకట్ట అవుతుంది.

లాటిన్ అమెరికాలో విదేశీ ఆయిల్, ఎనర్జీ కంపెనీలను జాతీయం చేయడం, ఇటీవలే అమెరికా భవిష్యత్ లక్ష్యానికి భిన్నంగా తుర్క్‌మినిస్థాన్, కజకిస్తాన్ నుండి రష్యా మీదుగా యూరోప్‌కు 500 కిలోమీటర్ల ఆయిల్ పైప్ లైన్ నిర్మాణం ఒప్పందంలో ముఖ్యఘట్టాలు. ఏకధృవ ప్రపంచ లక్ష్యానికి చావుదెబ్బ. రష్యా తూర్పు ఆసియాలలో ఆయిల్, గ్యాస్ ఉత్పత్తి దేశాల సమైక్యత, పశ్చిమ ఆసియాలో సామ్రాజ్యవాద వ్యతిరేకత వల్ల అరబ్ జాతీయ వాదం పెరగడం, కొత్త ఆయల్, గ్యాస్ ప్రపంచ కేంద్ర వ్యవస్థలు ఏర్పడడానికి కారణమౌతోంది. రష్యా ఈ వ్యవహారాలలో కీలక పాత్ర పోషిస్తోంది. పశ్చిమ దేశాలను ఎనర్జీ రంగం నుంచి దూరం చేసే విధానాన్ని అనుసరిస్తున్నాయి. ఈ ఏర్పాటు ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో తీవ్ర మార్పులకు కొత్త శక్తులు, కొత్త ధృవాలు, కేంద్రాల అవిర్భావానికి మునుపెన్నడూ లేని సరికొత్త పరిస్థితుల పునర్‌వ్యవస్థీకరణకు దోహదం చేస్తాయి. ఈ పరిణామాలు శతాబ్దాల చరిత్రను మార్చబోతున్నాయి. ఎనర్జీపై ఆధిపత్యం కొనసాగుతున్న పశ్చిమ దేశాలను ఆ రంగం నుంచి తొలగించడమే కాకుండా, పశ్చిమ దేశాల అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని సొంతం చేసుకుంటాయి.

జింబాబ్వే రాబర్ట్ ముగాబే ప్రభుత్వం, నేను వ్యాసం రాస్తున్న సమయానికి తీసుకున్న నిర్ణయం పశ్చిమ దేశాలను వణికిస్తోంది. విదేశీయుల వ్యాపారాలు, గనులను బల ప్రయోగం ద్వారా స్వాధీనం చేసుకోవాలని మంత్రివర్గం నిర్ణయించింది. జింబాబ్వే వాటా 51 శాతంకు పెంచాలనీ, విదేశీ కంపెనీలను దేశీయ కంపెనీలుగా మార్చాలనీ సారాంశం. ఇవి దక్షిణఆఫ్రికా ఖండంలో విప్లవాత్మక మార్పులకు కారణం కావచ్చు. సామ్రాజ్యావాదుల శతాబ్దాల వలస నేటి నయా వలసవాదం పై ఈ చర్య గొడ్డలిపెట్టుగా మారవచ్చు. లాటిన్ అమెరికా ఎనర్జీ జాతీయం చేయడం, పశ్చిమాసియా పరిణామాలు, జింబాబ్వే సరికొత్త మార్పులు ప్రపంచంలో ఇంకా పెరిగే అవకాశం ఉంది. అవి ఆయా దేశీయ స్వభావ రూపాలను సంతరించుకోవచ్చు. ఈ మార్పులలో వైవిధ్య పూరితమైన స్వాభావిక ఐక్యతా లక్షణాలు కనిపిస్తాయి. ఈ పరిణామాలన్ని మరో మెరుగైన ప్రపంచాన్ని హామీ ఇస్తున్నాయి. ◆

చేనేత విధానాలు క్షేత్రస్థాయిలో, ఆ వృత్తిలో ఉన్నవారికి అనుకూలంగా రూపొందినప్పుడే ఆకలి చావులూ, ఆత్మహత్యలూ ఆగిపోతాయంటున్నారు **బండారు జ్వాలా నరసింహం**

# చేనేత కార్మికుల ఆకలి చావులను ఆపలేమా?

మన దేశంలో చేనేత పరిశ్రమ తీవ్రసంక్షోభంలో ఉంది. ప్రపంచీకరణ, పారిశ్రామికీకరణ, అధికోత్పత్తి ప్రధాన అంశాలుగా ఉన్న నూతన ఆర్థిక విధానాలలో భాగంగా దేశంలో ఉన్న సకల సామాజిక ఉత్పత్తి వృత్తులు కనుమరుగవుతున్నాయి. ఈ క్రమం ఇలాగే కొనసాగితే దేశంలోని 'చేమగ్గం' కొంతకాలానికి 'పురావస్తువు'గానే మిగిలిపోతుంది. దీని ఫలితంగా చేనేత రంగంలో ఆకలి చావులు, ఆత్మహత్యలు, బలవన్మరణాలు ఇంకా ఎక్కువగా జరిగే అవకాశాలు ఉన్నాయి. చేనేతల్లో ఆకలి మరణాలు ఎందుకు జరగుతున్నాయో ఈ సందర్భంగా చర్చించాల్సిన అవసరం ఉంది. చేనేత రంగ అభివృద్ధి కోసం చర్చ జరగాల్సి ఉంది.

అతి పెద్ద ఉపాధిరంగమైన చేనేతను జౌళిరంగం నుండి ఎందుకు విడదీయలేకపోతున్నారో పాలకులు చెప్పాలి. చేనేతకు ప్రత్యేక విధానం అంటూ ఏదీ లేదు. జౌళిరంగానికి మాత్రం పదుల సంఖ్యలో విధానాలు ఉన్నాయి. జౌళిరంగం అభివృద్ధి కోసం లక్షల కోట్ల రూపాయలు వెచ్చించడం, రాయితీలు, ప్రోత్సాహకాలు అందించడం, చేనేత బడ్జెట్‌లో కూడ జౌళి రంగానికి కేటాయింపులు చేయడం చూస్తుంటే పాలకులు కావాలని ఉద్దేశపూర్వకంగా, వ్యూహాత్మకంగా చేనేతరంగాన్ని నీరుగార్చడానికి చేస్తున్న 'కుట్ర'లో భాగమే అని చెప్పేందుకు వెనకాడాల్సిన పనిలేదు.

2006లో వచ్చిన 'చేనేత ముసాయిదా విధానం - 2006' ఇప్పటి వరకూ పార్లమెంట్‌లో కనీసం ప్రవేశానికి కూడ నోచుకోలేదు. ఈ ముసాయిదాపై చర్చలుగానీ, సమీక్షలుగానీ, ప్రజాభిప్రాయ సేకరణగానీ జరగకపోవడం చేనేత కార్మికులపట్ల పాలకులకున్న కుటిల వైఖరికి నిదర్శనం.

బడ్జెట్ ప్రతిపాదనలు జరిగేటప్పుడు ప్రభుత్వ ఆదాయపు అంచనాలను బట్టి వివిధ శాఖలకు కేటాయించదలచిన పద్దులపైన ఆయా రంగాలకు సంబంధించిన భాగస్వాములతో, పారిశ్రామికవేత్తలతో, బడా పెట్టుబడిదారులతో బడ్జెట్ గురించి సమీక్షించడం జరుగుతుంది. కాని చేనేత రంగానికి వచ్చేసరికి ఇప్పటి వరకు ఆ ప్రతిపాదనలు గానీ, బడ్జెట్ అంచనాలను గానీ చేనేత కార్మికులతో, చేనేత కార్మిక సంఘాలతో, సామాజిక వేత్తలతో చర్చలు జరుపకుండానే చేనేత బడ్జెట్‌ను రూపొందించడం జరుగుతోంది. ఇంకా చేనేత బడ్జెట్ సమీక్షలపై పవర్‌లూం యాజమాన్యంతో చర్చించి వారి సలహాలను తీసుకొని బడ్జెట్ కేటాయింపు జరుగుతోంది. అందువలన చేనేత రంగానికి చేనేత బడ్జెట్ ఎంత కేటాయించినా కేవలం నాల్గవ వంతు మాత్రమే చేనేత రంగానికి చేరుతుంది. నేరుగా చేనేత కార్మికులకు చేరేది మాత్రం 'శూన్యమే'.

## చిలపలనూలు సమస్య

మిల్లుల్లో తయారయ్యే నూలులో తప్పనిసరిగా యాభై శాతం చిలపల నూలు తయాలు చేయాలనే నిబంధన గతంలో ఉంది. సత్యం కమిటీ సిఫారసులతో దాన్ని ఎత్తివేయడం జరిగింది. అందువలన దాన్ని మరలా యథాప్రకారం యాభై శాతానికి పునరుద్ధరించాలి. అలాగే చేనేతకు సరిపడా చిలపల నూలును విధిగా మిల్లులు తయారుచేసేలా ప్రణాళిక రూపొందించాలి. అది కచ్చితంగా అమలు జరిగేలా, చేనేత రంగానికి అందేలా చర్యలు తీసుకోవాలి. వస్త్రోత్పత్తిదారులకు సబ్సిడీ ద్వారా నూలు, రంగు రసాయనాలను అందించాలి.

## నిత్యావసర వస్తువుల ధరలకు అనుగుణంగా 'మజూరీ'

ప్రస్తుతం చేనేత కార్మికులు రోజుకు 14 గంటలు పనిచేస్తున్నా ఆ కుటుంబానికి సగటున వంద రూపాయలకు మించిన ఆదాయం రావడం లేదు. కుటుంబం అంటే నలుగురు వ్యక్తులుగా మనం గుర్తిస్తే ఇప్పుడున్న నిత్యావసర వస్తువుల ధరలకు ఒక కుటుంబ కనీస అవసరాలు తీరాలంటే నెలకు ఐదు వేల రూపాయలు కావాలి. అంటే రోజుకు ఒక కుటుంబానికి సుమారుగా 170 రూపాయలు అవసరం అవుతాయి.

1957లో రూపొందించిన 'కనీస వేతనచట్టం ప్రకారం ఒక మనిషి రోజుకు 2700 క్యాలరీల శక్తి రావడానికి ఎంత ధాన్యం అవసరమో, ఆ ధాన్యం ధరను కనీస వేతన చట్టంగా రూపొందించారు. అంటే అరకేజి బియ్యం తీసుకున్నా కూడా ఆ శక్తి వస్తుంది. అది మత్రమే మానవ జీవనానికి సరిపోదు. దానికి తోడు పండ్లు, పాలు, చేపలు, కోడిగుడ్లు, మాంసం, కూరగాయలు వగైరా, విటమిన్లు, ప్రోటీన్లు, ఖనిజ లవణాలు, కొవ్వుపదార్థాలు కూడా శక్తి పెరిగేందుకు కావాలి. అందువలన వాటి విలువను కూడా కనీస వేతన చట్టంలో పొందుపరచాల్సిన అవసరం ఉంది. అదనంగా పండుగలు, వినోదం, చదువులు, నెలఖర్చులు, ఆరు

నెలల ఖర్చులు, సంవత్సరానికి అయ్యే ఖర్చులను కూడ పరిగణనలోకి తీసుకోవాలి. నిత్యావసర వస్తువుల ధరలు రోజురోజుకు పెరుగుతున్నాయి కాబట్టి దానికి అనుగుణంగా కనీస వేతన చట్టాన్ని రూపొందించాలి.

ఇంకా చేనేత వృత్తిలో అత్యంత కళానైపుణ్యం ఉంది. కార్మికుని మేధస్సుతో శారీరక శ్రమను జోడించి ప్రపంచప్రఖ్యాతి గాంచిన అపురూప కళాఖండాలను సృష్టించారు. ప్రస్తుతం ఉన్న కంప్యూటర్ యుగంలో, పోటీకి తట్టుకుని ఈ చేనేత వస్త్రం ప్రత్యేక నాణ్యత, గుర్తింపు తెచ్చుకొని నిలబడగలిగిందంటే కేవలం చేనేత కార్మికుల నిరంతర కృషి, మేథోమధనం వల్ల మాత్రమే జరిగిందని చెప్పక తప్పదు. అందుకని శారీరకశ్రమ, మానసికశ్రమ, వృత్తి నైపుణ్యం ప్రాతిపదికగా 'మజూరీ' నిర్ణయం జరగాలి. అవి క్షేత్రస్థాయిలో అమలు జరిగేలా చర్యలు తీసుకోవాలి.

## మాస్టర్ వీవర్స్ వ్యవస్థ

చేనేత కార్మికుల నిరంతర శ్రమదోపిడీ ఈ వ్యవస్థలో కొనసాగుతోంది. మాస్టర్ వీవర్‌కు తోచినంత మజూరు ఇచ్చి కార్మికుని చేత పని చేయించుకోవడం జరుగుతోంది. చేనేత కార్మికుల ఆకలిచావులు, అనారోగ్యపుచావులు ఎక్కువగా జరుగుతున్నాయి. ఈ మాస్టర్‌వీవర్స్‌కు ఎలాంటి చట్టాలు వర్తించవు. అందువల్ల యథేచ్ఛగా కోటానుకోట్ల రూపాయల వ్యాపారం చేసుకొంటూ ప్రభుత్వానికి పన్నులు కట్టకుండా, కార్మికునికి సరైన మజూరీ ఇవ్వకుండా రెండువైపుల దోపిడీ కొనసాగిస్తున్నారు. అందువల్ల తప్పనిసరిగా ఈ మాస్టర్ వీవర్స్ వ్యవస్థను చట్ట పరిధిలోకి తేవాలి. కచ్చితమైన చట్టాలను రూపొందించి అమలు చేయాలి.

## చేనేత సహకార రంగం

చేనేత సహకార రంగం పూర్తిగా అవినీతిమయమైపోయింది. కేవలం ఐదు శాతం మాత్రమే చేనేత కార్మికులు ఉన్న ఈ సహకార రంగానికి చేనేత బడ్జెట్‌లో నాల్గవ వంతు కేటాయింపులు జరుగుతున్నాయి. అయినా కూడ అవి నేరుగా చేనేత కార్మికునికి అందుతున్న దాఖలాలు చాలా తక్కువే. అధికారుల అవినీతి + పాలకుల నిర్లక్ష్యం = సహకార రంగంగా మారిపోయింది. కాబట్టి ఈ సహకార రంగాన్ని పూర్తిగా ప్రక్షాళన చేయాల్సిన అవసరం ఉంది. సక్రమంగా, నిజాయితీగా నడుస్తున్న చేనేత సహకార సంఘాలకు అదనంగా నిధులు కేటాయించి ప్రోత్సాహకాలు ఇచ్చి ఆదుకోవాలి. అలాగే 'సోషల్ ఆడిట్' జరిపి అవినీతిలో ఉన్న సహకారసంఘాల నిధుల రికవరీ చేసి, అవినీతి పరుల మీద నాన్ బెయిలబుల్ కేసులు పెట్టాలి.

## షెడ్ కార్మిక వ్యవస్థ

చేనేత రంగంలో నిరంతరం దోపిడీకి గురవుతూ ఉన్నవారు షెడ్ కూలి చేనేత కార్మికులు. 'సమాజం నుండి వెలివేయబడ్డ సంచారజీవులు' ఈ షెడ్ కూలి చేనేత కార్మికులు. చేనేత ఆకలి మరణాలు అధికంగా ఈ కార్మికుల్లోనే జరుగుతున్నాయి. వీరి కోసం ప్రత్యేక ప్యాకేజీని రూపొందించాలి. ఈ షెడ్ కార్మికుల గుర్తింపు సమగ్రంగా జరగాలి. వీరికి ఆరోగ్యబీమా, హౌస్-కమ్-వర్క్‌షెడ్, కనీస వేతనాలు అమలు జరిగేలా కచ్చితమైన చర్యలు తీసుకోవాలి. కార్మిక చట్టాలను అమలు చేసి వీరి అభివృద్ధి కోసం బడ్జెట్‌లో ప్రత్యేక కేటాయింపులు చేయాలి.

## బడ్జెట్

చేనేత కార్మికునికి అనేక ప్రభుత్వ పాలసీలు ఉపయోగపడటం లేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల చేనేత బడ్జెట్‌లో ఎక్కువగా చేనేతేతర రంగానికి, సహకార రంగానికి కేటాయింపులు జరుగుతున్నాయి. చేనేత కార్మికుని సంక్షేమానికి కేటాయించిన నిధులు చాలా చాలా తక్కువగా ఉంటున్నాయి. ప్రత్యేకించి చేనేత కార్మికుని సంక్షేమానికి నిధులు కేటాయించాలి. అవి పారదర్శకంగా అందేలా చూడాలి. హౌస్ – కమ్ – వర్క్‌షెడ్‌కు ఐదు సెంట్లు స్థలం ఇచ్చి రెండు లక్షల రూపాయ లతో నిర్మించి ఇవ్వాలి. వారసత్వపు హక్కు మాత్రమే ఉండాలి. లక్ష రూపాయలతో ఆరోగ్యబీమా పాలసీ ఏర్పాటు చేయాలి. చేనేత రంగంలో మహిళల ఆరోగ్యం కోసం బడ్జెట్ నిధులు కేటాయింపులు జరగాలి. కార్మిక చట్టాలు అమలు చేయాలి.

## వెంటనే చెయ్యాల్సిన పనులు

- జౌళి రంగం నుండి చేనేతను విడదీసి ప్రత్యేక బడ్జెట్ కేటాయింపులు జరగాలి.
- చిలపల నూలును విధిగా 'యాభై శాతం' మిల్లులు ఉత్పత్తి చేయాలి, ధరలపైన ప్రభుత్వ నియంత్రణా, పర్యవేక్షణా ఉండాలి.
- కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో ఉన్న 'నిఘా' విభాగాన్ని పటిష్టపరిచి చేనేత రిజర్వేషన్ ఉత్పత్తులను తయారు చేస్తున్నవారిపై కఠిన చర్యలు తీసుకొని, చట్టప్రకారం కేసులు పెట్టి శిక్షించాలి.
- 'చేనేత ముసాయిదా విధానం' చేనేతల భాగస్వామ్యంతో రూపొందించాలి.
- ఉపాధి ప్రాతిపదికగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బడ్జెట్ కేటాయింపులు చేయాలి.
- మాస్టర్ వీవర్స్ వ్యవస్థను చట్టపరిధిలోకి తేవాలి.
- చేనేత సహకార సంఘాలను ప్రక్షాళన చేయాలి. బాగా నడుస్తున్న సంఘాలకు ప్రత్యేక నిధులు, ప్రోత్సాహకాలు అందించాలి.
- కార్మికచట్టాలను కఠినంగా అమలు చేయాలి.
- చేనేత షెడ్ కార్మికులకు ప్రత్యేక పథకాలు రూపొందించి వారికి బడ్జెట్ కేటాయింపులు చేయాలి.
- చేనేత మహిళల అభివృద్ధికీ, సంక్షేమానికీ ప్రత్యేక పథకాలు తయారు చేసి అమలు చేయాలి.

## ముగింపు

దేశంలో కోట్లాది మంది పేద ప్రజల జీవనోపాధి అయిన చేనేత రంగాన్ని అభివృద్ధి చేయాలనే చిత్తశుద్ధి పాలకులకు ఉంటే చేనేత ఆకలి చావులు, ఆత్మహత్యలు, బలవన్మరణాలను నివారించవచ్చు. అయితే పాలకులలో చిత్తశుద్ధి, అధికారులలో నిజాయితీ లోపించాయి. క్షేత్రస్థాయిలో చేనేత విధానం రూపకల్పన జరగాలి. అందుకు చేనేత కార్మికులు, కార్మిక సంఘాలు, ప్రభుత్వ యంత్రాంగం, విధాన కర్తలు, ప్రజాప్రతినిధులు, బడ్జెట్ నిపుణులు, సామాజిక కార్యకర్తలతో కలిసి చేనేత రంగ అభివృద్ధి కమిటీని ఏర్పాటు చేసి, విధిగా క్షేత్రస్థాయిలో పరిశీలించి, చర్చలు జరిపి 'చేనేత విధానాన్ని' రూపొందించాలి. ◆

**ముంచుకొస్తున్న విషసంస్కృతులకు అడ్డుకట్ట వేయటం ఎలా అన్నది అభ్యుదయవాదులందరూ ఆలోచించవలసిన విషయం అని అంటున్నారు సత్యనారాయణ**

# పోటీపడుతున్న విషసంస్కృతులు

అర్ధ వలస, అర్ధ భూస్వామ్య దేశంగా భారతదేశాన్ని దేశంలోని దాదాపు అన్ని వామపక్ష రాజకీయ పార్టీలు విశ్లేషించాయి. అందుకు అనుగుణంగానే దేశంలో ఆర్థిక విధానాలు, సంస్కృతులు పోటీపడి మరీ విరాజిల్లుతున్నాయి. సాంస్కృతిక రంగంలో మూఢవిశ్వాసాలను, మూఢ ఆచారాలను, భక్తిని పరిఢవిల్ల చేయటానికి భూస్వామ్య వర్గం కృషిచేస్తుంటే, క్షీణ, విష సంస్కృతిని పెంపొందించటానికి పెట్టుబడిదారీ వర్గం కృషిచేస్తోంది. ఈ రెండు సంస్కృతులు ఎదురు లేకుండా జమిలిగా, అడ్డుఅదుపు లేకుండా మూడుపువ్వులు, ఆరుకాయలుగా కొనసాగు న్నాయి. గజ్జల మల్లారెడ్డి చెప్పినట్లు భక్తిరసం పొంగిపొర్లి, డ్రెయినేజ్ స్కీమ్‌లేక డేంజరుగా మారుతోంది.

కాశీ వద్ద గంగలో మునిగితే బొందితోనే సరాసరి స్వర్గలోకంలోకి వెళ్తామన్న మూఢవిశ్వాసం గలవాళ్లు పూర్వం ఏ కొద్దిమందో కాశీ వెళ్లే వాళ్లు. అప్పుడు రవాణా సౌకర్యాలు లేవు. కాలినడకన అడవుల గుండా వెళ్లవలసి వచ్చేది. అడవి జంతువుల బారినపడి చనిపోతామేమోనన్న భయం ఉండేది. అందువల్లనే చాలా కొద్ది మంది వెళ్లేవాళ్లు.

అదే విధంగా ఆపద వచ్చినప్పుడు తలనీలాలు ఇస్తామని, నిలువు దోపిడీయిస్తామని ప్రజలు తిరుపతి వెంకటేశ్వర్లుకు మొక్కుకునే వారు. వీరి సంఖ్య కూడా చాలా తక్కువగా ఉండేది. రవాణా సౌకర్యాలు కూడా చాలా తక్కువ. నడిచి మెట్లెక్కి దైవ దర్శనం చేసుకోవలసి వచ్చేది. మెట్లు ఎక్కలేని వృద్ధులు 'డోలీ'లు కట్టించుకుని వెళ్లేవారు.

కానీ, ఇప్పుడు పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ప్రభుత్వం పూర్తిగా రైలు, బస్సు సౌకర్యం కల్పించింది. కొండపైకి మెట్లెక్కి వెళ్లవలసిన పనిలేదు. సరాసరి పైకి వెళ్లటానికి బస్సులు ఏర్పాటు చేశారు. సొంత వాహనంలో వెళ్లవచ్చు. తిరుపతి గానీ, ఏ పుణ్యక్షేత్రమైన వెళ్లిరావటం అంటే, పక్క గ్రామానికి వెళ్లి తిరిగి వచ్చినట్లుగా తయారైంది. వసతి సౌకర్యాలు కల్పించారు. దానితో సందర్శనకు భక్తుల రద్దీ పెరిగింది. దైవ దర్శనం చేసుకోవాలంటే గంటల తరబడి క్యూల్లో నిలబడవలసి వస్తోంది. భక్తులు విసుగు చెందకుండా, నిరుత్సాహ పడకుండా కాలం గడపటానికి మధ్య మధ్య టీవీలు ఏర్పాటు చేశారు. డబ్బు గలవారు నిర్ణయించిన ధనంచెల్లిస్తే, వేరేవరుసలో నిలబడి తొందరలోనే దైవదర్శనం చేసుకొనే సౌకర్యం కల్పించారు. రాష్ట్రంలోని అన్ని పుణ్యక్షేత్రాలు భక్తులతో కిటకిటలాడు తున్నాయి. ఆదాయం కూడా బాగా పెరిగింది. పాడుపడిన దేవాలయాలన్నింటిని బాగు చేయించారు. పర్యాటక కేంద్రాలుగా తీర్చిదిద్దుతున్నారు. ఉత్సవాల సందర్భంలో పెద్ద ఎత్తున అదనపు బస్సుల సౌకర్యం కల్పించి, భక్తులను ప్రోత్సహిస్తున్నారు.

అలా వెళ్లలేని వారికోసం ఇంట్లోఉండి ఉత్సవాలను తిలకించటా నికి వీలుగా దూరదర్శన్, రేడియోల ద్వారా ప్రత్యక్ష ప్రసారాలు చేయిస్తున్నారు. పగలూ, రాత్రీ రేడియో, దూరదర్శన్‌లు పని చేస్తున్నాయి. ఆ పుణ్యక్షేత్రం చరిత్రలను పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నాయి. పత్రికలు కూడా ఈ విషయంలో తమ వంతు కృషి చేస్తున్నాయి.

తిరుపతి వరకూ వెళ్లి దైవసన్నిధిలో పెళ్లిళ్లు చేసుకోవలసిన పనిలేకుండా, రాష్ట్రంలోని ముఖ్యపట్టణాలన్నింటిలోనూ కళ్యాణమండపా లు నిర్మిస్తున్నారు. సామాజిక వివాహాలు జరిపేందుకు ప్రోత్సహిస్తున్నారు. చివరకు మంగళసూత్రాలు కూడా ధర్మంగా ఇస్తున్నారు.

ఏడాదికి ఒకసారి జరిపే ఉత్సవాలకు పండగల పేరుతో, పుష్కరాల పేరుతో నదులకు ఉత్సవాలు పెద్ద ఎత్తున ప్రచారం చేసి మరీ జరుపుతున్నారు.

దేశంలో బాబాలకు, పీఠాధిపతులకు మఠాధిపతులకు వారి శిష్య పరంపరకు కొదవలేదు. వీధులలో గారడీ వాళ్లు చెట్లు మొలిపించినట్లుగా నాణేలు సృష్టించినట్లుగా, చిత్రవిచిత్ర పనులు చేసి ప్రేక్షకులను ఆనంద పరిచినట్లుగా, జుట్టులో నుండి గడియారాలు, నోటిలో నుండి లింగాలు, గాలిలో నుండి విభూతి సృష్టించి భక్తులను నమ్మోహితులను చేసే బాబాలు ఉన్నారు. మహిమలు ప్రదర్శించి మూఢ విశ్వాసాలనూ, మూఢ భావాలనూ పెంచి పోషిస్తూ భక్తులను ఆకట్టుకునే వారూ ఉన్నారు.

భక్తి, దైవారాధనపట్ల విశ్వాసంగల సామాన్యులూ, అమాయకులూ, వారి మానసిక తృప్తికోసం ఈ బాబాలను పీఠాధిపతులను సందర్శిస్తే, ఆరాధిస్తే ఆశ్చర్యపడనక్కరలేదు. కానీ, మేధావులం, శాస్త్రవేత్తలం, పండితులం, రాజకీయవేత్తలం అనుకుంటూ, ప్రజా ప్రతినిధులుగా చలామణి అవుతూ, సమాజంలో ఉన్నతస్థానాలు పొంది, గౌరవం పొందుతున్నవారు, ఈ బాబాల చుట్టూ, పీఠాధిపతుల చుట్టూ ప్రదక్షిణలు చేయటం, పాదాభివందనాలు చేయటం, ఆశీస్సులు పొందటం ఆశ్చర్యం కలిగించక మానదు. వీరి చర్యల ప్రభావం సామాన్య ప్రజలపై ఎంత పడుతుందో, ప్రజలలో మూఢ నమ్మకాలను ఎంతగా గట్టిపరుస్తాయో గ్రహిస్తే సామాన్య ప్రజలకూ, దేశానికీ అంత మేలు జరుగుతుంది.

చారిత్రక ప్రదేశాలు, పురాతన కళాఖండాలు, అపూర్వ కట్టడాలు ఉన్న ప్రాంతాలను, పర్యాటకులను ఆకర్షించేందుకు అభివృద్ధి చేసి, వసతి సౌకర్యాలు, రవాణా సౌకర్యాలు కల్పించటం ప్రభుత్వ పర్యాటకశాఖ బాధ్యత. వాటి సందర్శనం వల్ల మనోవికాసం పొందుతారు. పుణ్యక్షేత్రాల

అభివృద్ధి ధర్మసంస్థల, మతసంస్థల బాధ్యత. కానీ, రాష్ట్ర ప్రభుత్వం పుణ్యక్షేత్రాల అభివృద్ధి కార్యక్రమాన్ని కూడా తలకెత్తు కుంటున్నది. ప్రజల సంక్షేమం కంటే, తాత్విక చింతనలకు ప్రాధాన్యత ఇస్తుంది. అమాయక ప్రజలలో భక్తి భావాలను పెంపొందించి, నిత్య జీవితంలో ఎదురయ్యే సమస్యల నుండి ప్రజల దృష్టిని మరల్చడానికి శాయశక్తులా కృషి చేస్తోంది. ఇందుకు సినిమాలు, ఆకాశవాణి, దూరదర్శన్ వంటి ఆధునిక ప్రసార సాధనాలను, పత్రికలను ఈ వర్గం చక్కగా వాడుకుంటోంది.

భూస్వామ్య సంస్కృతి ఆ విధంగా పరిఢవిల్లుతుంటే, పెట్టుబడిదారీ వర్గపు క్షీణ, విష సంస్కృతిని దోపిడీవర్గాలు అడ్డు అదుపు లేకుండా వ్యాపింపజేస్తున్నాయి. ముఖ్యంగా కొత్తగా మధ్యతరగతిగా మారి సమాజం లో కొంచెంకొంచెంగా స్థానం సంపాదించుకుంటూ, పార్లమెంటరీ విధానంలో కీలక పాత్రధారులుగా ఎదిగిన ఉద్యోగవర్గాలూ, మధ్యతరగతి రైతులూ, కొత్తగా కాంట్రాక్టులు, వ్యాపారాలు చేపట్టి భాగ్యవంతులైన వర్గాలు ఈ విషసంస్కృతికి సులభంగా లోనవుతున్నారు. ఈ వర్గాల ఆశలనూ, ఆకాంక్షలనూ ప్రతిబింబిస్తూ, అసలు జీవితమంటే ఇదే నన్న భ్రమను కలిగిస్తున్నారు.

ముందుగా చెప్పుకోదగింది వస్తు వ్యామోహం (కన్స్యూమరిజం). ఆధునిక సాంకేతిక, శాస్త్రవిజ్ఞానంతో పెట్టుబడిదారులు కొత్తకొత్త వినియోగవస్తువులను ఉత్పత్తి చేసి, మార్కెట్లో ప్రవేశపెడుతున్నారు. ఆ వస్తువులు గృహంలో ఉంటే, ఆ ఇంటి యజమానికి సమాజంలో హోదా పెరుగుతుందన్న భ్రమను కల్పించటానికి తగిన విధంగా కథలల్లి, పెద్దెత్తున ప్రకటనల ద్వారా ప్రచారం చేస్తున్నాయి. కథల రూపంలో కథలను పండిస్తున్నాయి. శ్రమను తగ్గించి, రోజువారీ పనులలో ఉపయోగపడేవి అయితే ఫరవాలేదు. ఆ వస్తువులు గృహంలో అలంకారంగా షోకేసులలో పెట్టుకోవడానికి మాత్రమే పనికి వస్తాయి.

స్త్రీలను ముఖ్యంగా యువతులను ఆకర్షించడానికి ఫ్యాషన్ పేరుతో తీవ్రమైన మార్పులు తీసుకొస్తున్నారు. అర్థనగ్నంగా ఉన్నా ఫరవాలేదు. మ్యాచింగ్ పేరుతో, కాళ్లకు వేసుకునే చెప్పులతో మొదలుపెట్టి కట్టూ, బొట్టూ ఒకే కలర్‌లో ఉండే విధంగా ఉండాలని తపన పడేలా చేస్తున్నారు.

ఇటీవలి కాలంలో స్త్రీలు ఉద్యోగాలలో చేరటం ఎక్కువ కావటం, ఆఫీసుపనీ ఇంటిపనీ చేయవలసి రావటంతో పనిఎక్కువై, విశ్రాంతి తక్కువ అవుతోంది. చదువు పూర్తికాగానే ఉద్యోగంలో చేరటం, పెళ్లి కావటంతో మరిన్ని బరువు బాధ్యతలు మోస్తున్నారు. వంటపని, ఇంటిపని, పిల్లలపెంపకం వంటి బాధ్యతల నుండి విముక్తి జరుగక అదనంగా ఒత్తిడికి లోనవుతున్నారు. వీటిని ఆసరాగా చేసుకొని బహుళజాతి కంపెనీల రెడిమేడ్ వస్తువుల్లాగా తినడానికి కూడా ఫాస్ట్‌ఫుడ్స్ పేరిట మధ్యతరగతి ప్రజలను ముఖ్యంగా యువతీయువకులను ఆకర్షిస్తున్నాయి. అన్నీ సరుకులు ఒకే చోట దొరికే ఏర్పాట్లు చేస్తూ చిల్లర వ్యాపారంలోకి దిగుతున్నాయి. సంచార దుకాణాలు కూరగాయల మాదిరిగా ఇంటి ముందుకు వచ్చినా ఆశ్చర్యపడనక్కరలేదు.

ఇదిలా ఉండగా స్త్రీలకై అందాల పోటీలు నిర్వహిస్తున్నారు. విశ్వసుందరులను ఎంపిక చేస్తుండటంతో యువతులు ఈ పోటీలలో పాల్గొనటానికి ఎక్కువఆసక్తి చూపుతున్నారు. తరువాత ఈ విశ్వసుందరుల ఫోటోలను మోడల్స్‌గా వ్యాపార ప్రకటనలలో వాడుకుంటున్నారు.

ఇక టీవీలలో వచ్చే సీరియల్స్ గురించి చెప్పనక్కరలేదు. ప్రతి అరగంటకు ఒక సీరియల్ మారిపోతుంది. ఒక ఛానల్‌కాదు పదుల సంఖ్యలో ఈ ఛానల్స్ ఉన్నాయి. ఈ ఛానల్స్‌లో హత్యలు, రేప్‌లు, అసభ్య దృశ్యాలు ఎక్కువగా ఉంటున్నాయి. క్లబ్ డ్యాన్స్‌లు, ఫైటింగ్స్, రంగురంగు లలో ప్రతి అరగంటకు కథ మారిపోతుండటంతో విసుగు పుట్టే అవకాశామే లేకుండా పోతోంది. వీటితో పాటు క్రికెట్ క్రేజ్ ఎక్కువ చేశారు. క్రికెట్ పోటీలను ప్రత్యక్ష ప్రసారం చేస్తున్నారంటే చిన్న పిల్లల నుండి వయోవృద్ధులైన స్త్రీ పురుషుల వరకు, ఆట అయిపోయెవరకు టీవీలకు అతుక్కుపోతున్నారు. యువతీ యువకుల కోసం ప్రత్యేకంగా రెడియోలో కొత్తగా ఒక సీరియల్ ప్రతి శనివారం సాయంత్రం ప్రసారమవుతోంది. 'జారిపోతుంది బాల్యం, తొంగి చూస్తోంది యవ్వనం' అన్న గేయచరణాలతో ప్రారంభమవుతుంది. యువతీ యువకులుగానీ, తల్లిదండ్రులతో యువతులూ, స్నేహితులూ కలుసుకున్నపుడు వారి మధ్య సంభాషణ, వారి మనోభావాలు ఎలాంటి అరమరికలు లేకుండా కొనసాగుతాయి. ఈ సంభాషణలలో సాంఘిక సంబంధాలు మొదలు కొని, ప్రేమకలాపాల వరకూ ఉంటాయి. ఈ కార్యక్రమం ద్వారా యువతీ యువకులలో ఎలాంటి భావాలను ప్రోత్సహించాలనుకుంటున్నారో, యువతీ యువకులకు ఏమీ నేర్పాలనుకుంటున్నారో నిర్వాహకులకే తెలియాలి. ఈ విష సంస్కృతులకు అడ్డుకట్ట వేయటం ఎలా అన్నది అభ్యు దయవాదులు ఆలోచించవలసిన విషయం.

1943-46ల మధ్య కోస్తా ఆంధ్రలో పెద్ద ఎత్తున సాగిన వికాసోద్యమం ఈ విషసంస్కృతికి అడ్డుకట్ట వేసింది. కొంతవరకు విజయం సాధించింది. గ్రామాలలో నూతన అభ్యుదయ సంస్కృతి వెల్లివిరిసింది. తరువాత వచ్చిన ఫాసిస్టు నిర్బంధకాండతో, ఆ ఉద్యమం అణిగిపోయింది. ఆనాటి ఉద్యమం గురించి పరిశోధనచేసి, పునరుద్ధరించే బాధ్యత నేటితరం వారిపై ఎంతైనా ఉంది. ◆

సాహిత్య ఆధారాలను, పురావస్తు ఆధారాలతో నిర్ధారించుకొని, సమాజ శాస్త్రాలతో అనుసంధానించుకొని చరిత్ర నిర్మాణానికి పూనుకోవాలని డి.డి. కోశాంబి మార్గనిర్దేశం చేశారంటున్నారు **వకుళాభరణం రామకృష్ణ**

# మార్క్సిస్ట్ చరిత్ర రచనా వైతాళికుడు



1950 దశకం నుండి భారతదేశ చరిత్ర రచనలో పెనుమార్పులొచ్చాయి. ఈ మార్పు ప్రపంచం మొత్తంగా వస్తున్న మార్పులతో పాటు, కొత్త విషయాలను కనుగొంటూ, తద్వారా విజ్ఞానాన్ని పెంపొందించుకునే క్రమంలో చూడాల్సి ఉంటుంది. రెండవ ప్రపంచయుద్ధం ముగియడంతో ప్రపంచవ్యాప్తంగా పెత్తనం సాగిస్తున్న వలసాధిపత్యం క్షీణించింది. తృతీయ ప్రపంచం తలెత్తింది. వలసపాలన నుండి విముక్తి చెందిన తృతీయ ప్రపంచదేశాలు ప్రజాస్వామ్యం, సోషలిజం, ప్రపంచశాంతితో పాటు అవలంబింప పూనిన అలీన విధానాల దారిలో తమతమ దేశాల అభివృద్ధికి బాటలు వేయ పూనుకున్నాయి. మరొకవైపు ఈ తృతీయ ప్రపంచ దేశాలకు అండగా నిలిచి, సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని సవాలు చేస్తూ, సోషలిస్టు ప్రపంచానికి నాయకత్వం వహిస్తున్న 'సోవియట్ రష్యా అగ్రరాజ్యంగా రూపుదిద్దుకొంది. తృతీయ ప్రపంచ దేశాల్లోని సమాజాల్లో సామాన్యమానవుడి మనుగడ పట్ల దృష్టి సారించారు. ఆర్థిక, సామాజికాభివృద్ధి క్రమంలో సాంస్కృతికాంశంగా సాహిత్యం, కళలు, సామాజిక శాస్త్రాల అధ్యయనం పట్ల ఆసక్తి పెరిగింది. మానవుడు కేంద్రంగా, అతడి మంచి చెడులు, పూర్వాపరాలు ఆలంబనం చేసుకొని సామాజికశాస్త్రాల్లో పరిశోధనలు ఊపందుకొన్నాయి. మార్క్సిస్టు భావ జాలం దేశంలోని మేధావులను, యువతను ప్రభావితం చేస్తున్న కాలమది.

దాదాపు 1950 దశకం మధ్యవరకూ భారతదేశ చరిత్ర రచన, అధ్యయనం, రాజవంశాలు, చక్రవర్తులు, యుద్ధ విజయాపజాయాల చుట్టూ కేంద్రీకృతమైంది. కొంతవరకు సామాజిక పరిస్థితులు, సాంస్కృతిక దళాల ప్రస్తావనలున్నా, అవి సమాజంలోని శిష్టవర్గాలకు చెందినవై ఉండేవి. విస్తృతమైన చర్చ ఆర్థిక, సామాజికాంశాలపై జరిగేది కాదు. మరో ముఖ్యాంశమేమిటంటే, చరిత్ర మొత్తం మహావ్యక్తుల జీవితాలు, వారి ఘనకార్యాలన్న భావన వ్యాప్తిలో ఉండేది. 1950 దశకం నాటికి ఈ దృక్పథంలోనూ మార్పు వచ్చింది. దీనికి విరుద్ధంగా చరిత్ర గర్భంలో మరుగునపడి కన్పించని అనేకానేక చీకటి కోణాలను వెలికితీసి మొత్తం సమాజ చిత్రపటాన్ని మనముందుంచే విధంగా చరిత్రను తిరిగి రాయాలన్న భావన మొదలైంది.

చరిత్ర రచనలో ఈ కొత్తవొరవడికి ఆద్యుడు దామోదర్ ధర్మానంద్ కోశాంబి (1907-1966). కోశాంబి ప్రవేశపెట్టిన కొత్త ధోరణి కారల్‌మార్క్స్ ప్రవచించిన చారిత్రక భౌతిక వాదానికి చెందినది. హెగెల్ కనుకొన్న గతితర్కాన్ని తల్లకిందులు చేసి దాన్ని చారిత్రక, భౌతిక పరిస్థితులతో సమన్వయపరిచి, చరిత్రకొక అర్థాన్ని, పరమార్థాన్ని కల్పించాడు కోశాంబి. 'ఉత్పత్తి సాధనాల్లో, సంబంధాల్లో చోటుచేసుకొన్న మార్పులను కాలక్రమంలో వివరించేదే చరిత్ర.' అత్యంత ప్రాముఖ్యత పొందిన ఈ నిర్వచనంలో కోశాంబి చరిత్రకు శాస్త్రీయ ప్రామాణికతను కల్గించాడు. చరిత్ర వికసించే క్రమంలో ఆర్థిక శక్తుల ప్రాముఖ్యాన్ని విధిగా గణనలోకి తీసుకోవాలన్నది ఆయన సిద్ధాంతంలోని ప్రధానాంశం. సమాజాన్ని ఐక్యంగా పట్టి నిలిపేవి ఉత్పత్తి బంధాలన్నాడు. ఉత్పత్తి క్రమంలో, శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి కారణంగా సంభవించే మార్పులు, తప్పనిసరిగా ఉత్పత్తి సంబంధాల్లోనూ చోటు చేసుకొంటాయి. ఈ రెంటినీ అర్థం చేసుకొని, విశ్లేషించినపుడు మానవచరిత్ర ఆహార సేకరణ దశనుండి ఆహారోత్పత్తి దశకు (వ్యవసాయం), అక్కడ నుండి మధ్యయుగాల భూస్వామ్య సమాజాన్ని దాటి, ఆధునికయుగంలో పెట్టుబడిదారీ సమాజానికి చేరుకున్న దశలను వివరిస్తుందని కోశాంబి అభిప్రాయం. అంతమాత్రం చేత ఆర్థికనియతివాదాన్ని యాంత్రికంగా భారతదేశానికి వర్తింపచేయరాదని కోశాంబి అభిప్రాయం. ఎందుకంటే భారతీయ సమాజాన్ని విశ్లేషించడంలో సారం కంటె రూపానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారని అధ్యయనపరంగా నిగ్గుతేల్చాడు. అంతేగాక ఉపరితలంలో భాగమైన భావజాల ప్రాముఖ్యతను తగ్గించరాదన్నాడు. కొన్ని సందర్భాల్లో ఉపరితలం పునాదిని ప్రభావితం చేసి మార్పుకు దోహదం చేస్తుంది.

భారతీయులకు చారిత్రక దృష్టి లోపించిందన్న అపప్రథ ఎంతో కాలంగా వాడుకలో ఉండేది. ఇది వలస చరిత్రకారుల సృష్టే అయినా, ప్రాచీనమత గ్రంథాలు, పురాణాలకు పుక్కిటి పురాణాలు తోడై దేశచరిత్రను అశాస్త్రీయ, అవాస్తవిక, అభూత కల్పనలతో నింపివేశాయి.

ఈ అభిప్రాయంతో కోశాంబితోపాటు, ఆయన ఆలోచనా ధోరణిలో చరిత్ర రచన సాగించిన ఆర్.ఎస్. శర్మ, రొమిలా థాపర్, దేవరాజ్‌చన్నా, ఇర్ఫాన్ హబీబ్, దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ మొదలగు చరిత్రకారులు విభేదించారు. వేదకాలం నుండి ఆధునిక చరిత్ర ఆరంభమయ్యే మధ్యయుగాంతాల దాకా చరిత్ర సంప్రదాయాన్ని వీరు తమ పరిశోధనల ద్వారా వెల్లడించారు. చరిత్రక్రమంలోని ప్రతి దశలోనూ ఇమిడి ఉన్న చారిత్రక స్పృహను, సామాజిక సందర్భాలను వివరించారు. భారతదేశ చరిత్రను మొదటిసారిగా రాసిన జేమ్స్‌మిల్, మతపరంగా హిందూ, ముస్లిం యుగాలుగా విభజించాడు. ఈ విభజనను జాతీయవాద చరిత్రకారులు కొంతవరకు ఖండించినా, అది కోశాంబి కాలంనాటికి పూర్తిగా మారింది. దానికి బదులుగా ప్రాచీన, మధ్య, ఆధునిక యుగాలుగా విభజించబడింది. దీనికి ప్రాథమికంగా కోశాంబి పద్ధతి ప్రాతిపదికన అయినా పూర్తిగా ఆ విభజన చారిత్రక పరిణామ చట్రంలో ఇమడలేదు. దీనిపై చర్చ నేటికీ కొనసాగుతూ ఉంది.

కారల్‌మార్క్స్ 19వ శతాబ్ది మధ్యభాగంలో - 1850 తర్వాత బ్రిటిష్ పాలనలో ఉన్న భారతదేశ రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయాలపై ఎన్నో విలువైన రచనలు చేశాడు. ఈ వ్యాఖ్యానాల్లో చాల వరకు నేటికీ ప్రాసంగికతను కలిగివుండడం విశేషం. కోశాంబి అనుసరించిన చారిత్రక పద్ధతి మార్క్సిస్ట్ సామాజిక విశ్లేషణకు కట్టుబడి ఉన్నా, భారతదేశ చరిత్ర అవగాహనకు సంబంధించి కొత్త దృక్పథాన్ని చేపట్టడంలో ఆయన ఘనత ఇమిడి ఉంది. ముందే చెప్పినట్టు, యాంత్రికంగా చారిత్రక భౌతికవాదాన్ని వర్తింపచేయ కూడదన్న కీలకాంశాన్ని ఆయన నొక్కి చెప్పాడు. దీంతో ఇష్టం వచ్చిన రీతిలో చరిత్రకారులు మార్క్సిస్ట్ సిద్ధాంతాన్ని వక్రీకరించి ఆక్షేపణీయంగా చరిత్ర కన్వయించే ప్రమాదాన్నుండి తప్పించాడు. గణిత, గణాంక శాస్త్రాల నేపథ్యం నుండి వచ్చి ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడిగా పేరుగాంచిన కోశాంబి, నాణేలపై పరిశోధన ప్రారంభించి, చరిత్ర ప్రధాన స్రవంతిలోకి అడుగు పెట్టాడు. ప్రాచీన చరిత్ర ప్రామాణికతకు కావల్సిన ముఖ్య ఆకరం పురావస్తు పరిశోధనల ద్వారా లభించిన సమాచారమే గానీ, అప్పటి లేదా ఆ తర్వాత వెలువడ్డ సాహిత్యం కాదన్నాడు. సాహిత్యాధారాలూ ముఖ్యమే, కానీ అవి పురావస్తు ఆధారాలకు అనుషంగికాలు. సాహిత్యాధారాల్లో లభించే చారిత్రకాంశాలు పురావస్తు ఆధారాల ద్వారా రుజువైనప్పుడే వాటిని ప్రమాణాలుగా స్వీకరించాలన్నది కోశాంబి చేసిన ముఖ్య సూత్రీకరణ. సాహిత్య, పురావస్తు ఆధారాలను జోడించడంతో పాటు భాషాశాస్త్రపరమైన అంశాలు, సమాజ మానవశాస్త్రం, సమాజ శాస్త్రం, గణాంక విశ్లేషణ, ఆర్థికాంశాల నుండి పనికొచ్చే విషయాలను సేకరించి చరిత్ర నిర్మాణానికి పూనుకోవాలన్నాడు.

భారతదేశ చరిత్ర పై తన మొదటి ప్రామాణిక గ్రంథాన్ని 'ఆన్ ఇంట్రడక్షన్ టు ద స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ' 1956లో ప్రచురించాడు. భారతదేశ చరిత్రగా కాక, ఆధునిక దృక్పథంలో దేశ చరిత్రను పరిశీలించిన గ్రంథంగా దీన్ని పరిగణించాలన్నాడు. కాబట్టే ఈ గ్రంథాన్ని భారతదేశ చరిత్రకు ఉపోద్ఘాతంగా చెప్పుకొన్నాడు. భారతీయ సమాజంలో నెలకొన్న వివిధ సామాజిక దశలను నిశితంగా పరిశీలించాక, ఇవి పాశ్చాత్య దేశాల్లో నెలకొన్న మార్పులకంటే భిన్నమన్న నిర్ణయానికొచ్చాడు. ఐరోపా ఖండంలోని ప్రాచీన బానిస వ్యవస్థతో సరిపోల్చ దగ్గ సామాజిక వ్యవస్థ భారతదేశంలో లేదన్న అభిప్రాయానికొచ్చాడు. అదే క్రమంలో యూరోపియన్ భూస్వామ్య వ్యవస్థకు ఇక్కడి వ్యవస్థకు పోలికల కంటే తేడాలే ఎక్కువగా ఉన్నాయన్నాడు. ఈ రెండు అంశాల చారిత్రకత ఆధారంగా గత ఐదు దశాబ్దాల్లో అనేక ముఖ్యమైన చరిత్ర పరిశోధనలు జరిగాయి. ఇంకా జరుగుతున్నాయి. పైకి చెప్పకపోయినా కోశాంబి చరిత్ర పద్ధతిని ఎందరో చరిత్రకారులు (మతతత్వ చరిత్రకారులు మినహా) నేడు పాటిస్తున్నారు. ముఖ్యంగా ఆర్థిక, సామాజిక, సాంస్కృతికాంశాలకు ప్రాధాన్యమివ్వడంలో ఈ కొత్త ఒరవడి ప్రస్ఫుటమవుతున్నది. భారతదేశ చరిత్రను కొత్త మలుపులు తిప్పి జవసత్వాలు కల్పించిన మార్క్సిస్ట్ చరిత్ర భాష్యకారుడు దామోదర్ ధర్మానంద్ కోశాంబి. ◆

**గతితార్కిక భౌతికవాద కోణం నుండి కోశాంబి చరిత్రకిచ్చిన నిర్వచనం, దృక్పథం ఇతర చరిత్రకారులకూ విద్యార్థులకూ మార్గదర్శకంగా నిలుస్తుందంటున్నారు ఆశాలత, నరేశ్**

# చరిత్ర అధ్యయనం : డి.డి.కోశాంబి

దామోదర్ ధర్మానంద్ కోశాంబి చరిత్రను మార్క్సిస్ట్ దృక్పథంతో అధ్యయనం చేసిన చరిత్రకారులలో ఆద్యుడు. ఆయన చదువు రీత్యా, వృత్తిరీత్యా గణితశాస్త్రజ్ఞుడు – స్టాటిస్టీషియన్. సంస్కృత గ్రంథాలను పఠించి వ్యాఖ్యానాలు రాశాడు. ప్రపంచ శాంతి ఉద్యమానికి నాయకత్వం వహించాడు. ఇన్ని విశిష్టతలున్నప్పటికీ డి.డి. కోశాంబి చరిత్ర అధ్యయనానికి కొత్తనిర్వచనాలు చెప్పిన చరిత్రకారుడిగా అత్యంత ప్రజాదరణ పొందాడు.

20వ శతాబ్దంలో ప్రపంచ చరిత్రలో అతి ముఖ్యమైన దశల కాలంలో, అంటే ప్రపంచ యుద్ధాలు, రష్యా విప్లవం, వలసదేశాల విముక్తి, చైనా విప్లవం, రెండు అగ్రరాజ్యాల మధ్య ప్రచ్ఛన యుద్ధం జరిగిన కాలంలో (1907 జూలై 31–1966 జూన్ 29) జీవించిన కోశాంబి జీవితంలోనూ, రచనలలోనూ ఆ రాజకీయ పరిణామాలు ప్రతిఫలించాయి.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో టాటా ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసర్చ్‌లో మేథమెటిక్స్ ప్రొఫెసర్‌గా పని చేస్తున్న కాలంలోనే కోశాంబి కమ్యూనిస్ట్ రాజకీయాలతో ప్రభావితుడయ్యాడు. ఆనాడు రష్యాలో జరుగుతున్న పరిణామాలను అవగతం చేసుకున్నాడు. 1952–62ల మధ్య అనేకసార్లు చైనా సందర్శించి అక్కడ జరుగుతున్న రాజకీయార్థిక పరిణామాలను ప్రత్యక్షంగాచూసి ఆకళింపు చేసుకోగలిగాడు. ఆ అవగాహనతోనే, ఆ సమయంలో భారతదేశంలో పాలకవర్గాలు అనుసరిస్తున్న అభివృద్ధి – ఆధునికీకరణలను విమర్శనాత్మకంగా చూశాడు. నెహ్రూ విధానాలు, ప్రజాస్వామిక సామ్యవాద ముసుగులో పెట్టుబడిదారీ విధానాన్ని స్థాపిస్తున్నాయని విమర్శించాడు. ప్రపంచశాంతి ఉద్యమ కార్యకర్తగా, నాయకుడిగా భారతప్రభుత్వ అణ్వస్త్ర అనుకూల విధానాన్ని వ్యతిరేకించాడు. ఇవన్నీ వెరసి భారత పాలకవర్గాలతోనూ, పిలిచి ఉద్యోగం ఇచ్చిన హోమి జె. భాభాతోనూ సంబంధాలు చెడిపోవటానికి దారితీసాయి. టాటా పరిశోధనా కేంద్రంలో ఉద్యోగం వదిలేసాడు. ఆ తరువాత చరిత్ర పరిశోధన పై కేంద్రీకరించాడు.

కోశాంబి రాసిన చరిత్ర పుస్తకాలు రాశీలో తక్కువే అయినా అవి ఆణిముత్యాలు. భారతీయ చరిత్రను విప్లవీకరించిన మహా మేధావి. మార్క్సిస్ట్ దృక్పథంతో చరిత్రను అధ్యయనం చేసిన మొదటి భారతీయ చరిత్రకారుడు. ప్రధాన స్రవంతి జాతీయతావాద, సామ్రాజ్యవాద ఆలోచనా పద్ధతి నుండి పక్కకు తొలగి చరిత్రను కేవలం ఘటనలు – తేదీల కథనంగా కాక సామాజిక, ఆర్థిక పరిణామాల గతిశీల క్రమంగా అర్థం చేసుకున్నాడు.

మార్క్సిస్ట్ దృక్పథంతో చరిత్రకు కోశాంబి చెప్పిన నిర్వచనం ఇది: "చరిత్ర అంటే ఉత్పత్తి సాధనాలు – ఉత్పత్తి సంబంధాల క్రమానుగత అభివృద్ధిని కాలక్రమానుసారం వ్యక్తంచేయటం". "చరిత్ర అంటే యాదృచ్ఛిక సంఘటనల పరంపర కాక మనుషులు తమ రోజువారి అవసరాలను తీర్చుకోవటానికి సృష్టిస్తున్నదే....".

చరిత్రకు ఆయన చెప్పిన ఈ కొత్త నిర్వచనం, దృక్పథం ఆయన సమకాలీన భారతీయ చరిత్రకారులకూ, ఆయన తర్వాతి తరం చరిత్రకారులు – విద్యార్థులకూ ఎంతోమందికి మార్గదర్శకమైంది. కోశాంబి 1956లో రాసిన మొదటి చరిత్ర పుస్తకం 'యాన్ ఇంట్రడక్షన్ టు ద స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ' (భారత చరిత్ర అధ్యయనానికి ఉపోద్ఘాతం) ప్రపంచవ్యాప్తంగా ఎంతోమంది విద్యార్థుల ఆలోచనలకు ప్రేరణగా నిలిచింది. పాఠకులు స్వయంగా చరిత్రను చదువుకునేటట్లు ఈ పుస్తకం ప్రేరేపిస్తుందని, కనీసం భారతీయులు తమ దేశాన్ని మరింత సానుభూతితోనూ, వివేకంతోనూ అర్థం చేసుకునేటట్లు చేస్తుందని ఆశిస్తున్నట్లు ఆ పుస్తకం ముందుమాటలో ఆయనే రాశాడు.

చరిత్ర అధ్యయనానికీ, రచనకూ తాను ఏర్పరచుకున్న దృక్పథానికీ కారల్ మార్క్స్ ప్రతిపాదించిన గతితార్కిక భౌతికవాద సిద్ధాంతం అంతర్‌గర్భితంగా ఉందని పై పుస్తకంలో ఆయన పేర్కొన్నారు. కారల్ మార్క్స్ రాసిన 'క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి', 'క్యాపిటల్' పుస్తకాలలో సమాజ చలన సూత్రాల గురించి, ప్రత్యేకించి భారతదేశం గురించి, ఏసియాటిక్ మోడ్ ఆఫ్ ప్రొడక్షన్ గురించి మార్క్స్ చేసిన సూత్రీకరణలతో కోశాంబి ఉత్తేజం పొందాడు. అయితే మార్క్స్ సూత్రీకరణలను భారతదేశ పరిస్థితులకు గుడ్డిగా, యథాతథంగా వర్తింపజేయలేమని కూడా గుర్తించాడు. ప్రాచీన భారతదేశపు గ్రామీణ ఆర్థిక వ్యవస్థ స్వయం పోషకత్వం గురించి మార్క్స్ రాసిన వ్యాఖ్యలు పదునైనవిగానూ, అద్భుతమైనవిగానూ స్వీకరిస్తూనే, అవి కొన్ని చోట్ల తప్పుదోవ పట్టించేవిగా ఉన్నాయని కోశాంబి భావించాడు.

"భారతీయ సమాజానికి చరిత్ర లేదు, అంటే తెలిసిన చరిత్ర లేదు. మనం చరిత్రగా చెప్పుకుంటున్నది ఒకరి తర్వాత ఒకరు వచ్చిన చొరబాటుదారుల చరిత్ర తప్ప మరొకటి కాదు. ఈ చొరబాటుదారులు ప్రతిఘటన లేని, మార్పు లేని (గ్రామీణ) సమాజపు స్తబ్ధపునాదిపై తమ సామ్రాజ్యాలను నెలకొల్పుకున్నారు" అని మార్క్స్ రాసిన వాక్యాలను కోశాంబి తన చరిత్ర పరిశోధన ఆధారంగా సవాలు చేయకుండా ఉండలేక పోయాడు. భారతీయ చరిత్రలోని మహోన్నత యుగాలైన మౌర్యుల, శాతవాహనుల, గుప్తుల కాలాలు ఎటువంటి చొరబాటుదారులు లేని కాలాలనీ అవి మౌలిక, గ్రామీణ సమాజం ఏర్పాటుకూ, వ్యాప్తికీ, కొత్త వ్యాపార కేంద్రాల అభివృద్ధికీ నిర్దిష్ట సూచికలని ఆయన వివరణ ఇచ్చాడు. ఈ రకమైన విభేదాలున్నప్పటికీ మార్క్సిజమే తన ఆలోచనకూ, పద్ధతికీ ఆధారంగా ఉండిపోతుందని కూడా ప్రకటించాడు.

ప్రతి చరిత్రకారుడి రచనలకు ఏదో ఒక సిద్ధాంతం ఆధారంగా ఉంటుందని కోశాంబి అభిప్రాయపడ్డాడు. అదే విధంగా ఆ చరిత్ర రచనలకు వారి రాజకీయ కార్యకలాపాలకు సంబంధం ఉంటుందని కూడా చెప్పాడు. ఇది ఆయన జీవితంలో కూడా ప్రతిబింబించింది. చరిత్ర అధ్యయనానికీ, రచనకూ మాత్రమే పరిమితమవకుండా ఆ అవగాహనను సమకాలిక పరిస్థితులకు వర్తింపజేసి ఆనాడు జరుగుతున్న ఆర్థిక, రాజకీయ దుష్పరిణామాలను ప్రశ్నించాడు. ప్రపంచశాంతి ఉద్యమంలో (అమెరికా – రష్యాల మధ్య సాగుతున్న ప్రచ్ఛన్న యుద్ధకాలం లోనూ, అణ్వస్త్ర వ్యతిరేక ఉద్యమంలోనూ) క్రియాశీలంగా పాల్గొని తాను ప్రతిపాదించే సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టిచూపించాడు.

1954–55లలో భారతదేశంలో సగటున ప్రజలకు అందుబాటులో ఉండే ఆహారం, రానురాను తగ్గిపోతున్నదని అధికారిక ప్రకటనలు తెలియజేసాయి. ప్రతి మనిషి ఆరోగ్యంగా ఉండటానికి రోజువారి భుజించవలసిన ధాన్యాలు, పప్పులు, పాలు, కూరగాయలు, మాంసం మొదలైన మొత్తం కంటే సామాన్య ప్రజలు చాలా తక్కువ తీసుకుంటున్నారని గణాంక వివరాలతో సహా వచ్చిన ప్రకటనపై స్పందిస్తూ కోశాంబి ఇలా రాశాడు : "భారతదేశంలో ఎవరో కొంతమంది మాత్రమే అవసరమైన పోషక పదార్థాలు గల ఆహారాన్ని కొనగలుగుతున్నారనే వాస్తవం దేశంలో ప్రజల దయనీయ స్థితిని తెలియజేస్తుంది. మెజారిటీ ప్రజలు ఆకలి – అనారోగ్యంతో మగ్గుతున్న ఈ పరిస్థితి శాశ్వతంగా ఉండిపోతుందా లేక భారతీయ సమాజం ఇటువంటి మౌలిక దుస్థితి నుండి బయట పడటానికి సిద్ధంగా ఉందా, సగటు మనిషి బతకటానికి ఇంత తక్కువ ఆహార లభ్యతతో ఏ దేశమైనా ప్రజాస్వామిక దేశంగా ఎంతకాలం కొనసాగగలుగుతుంది" అని ప్రశ్నించాడు.

"దీనికి పరిష్కారం సరైన ఆలోచనల ద్వారా కనుగొనవలసి ఉంటుంది. అందుకోసం చరిత్ర అధ్యయనం తప్పనిసరైంది. అయితే ఆ పరిష్కారాన్ని సరైన కార్యాచరణ ద్వారా నెరవేర్చాలి. అంటే కేవలం గతాన్ని అధ్యయనం చేయటంకాక ఒక అడుగు ముందుకెయ్యాలి. తరతరాలుగా భారతీయ సమాజంలో నిత్యకృత్యంగా ఉన్న స్తబ్దమైన వేదన – బాధల ద్వారా చరిత్రపై అదుపు సాధించటం వీలు కాదు. చరిత్రను సృష్టించాల్సిన సమయం వచ్చేసింది. ఆసియాలోనూ, ప్రపంచలోనూ శాంతిని సంరక్షించటానికి గంభీరమైన ఆలోచనలతో చైతన్యంతో కూడిన ఒక ప్లాన్ తయారు చేసుకోవలసిన సమయం వచ్చేసింది".

పై వాక్యాలలో కోశాంబి చరిత్ర అధ్యయనం ప్రాముఖ్యతను వివరిస్తూ అంతటితో ఆగిపోకుండా ఒకడుగు కార్యాచరణవైపు ముందుకు వెయ్యాలని అదే చరిత్ర అధ్యయనానికి సార్థకత అని చెప్పాడు.

సమాజంలో వర్గ విభజన జరిగిన తరువాత, ఆదిపత్యవర్గాలకు అనుకూలంగా జరుగుతున్న చరిత్ర రచన వాస్తవాన్ని ప్రతిబింబించదని కోశాంబి నిర్ద్వంద్వంగా చెప్పాడు.

"మనిషి తన సహచరుల సహకారంతో అవసరాలను తీర్చుకోవటానికి సాధించిన పురోగతిని చరిత్ర ప్రతిఫలించాలి. కానీ, ఇతరులను దోపిడి చేసే కొద్ది మంది తమ అవసరాలను తీర్చుకోవటంలో సాధించిన విజయాన్ని కాదు."

"వర్గ సమాజంలో సరైన చరిత్ర అధ్యయనం అంటే ఆధిపత్య వర్గాలకూ మిగిలిన ప్రజల ప్రయోజనాలకూ మధ్య ఉన్న అంతరాలను విశ్లేషించటమే. అంటే కొత్తగా పుట్టిన ఒక వర్గం తాను అధికారంలోకి వచ్చే క్రమంలో సమాజానికి అందించిన కొత్త అంశాల పరిధిని, తన స్వంత ప్రయోజనాలను కాపాడుకోవటానికి అభివృద్ధి నిరోధకంగా మారిన (మారనున్న) దశను పరిగణలోకి తీసుకోవటమే."

చరిత్ర పరిశోధనలో కోశాంబి నొక్కి చెప్పిన మరొక బలమైన అంశం చారిత్రక ఆధారాలను కనుగొనడానికి క్షేత్ర పరిశోధన చాలా అవసరమైనది అని. గత చరిత్రను పునర్నిర్మించడానికి మనుష్య శాస్త్రం (ఆంత్రోపాలజి), పురాతత్వ శాస్త్రం (ఆర్కియాలజి) సాధనాలని గుర్తించి నిరూపించాడు.

లిఖిత రికార్డులను పురాతత్వ శాస్త్ర ఆవిష్కరణలతో పోల్చి చూడాలి, వాటిని స్థానిక జాతుల గణాంకాల ద్వారా అర్థం చేసుకొని వివరించాలి. ప్రాచీన సాహిత్యం ఉన్నదంటేనే ఆ సమాజంలో వర్గ విభజన జరిగిందని తెలుస్తుంది. ప్రాచీనకాలంలో అక్షరాస్యత, సాహిత్యం ఉన్నదంటే అప్పటికే అందుకోసం తీరిక సమయం గల పూజారులు, పట్టణజీవితం, వర్గ విభజన ఉన్నదని అర్థం చేసుకోవాలి. ఉత్పత్తి చేసే వారికి ఆ కాలంలో సాహిత్యం కోసం తీరిక సమయం ఉండటానికి అవకాశం లేదు. వారు ఉత్పత్తి చేసిన దానిలోని అతికొద్ది అదనపు ఉత్పత్తిని దోపిడి చేసే వర్గం వారే సాహిత్యం, శిలాశాసనాలు రాశారు. చరిత్రకారులు వాటిని ఆధారం చేసుకొని పని చేయాలి. గతాన్ని 'తవ్వటం' ద్వారా ఉత్పత్తి సాధనాలకు సంబంధించిన చాలా విషయాలు తెలుస్తాయి. పూరాతత్వ శాఖ తవ్వకాలలో బయటపడే ఇళ్లు, సమాధులు, పరికరాలు, వంటపాత్రలు, ఆయుధాలు మొదలైన వాటిని మనుష్య శాస్త్ర (ఆంత్రోపాలజి) అధ్యయనంతో కలుపుకొని పరిశీలించినప్పుడు ఆ నాటి ఉత్పత్తి సంబంధాలు, వర్గాలు – గుంపుల మధ్య సంబంధాలు అర్థమవుతాయి. "మిత్ అండ్ రియాలిటి", "ద కల్చర్ అండ్ సివిలైజేషన్ ఆఫ్ ఏన్షియంట్ ఇండియా" అనే పుస్తకాలలో ఆయన చరిత్ర పునర్ నిర్మాణానికి పురాతత్వ శాస్త్ర ఆధారాలను, తన స్వంత క్షేత్ర పరిశోధనా వివరాలను విస్తృతంగా ఉపయోగించాడు.

ఉత్పత్తి వ్యవస్థలు, సంస్కృతులు, కుల–మత వ్యవస్థలు, సామ్రాజ్యాల ఉత్థానపతనాలు, యుద్ధాలు, పురాణాలు, ఇలా ఒకటేమిటి – సమాజపు పునాది, ఉపరితలంలోని అన్ని అంశాలనూ, లక్షణాలనూ చరిత్ర అధ్యయనం ద్వారా అర్థం చేసుకోవచ్చని కోశాంబి పుస్తకాలు మనకు నిరూపిస్తున్నాయి. ఆయన తర్వాతి తరం భారతీయ చరిత్రకారులు కోశాంబి భుజాలపై నిలచి చరిత్రను అర్థం చేసుకున్నారని అంటే అతిశయోక్తి కాదేమో. ఆయన పుట్టి వంద ఏళ్లు అయినా, చనిపోయి 40 ఏళ్లు కావస్తున్నా ఇప్పటికీ, ఇక ముందు కూడా ఆయన రచనలు ప్రామాణిక గ్రంథాలుగానే ఉండిపోతాయి. ◆

**డి.డి. కోశాంబి చరిత్ర రచనలు**

1. యాన్ ఇంట్రడక్షన్ టు ద స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ, పాపులర్ బుక్ డిపో, బొంబాయి, 1956; 2. ఎక్జాస్పరేటింగ్ ఎస్సేస్ : ఎక్సర్‌సైజెస్ ఇన్ ద డైలెక్టికల్ మెథడ్ పీపుల్స్ బుక్ హౌస్, పూనా, 1957;3. మిత్ అండ్ రియాలిటి : స్టడీస్ ఇన్ ద ఫార్మేషన్ ఆఫ్ ఇండియన్ కల్చర్, పాపులర్ ప్రకాశన్, బొంబాయి, 1962; 4. ద కల్చర్ అండ్ సివిలైజేషన్ ఆఫ్ ఏన్షియంట్ ఇండియా ఇన్ హిస్టారికల్ ఔట్ లైన్, రౌట్‌లెడ్జ్ అండ్ కేగన్‌పాల్ పబ్లికేషన్స్, లండన్, 1965; 5. డి.డి. కోశాంబి: కంబైన్డ్ మెథడ్స్ ఇన్ ఇండాలజి అండ్ అదర్ రైటింగ్స్ (సంకలనం : జాదులాల్ ఛటోపాధ్యాయ) ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, నూఢిల్లీ, 2002

**పాలకుల మతాల ప్రాతిపదికన చారిత్రక యుగ విభజన చేయడం మతతత్వ చరిత్ర రచనా దృక్పథంలోని ప్రధాన లక్షణం అంటున్నారు ఎస్. మహబూబ్ బాషా**

# జాతీయతత్వం ఒళ్లో మతతత్వం కొమర్రాజు రచనల పరిశీలన

*(గత సంచిక తరువాయి)*

**తా**ళికోట యుద్ధమును గూర్చి ఈయన చేసిన వర్ణన భయంకర మతతత్వం కూడి హిందూ - మహమ్మదీయులు ఘోరంగా తల పడినట్లుంది. ఆయన మాటల్లోనే -

మహమ్మదీయుల సైన్యము దక్షిణమువైపు ముఖము చేసి నిలబడెను. హిందువులుత్తరపువైపు ముఖము చేసియుండిరి. హిందూ సైన్యము యొక్క మధ్యభాగము మీద నీ [మహమ్మదీయ] విలుకాండ్రు శరవృష్టి కురిపించిరి. అంత హిందువులు వారితో బోరుచు వారిని సమీపింపఁగా... శతఘ్నులు హిందువులపై నగ్నివర్షమును గురిపింప సాగెను. అంత హిందువులాగలేక యెక్కువ జనమును గోలుపోయి వెనుకకుబోయిరి. కాని కుడి యెడమవైపున్న హిందూ సైనికులు మిక్కిలి పరాక్రమము జూపి ముసల్మానులను వెనుకకు దొబ్బిరి. హిందువులు తురుష్కుల మధ్యభాగములోని ఫిరంగులమీదికి బోయిరి. కాని వారు సమీపింపగనే ఫిరంగులలో రాగి డబ్బులు వేసి తరుష్కులు కొట్టిరి. అంతనైదువేల హిందువులు ఫిరంగుల యెదుటబడి మరణ మొందిరి. మిగిలినవారు చిందరవందరైరి. ఇంతలో నిజాము సైన్యములోనుండి యైదువేల గుర్రపురౌతులు హిందూసైన్యములోనికి జొరఁబడిరి. రామరాజు మస్తకము వెంటనే తునిమి దానిని బల్లెమునకు దగిలించి యెత్తి హిందూసైన్యమునకు జూపెను. రామరాజు పడినతోడనే హిందువులు గతధైర్యులై యెచ్చటి వారచ్చట బారిపోసాగిరి. తురుష్కులు వెంటదగిలి హిందువులను వారి మనసువచ్చునట్లు సంహరించిరి. నరకబడిన హిందువుల సంఖ్య లక్షకు దక్కువ యుండదు. ఇంతటితో ఆంధ్రుల వైభవమంతయునంతరించెను. (మ.మ.పు. 326-328) అని ఎంతో విషాదంగా వర్ణించారు. అంతేకాక 'విజయనగర వినాశనము' శీర్షికన "ఇట్లోడిపోయిన హిందువులు మరల గుమిగూడి తురుష్కుల నెదిరింప ప్రయత్నించన వారైనను గారు. బలాఢ్యులకు సాధ్యము కాని విజయనగరము దొంగలపాలయ్యెను. మూడవ దినమునకు దురుష్క సైన్యములన్నియు వచ్చిచేరెను. ఆరు నెలల వరకు నీ సైన్యములా పట్టణమందు జేసిన ఘోరకృత్యములింతింతయని వర్ణించుటకు వీలుగాదు. విజయనగర భాస్కరుడింతటితో నస్తమించెను" (మ.మ.పు. 328-329) అని గుండెలు బాదుకున్నారు.

తనకాలములోని జాతీయభావాన్ని ప్రాచీన భారతదేశానికి ఆపాదించి 'విదేశీయులు' అయిన గ్రీకులు మొదలైన వారితో పోరాడిన వారిని దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడిన 'జాతీయవీరులు'గా చిత్రించిన కొమర్రాజువారు అటువంటి 'జాతీయవీరు'లకు వారి 'స్వాతంత్ర్య పోరాటం'లో సహకరించకుండా 'విదేశీయు'లకు సహకరించిన వారిని "దేశద్రోహు"లనీ స్వాతంత్ర్యవాంఛలేని వారనీ, "మహాపాపు"లనీ "దేశఘ్ను"లనీ తూలనాడారు. 'జాతీయ వీరుల' ఓటమికి కారణాన్ని ఈ 'దేశద్రోహు'ల్లో చూపారు. అంతేకాకుండా ఓడిపోయిన 'హిందూ రాజులు' 'మోసం' ద్వారా మాత్రమే జయించబడ్డారన్నారు.

విదేశీయుడైన అలెగ్జాండరుతో "స్వాభిమానమును, స్వదేశాభి మానమును, స్వాతంత్ర్యాభిరుచియు" కల్గిన పురుషోత్తముడు తలపడినప్పుడు "స్వదేశాభిమానశూన్యులై[న] కొందరు [హిందూ] నృపులు పరరాజునకు దోడైనందున నతనికి విజయమే సంప్రాప్తమయ్యె" (హి.మ.పు. 90-91) అన్నారు. శిలాదిత్యుడు (క్రీ.శ. 583) "తన తండ్రి విక్రమాదిత్యుడి పద్ధతికి విరుద్ధముగా శకయవనాది పరరాజుల మిక్కిలి గౌరవించుచుండినందువలన" అతన్ని "పరదేశపక్షపాతి" అని తిట్టారు (హి.మ.పు. 136). 1309వ సంవత్సరములో మాలిక్ కాఫర్ ఓరుగల్లు మీదికి దండెత్తివచ్చినపుడు "దేశద్రోహియైన కటకరాజు తురుష్కులకు సాహాయ్యము చేసినందువలనను, మాతృద్రోహులగు కోటలోని కొందరు నాయకులు ధనాశచేత దురుష్కులకు ననుకూలురై నందువలనను" కాకతీయ ప్రతాపరుద్రుడికి ఓటమి కలిగిందన్నారు (హి.మ.పు. 181). స్థానేశ్వర మహాయుద్ధములో "దేశద్రోహులగు హిందూరాజులు గోరీపక్షమునందు" ఉండడం వల్లనూ, హాహుతీ రాయడన్న "స్వామిద్రోహి" చేసిన మోసం కారణంగానూ "హిందువులకు బరాభవము కలిగెను" (మ.మ.పు. 24) అన్నారు. పృథ్వీరాజును ఓడించిన తర్వాత 'గోరీ' "దేశద్రోహియై తనకు సహాయము చేసిన కనోజ్‌రాజగు జయచంద్రుని" గెలిచాడని చెబుతూ "జయచంద్రుడు గంగలో బడి ప్రాణము విడిచెను. దేశద్రోహికిది తగినశిక్ష కాదని యెవరు చెప్పగలరు?" (మ.మ.పు. 25) అని ప్రశ్నించారు. "దేశద్రోహి"కి తగిన శిక్షపడ్డందుకు సంతోషించారు. అల్లాఉద్దీన్ ఖిల్జీ 'రతనభోర్'ను జయించడం "స్వామిద్రోహియు విశ్వాసఘాతకుడును" అయిన హంబీరదేవుడి మంత్రివలన సులువైందన్నారు (మ.మ.పు. 37). "దేశద్రోహి" అయిన సిసోదియను రాయసీన్ ప్రాంతపురాజు" రాణాసంగా కు 'ద్రోహం' చేశాడంటూ "నీ దేశఘ్నుడగు మహాపాపి బహిరంగముగా మ్లేచ్ఛసైన్యములతో గలిసి రాజపుత్రులతో బోరెను. ఇట్లు యుద్ధసమయ మునందు మోసమును ద్రోహమును కలిగినందున రాజపుత్రులకు బరాభవము కలిగె; మహమ్మదీయులకు రాజ్యము వచ్చెను" (మ.మ.పు. 200) అన్నారు. మొగలులపక్షం వహించిన జయపూర్, జోధ్‌పూర్

రాజపుత్రులను "కులద్రోహు"లని తూలనాడుతూ వారు "కులద్రోహులయి మోగలులకు సాయము చేయుటకు మారుగా నమరసింగునకు సహాయము చేసి యుందురేని రాజపుత్రస్థానమంతయు నొక్కపెట్టున స్వతంత్రమైయుండును" (మ.మ.పు. 218) అని వాపోయారు.

కొమర్రాజుగారిలోని 'హిందూ జాతీయవాది' ప్రాచీన కాలము నుండీ "హిందూ" రాజులని తను భావించిన రాజులలో 'దేశాభిమానమూ' 'ఐకమత్యమూ' లేని కారణంగా 'హిందూదేశం' 'విదేశీయుల పాలైంద'ని వాపోయాడు. అందుకే అలెగ్జాండరు విజయాన్ని గూర్చి రాస్తూ "2234 సంవత్సరముల కిందట నిట్లు హిందూదేశము మీదికి వచ్చిన యలెగ్జాండరు కాలము నుండియు నేటివరకును మన హిందువులైకమత్యము లేనివారై, సామర్థ్యము గలవారయ్యును పరస్పర ద్వేషములచే నా సామర్థ్యంబును వ్యర్థపుచ్చుకొనుచు, దమ వారికి ["హిందూరాజు"లకు] సాయము చేయుటకు మారుగా దమవారిని దామే గెలుచుచు తుదకు దాములు నాశనమొందుచుండిరి" (హి.మ.పు. 91) అని చింతిల్లారు. "హిందువు"లలో తానాశించిన ఐకమత్యము కనబడకుండడంతో ఎన్నో సందర్భాల్లో దుఃఖపడ్డారు. 'హిందూ మహాయుగము" నకు 'ఉపసంహారము'ను రాస్తూ 'హిందూదేశ పారతంత్ర్యమునకు గారణములు' వివరిస్తూ 'స్వదేశ రాజులలో నైకమత్యము లేకపోవుట' యే "యీ దేశ పారతంత్ర్యమునకు ముఖ్య కారణము. వారిలో నైకమత్యములేక, ద్వేషములు ముదిరి, తురుష్కుడు వచ్చి యొకానొక ['హిందూ'] రాజును బాధపెట్టునప్పుడు ఇతర రాజులు వానికి సాహాయ్యము చేయక యూరకచూచు" చుండిరని అన్నారు (హి.మ.పు. 193).

'హిందూ' రాజులందరూ కలిసికట్టుగా ఉండి 'మహమ్మదీయ' రాజులనెదిరించాలన్న హిందూతత్వ కోరిక ఆయనకు ఎంత బలంగా ఉండిందంటే ఆ కాలములో దక్షిణములో శూరాగ్రేసరులయిన అనేక మంది హిందూ రాజులుండికూడా వారు ఉత్తర దేశమందలి హిందూ రాజులకు సహాయం చేయలేదని కడు వేదనతో నిష్ఠూరమాడారు. ఆయన మాటల్లోనే – "…. గజ్నీ మహామూదు కాలముననుండి యీ బానిసవంశ మంతమందువరకు మూడువందల యేండ్లయ్యెను. ఈ కాలములో దురుష్కులుత్తర హిందూదేశములోని యనేక హిందూరాజుల గెలిచిరి. దక్షిణములో నాకాలముననేక శూరాగ్రేసరులయిన [హిందూ] రాజులుండిరి. ఓరుగంటిలోని కాకతీయులును, దేవగిరిలోని యాదవ రాజులను వైభవోన్నతియందుండిరి. అనేక హిందూరాజులు దక్షిణమునందుండిరి. కాని యుత్తరదేశమందలి హిందూరాజుల కొక్కడును సహాయము చేయదాయెను. ఉత్తరమునందేమి జరుగుచున్నదియు దెలిసి కొనరైరి. తమలో దామైక్యభావమును గుదుర్చుకొని సైన్యముల వృద్ధిపరిచి చారులనుబంపి తురుష్కుల వర్తమానములు దెప్పించుకొనుచు దమపైకి దురుష్కులు రాకుండు మార్గమునైనను జేయరైరి…" (మ.మ.పు. 32)

ఖుమాన్ (క్రీ.శ. 836) కాలములో 'ఉత్తర హిందూదేశము'లోని హిందూ రాజులలో కొంతవరకు 'స్నేహము', 'ఐకమత్యము' ఉండిందని రాస్తూ "ఇట్టి యైకమత్యత వలననే యప్పుడువారు తమ యొక్క ప్రాభవమును కాపాడగలిగిరి! హా! ఈ యైకమత్యమే స్థానేశ్వరమందు పృథ్వీరాయడు మహమ్మదుఘోరీతో బోరాడునపుడు లేకపోయెగదా? అప్పుడే యిట్టి యైకమత్యముండిన యెడల నీ హిందూదేశ చరిత్ర మనమింకొక విధమున వ్రాసి యుందుము కదా?" (మ.మ.పు. 187) అని వ్యథ చెందారు.

రాజసింహుడి (1654 – 1681) గూర్చి రాస్తూ అతడి "దైవిక సుగుణ సంపదను వేయినోళ్లగొనియాడినను" చాలదంటూ "కాని యీతనియందు నొక దుర్గుణముండెను. ఔరంగజేబు యొక్క పొగరు పూర్తిగ నడచి రాజపుత్రస్థానమునకే కాక హిందూదేశమునకంతటికిని స్వాతంత్ర్యమొసగు యోగ్యత యాతనికుండియు, నపరిమిత దయయను నొక దుర్గుణమీతని యందుండుటచే నీతినివలన నట్టి ఘనకార్యము జరుగలేదు! తన రాజ్యమును మాత్రము రక్షించుకోనగలిగెను" (మ.మ.పు. 230) అని నిష్ఠురమాడారు. తన రాజ్యాన్ని మాత్రమే కాపాడుకున్న స్వార్థపరుడు రాజసింహుడు అనకపోయినందుకు మనం సంతోషించాలి!

కొమర్రాజు గారిలోని హిందూ జాతీయవాద పిచ్చి ఎంతగా ముదిరిపోయిందంటే "మహారాష్ట్ర రాజ్య సంస్థాపకుడగు శివాజీ యీ రాజసింహునితో సమకాలీనుడు. శివాజీ 1680లోనూ, ఈతడు 1681లోనూ కీర్తిశేషులయిరి. వీరిద్దరును నేక వంశజులు; హిందూ మతమునందభిమానము కలవారు. ఇద్దరికిని [ముస్లిమయిన] ఔరంగజేబు శత్రువు. [హిందువులైన] వీరిద్దరును గలిసి ఔరంగజేబుతో బోరాడియుండిరేని యాతనిమచ్చ పూర్తిగా మాపియుందరు. కాని వారేకారణము చేతనో వేరువేరుగానే ఔరంగజేబుతో బోరాడిరి" (మ.మ.పు. 230) అని తన అసంతృప్తిని ప్రకటించారు.

ఆయనలోని మూర్తీభవించిన హిందూ సంఘటనవాది మరాఠులు రాజపుత్రస్థానము మీదికి దండెత్తిన విషయాన్ని వివరిస్తున్న సందర్భంలో బృహదావతారాన్నెత్తాడు. జగత్‌సింగ్ (1734–1752) కాలములో "మారాటావారు రాజపుత్రస్థానము మీదికి దండెత్తివచ్చి చౌదాయియను నాలవవంత పను పసూలు చేయదొడగిరి. రాజపుత్రులు హతవీర్యులయ్యిరి" అంటూ – "ఈ కాలమున మరాటావారు రాజపుత్రు లతో బోరాడుట చూడ మిక్కిలి యాశ్చర్యముగనున్నది. రాజపుత్రులు హిందువులు; ఈ దేశపువారు; మిక్కిలి శూరులు; అప్పటివరకు [విదేశీయులును, శత్రువు లును నయిన] మోగలులతో బోరాడి పోరాడి యలసియుండిరి. అట్టి సమయమున [హిందువులే అయిన] మరాటావారు తమ దేశమత బంధువులకు సాయము చేసి, వారును దామును గలిసి క్షీణించుచున్న ఢిల్లీ మోగలుల వెంట దగిలియుండిన యెడల నచిర కాలములోనే హిందూదేశ మందంతటను హిందూ రాజ్యము వ్యాపించి, దేశమునకు అప్పటికి నేడువందల యేండ్ల కిందబోయిన స్వాతంత్ర్యమచ్చి యుండును. [కాని] వారు అట్లు చేయక తమ సోదరులయిన రాజపుత్రులను పీడించి, వారి బలమును తమ బలమును వ్యర్థపుచ్చుటయే మంచిదని తలంచిరి!" (మ.మ.పు. 232) అని వగిచారు. ఈ విధంగా హిందువులూ, తనకత్యంత ఆరాధనీయులూ అయిన మరాటావారు, రాజపుత్రులు కలిసికట్టుగా ఉండి "ఉమ్మడి శత్రువు"తో పోరాడకపోగా ఒకరిపై ఒకరు దాడిచేసుకోవడం చూచి హతాశులయ్యారు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు! పైన మనం చూచిన ఉదాహరణ(లు) ప్రస్తుతం ఆర్‌ఎస్‌ఎస్ వారి 'హిందువు హిందువు బంధువురా' అన్న నినాదం వలె ఉందికదా!

## IV

ఇంతకూ ప్రచురణకర్తలు ఈ పుస్తకాలను ఎందుకు పునర్ముద్రించినట్లు? 'ప్రచురణ విజ్ఞప్తి'లో వీరు పేర్కొన్నట్లుగా కేవలం "తెలుగువారి

సాంస్కృతిక చారిత్రక సాహిత్య సదవగాహన" అనే "ఆశయం" మాత్రంతోనేనా లేక ఇతరమైన, బలమైన రాజకీయ కారణాలు ఉన్నాయా అన్న విషయాన్ని పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. విషయంలోకి వెళ్లేముందు వారు ఏ ఉద్దేశంతో వీటిని పునర్ముద్రించినా మరుగునపడ్డ పుస్తకాలను ముద్రించారు కాబట్టి వారిని ('సుపథ ప్రచురణలు') ప్రశంసించకుండా ఉండలేము.

ఈ పుస్తక పునర్ముద్రణల వెనుకనున్న రాజకీయ 'పరమోద్దేశం' 'హిందూ మహాయుగము' నకు కందుకూరి శివానందమూర్తి రాసిన 'ఆమోదము' లోనూ, ఆంధ్రభూమి దినపత్రిక సంపాదకుడైన ఎం.వి.ఆర్. శాస్త్రి రాసిన 'ఒక అదృష్టం' లోనూ. ఈ పుస్తకాల సంపాదకుడైన అక్కిరాజు రమాపతి రావు రాసిన 'కొమర్రాజువారు' లోనూ, అక్కిరాజే 'మహమ్మదీయ మహాయుగము'ను పరిచయం చేస్తూ రాసిన 'మధ్య యుగాల పూర్వాపరాలు – భారతదేశ చరిత్ర'లోనూ స్పష్టంగా కన్పిస్తోంది.

శివానందమూర్తి తన 'ఆమోదము'లో "ఈనాటికి కూడ ప్రజలకు ఉపయోగకరమగు" 'హిందూమహాయుగము'ను పునర్ముద్రించడం ద్వారా ప్రచురణకర్తలు 'ఎంతేని లోకోపకారము' అయిన పని చేశారన్నారు; ఈ గ్రంథం "భారతీయతను పరిచయం" చేస్తుందన్నారు. "నేటి సామ్య వాదుల చరిత్ర రచనా ధోరణి వలె కాక" "రాజకీయ ప్రయోజన దృష్టిలేని నిష్పక్షపాత పరిశోధనతో కూడిన భారతీయ చరిత్రరచన చేయు ప్రయత్నం నేడు సాగుచున్నది" అంటూ ఋగ్వేదము 6000 సంవత్సరముల నాటిదన్న వితండవాదాన్ని సమర్థిస్తున్నారు ('ఆమోదము', హి.మ.పు.III - IV). అలాగే "ఆర్యులు విదేశీయులన్న సిద్ధాంతము నేటికి అనేక పరిశోధనల ఫలితముగా నిరాకరించబడినది" అంటూ సంతోషిస్తున్నారు.

పి.ఎన్.ఓక్ లాంటి కరుడుగట్టిన హిందూత్వ చరిత్రకారులు మతతత్వ పైత్యంతో కక్కుకుంటున్న విషయాల్నే పాయసంలా జుర్రుకుంటున్న ఎం.వి.ఆర్. శాస్త్రి అనే చరిత్ర రచనాశాస్త్రం అంటే ఏమిటో తెలియని 'చరిత్రకారుడు'(?) శాస్త్రీయపద్ధతులతో చరిత్రను రచిస్తున్న మేధావులను తెగనాడుతూ 'ఒక అదృష్టం'లో తన క్షుద్రత్వాన్ని నగ్నంగా బయటపెట్టుకున్నాడు. దాదాపు రాజుల వ్యక్తిగత చరిత్రలను పి.ఎన్.ఓక్ మొదలైన వారి నుండి శుభ్రంగా కాపీకొట్టి *ఏది చరిత్ర?, ఇదీ చరిత్ర* అనే క్షుద్ర చరిత్రలను క్రోడీకరించిన ఈయన పటిష్టమైన వాదనతో సెక్యులర్ చరిత్రకారులను ఎదుర్కోవడంలో విఫలమై తిట్లదండకాన్ని లంకించుకున్నాడు. అందుకే "వెయ్యేళ్ల విదేశీ దాష్టీకం నుంచి జాతి బయటపడ్డా బానిస మనస్తత్వం మేధావులను వదలలేదు" అనీ, "తెల్లవాడు కట్టిన మాసికగంతలను అవతల పారేసి, జాతి గతాగతాలను సిసలైన జాతీయ దృష్టితో అవలోకించే విద్య మనకు అబ్బలే"దనీ, "విదేశీయుల కళ్లతో దేశచరిత్రను తిలకించి, పగవారి రాతలనూ కూతలనూ పరమప్రమాణంగా పరిగణించి, నికృష్టపు వాదాలతో జాతి ఉత్కృష్టతను ఈసడించే పెడధోరణిని సోకాల్డ్ మేధావివర్గం వీడలే"దనీ, "పెద్ద కుర్చీల్లో కూర్చున్న కొద్దిబుద్ధులు, కుహనా మేధావులు" "వంకదారులు" పట్టినారనీ, ఈ చరిత్రకారులు "పాశ్చాత్యుల భావాలను ముక్కునపట్టి అప్పగించి, దేశీయ సారస్వత భాండాగారాన్ని చులకన" చేస్తున్న "అసంపూర్ణ ప్రజ్ఞావంతు"లనీ వెర్రికూతలు కూసి తన హిందూత్వాగ్రహాన్ని వెల్లగక్కాడు.

ఈ పుస్తకాల సంపాదకుడైన అక్కిరాజు రమాపతిరావులోని హిందూత్వ కాలకూట విషం 'మహమ్మదీయ మహాయుగము'కు రాసిన ముందుమాటలో స్పష్టమైంది. పరాకాష్టనందిన హిందూత్వ భావజాలం వల్ల ఆయనకు "గత వెయ్యేళ్ళ భారతదేశ చరిత్ర అధ్యయనం చేస్తే పరమవిషాదం.... అమితభీతావహమైన విస్మయం" కలిగించేదిగా కన్పించింది. ఆయన దృష్టిలో "మతవ్యాపనం వ్యాజంతో, రాజ్యతృష్ణతో పరదేశాలనుండి దండయాత్రలు చేసి రాజులెందరో, భారతదేశ శతాబ్దుల జనజీవనాన్ని సంక్షుభ్దంపాలు చేశారు". అందుకే "అదంతా తలచుకొంటే ఒక పెద్ద భయంకరమైన పీడకల అనిపిస్తుంది ఇప్పటికీ" అని హిందూత్వా వేదన వ్యక్తం చేశారు. కొన్ని విషయాల్లో కొమర్రాజుగారితో తామంగీ కరించకపోయినా ఈ పుస్తకాల్లో ఉన్న మతతత్వ భావజాలం తమకను కూలంగా ఉండడంతో ఆయన "జాతీయ తాదాత్మ్య దృక్పథంతో" రాశారన్నారు. ఇక హిందూత్వ పైత్యం ముదిరిపోయి తను సంకలనం చేసిన *నేటి భారతదేశ చరిత్ర : ప్రముఖ చరిత్ర విద్వాంసుల విశ్లేషణ*[12] అనే పుస్తకంలో 'ఏది చరిత్ర? ఏది కాదు' అనే వ్యాసంలో నూరేళ్ల కిందట పాఠ్యగ్రంథాలుగా ఉన్న లక్ష్మణరావు గారి పుస్తకాలు "ఇప్పుడెందుకు పనికిరావు" అని ప్రశ్నిస్తున్నారు. ఆ పుస్తకాలు విద్యార్థులకు "జాతీయాభిమానాన్ని", "దేశభక్తిని" ప్రబోధిస్తాయంటు న్నారు. "ఏ దేశానికైనా అది అభివృద్ధి చెందాలంటే జాతీయాభిమానం, దేశభక్తి అవసరం కదా!" అంటున్నారు. అంతేకాక "జాతి అనేదే లేదు, దేశభక్తి మతసామరస్యం చెరుస్తుంది అని వాదించడం అవివేకం" అని దబాయిస్తున్నారు.

పై విషయాలను మనం పైపైన తరచి చూచినా వారు ఎలాంటి 'జాతీయభావాన్నీ', 'దేశభక్తి'నీ కోరుకుంటునారోనన్నది స్పష్టమవుతుంది. మతాధార జాతీయవాద క్షుద్రభావజాలం (హిందూత్వ) కలవారు కాబట్టే తమ ఫాసిస్టు రాజకీయాలకు బలం చేకూర్చే సైద్ధాంతిక ముడిసరుకు పుష్కలంగా ఉండడం వల్లనే (కొన్ని విషయాలు వారి రాజకీయాలకు విరుద్ధంగా ఉన్నా) కొమర్రాజు వారి పుస్తకాలను సొంతం చేసుకున్నారు; పునర్ముద్రించారు. అంతటితో ఆగకుండా అవి ఇప్పుడు పాఠ్యపుస్తకాలుగా ఎందుకు పనికిరావని ప్రశ్నించేంతవరకూ బరితెగించారు. తెలుగువారి సాంస్కృతిక జీవితంలో పదిలమైన స్థానం కల కొమర్రాజువారి పుస్తకాలను పునర్ముద్రించడం ద్వారా వీరు తమ భావజాలానికి సాధికారతని చేకూర్చుకునే ప్రయత్నం చేస్తున్నారనేది సుస్పష్టం. కొమర్రాజువారి సాంస్కృతిక కృషిపట్ల కన్నా ఆయన పుస్తకాల్లో, కొంతవరకు అచేతనంగానే అయినా, ప్రవహించిన హిందూత్వ భావజాలానికి తోడ్పడే విషయం పట్లనే వీరికి మక్కువ ఎక్కువ అనేది మరీ స్పష్టం.

ఈ పుస్తకాల పునర్ముద్రణ రాజకీయాలను గత మూడు, నాలుగు దశాబ్దాలుగా సంఘపరివార్ శక్తులు చరిత్రపై నిరాఘాటంగా చేస్తూవస్తున్న దాడిలో భాగంగా చూడాలి; అర్థం చేసుకోవాలి. చరిత్ర పనికిమాలిన విషయమనీ, దానికి మార్కెట్ వ్యాల్యూ లేదనీ కొందరు హైటెక్, సిఇఓ రాజకీయ నాయకులు వాదిస్తున్న సందర్భంలో, చరిత్ర పట్ల యిలాంటి భావాలే సర్వత్రా వ్యక్తమవుతున్న తరుణంలో, చరిత్ర, చరిత్ర రచన, ప్రచురణ, వక్రీకరణ భారతసమాజానికి పట్టిన చీడలైన సంఘపరివార్ శక్తులకు అత్యంత ప్రీతికరమెందుకవుతోంది? ఈ విషయాన్ని నిబద్ధతకు పేరుగాంచి లబ్ధప్రతిష్ఠుడైన చరిత్రకారుడు వకుళాభరణం రామకృష్ణ ఈ కింది విధంగా విశ్లేషిస్తున్నారు. ఆయన మాటల్లో – సంఘపరివార్ తన ప్రత్యక్ష దాడిని రాజకీయ ప్రత్యర్థులపై కంటే చరిత్రపైనే [భారీ స్థాయిలో]

ఎక్కుపెట్టింది. [కరుడుగట్టిన మతోన్మాదసంస్థ అయిన ఆర్.ఎస్.ఎస్. రాజకీయముఖమైన బి.జె.పి] ఎందుకిలా చేసిందని ఆలోచిస్తే రెండు విషయాలు స్ఫురిస్తాయి. ఒకటి [హిందూత్వ] భావజాలాన్ని సమాజంలో చొప్పించేందుకు చరిత్ర ప్రబల సాధనంగా ఉపయోగపడుతుంది. ఏ ఇతర అధ్యయనాంశాలకూలేని యీ వెసులు బాటు ఒక్క చరిత్రకే ఉందని మనం గమనించాలి. వక్రీకరణలతో చరిత్రను బోధించడం ద్వారా పౌర సమాజాన్ని తమ [హిందూత్వ] మతతత్వంతో ఆకట్టుకొని, దానిపై పట్టుసాధించి, తద్వారా తమ అంతిమధ్యేయమైన రాజకీయాధికారాన్ని చేజిక్కించుకోవచ్చు. [వైూన పూరితమైన, ఊహాజనితమైన హిందూరాష్ట్రాన్ని సాధించవచ్చు]. ఇదీ వారివ్యూహం. దీనికి ఈ శక్తులు స్వల్పకాలిక, దీర్ఘకాలిక ప్రణాళికలు సిద్ధంచేసుకున్నాయి. స్వల్పకాలికంగా, చరిత్ర పాఠ్యపుస్తకాలను మార్చడం, అది గత పదిసంవత్సరాలుగా వీరవలంబిస్తున్న ఒక ఎత్తుగడ; దీర్ఘకాలికంగా చరిత్ర పరిశోధనను తమకనుగుణ్యంగా ప్రభావితం చెయ్యడం...”[13].

చరిత్రపై సంఘపరివార్ శక్తులు తమ మతోన్మాద బాణాలను ఎక్కుపెట్టడమనేది కేవలం ఇటీవలి పరిణామం ఎంతమాత్రమూ కాదు. స్వాతంత్ర్యానంతర భారతదేశంలో దీనికి సుమారు మూడు దశాబ్దాల చరిత్ర ఉంది. 1978లో సంఘపరివార్ శక్తులతో కూడిన జనతాప్రభుత్వ హయాంలో మొట్టమొదటిసారిగా ఈ దాడి జరిగింది. ప్రఖ్యాత చరిత్రకారులైన ఆర్.ఎస్. శర్మ లాంటివారు రాసిన ఎన్‌సిఈఆర్‌టి పుస్తకాలను హిందూమతాన్నీ, సంస్కృతినీ కించపరిచే భాగాలున్నాయన్న మిషపై నిషేధించడం జరిగింది. వాస్తవంలో ఈ పుస్తకాల్లోని మధ్యయుగంలో వివిధ సంస్కృతుల మేళవింపు, తద్వారా భారతీయ బహుళ మిశ్రమ సంస్కృతి ఏర్పడ్డం లాంటి విషయాలను జనతా ప్రభుత్వంలో భాగంగా ఉన్న మతోన్మాదశక్తులూ జీర్ణించుకోలేకపోయాయి. అంతేకాక చారిత్రక విశ్లేషణ కేవలం మత దృష్టితో కాకుండా ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక కోణాలనుండి జరగాలన్న శాస్త్రీయ దృక్పథం వీరి హిందూత్వ అజెండాకు గండిపెడుతుంది కాబట్టి ఆ పుస్తకాలపై దాడి చేశాయి. కానీ ఈ నిషేధాన్ని వ్యతిరేకిస్తూ దేశంలో తీవ్ర నిరసనలు వెల్లువెత్తడంతో ప్రభుత్వం వెనుకంజవేసింది. జనతా ప్రభుత్వ పతనంతో కొన్ని సంవత్సరాలపాటు ఈ మతోన్మాదశక్తులు నివురుగప్పిన నిప్పులా ఉండిపోయాయి.[14] 1978-79 లోనే ఆర్.ఎస్.ఎస్. సంబంధీకులు ఐసిఎచ్ఆర్ లో ఉండి ఆర్‌సి మజుందార్ ప్రధాన సంపాదకత్వం కింద భారతీయ విద్యాభవన్ వెలువరించిన ది హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ఇండియన్ పీపుల్ ను అనువదించడం జరిగింది. ఈ పుస్తకాలు, ముఖ్యంగా ఏడవవాల్యూమ్, మధ్యయుగభారతచరిత్ర పట్ల భయంకరమైన మతతత్వ దృక్పథాన్ని కల్గిఉన్నాయి. ఏడవ వాల్యూమ్‌లో మొఘలాయీలకు వ్యతిరేకంగా పోరాడిన 'హిందూ' రాజులనూ, ముస్లిం రాజులనూ వేర్వేరుగా వ్యాఖ్యానించడం జరిగింది. ముస్లింరాజుల పోరాటాలను 'అధికారం' కోసం చేసివిగా వర్ణించగా, 'హిందూ' రాజుల పోరాటాలు 'హిందూ ధర్మ రక్షణ' నిమిత్తం జరిగినవిగా చిత్రీకరించడం జరిగింది.[15]

1990 దశకం ప్రారంభంనుండీ ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాల్లో అధికారంలోకొచ్చిన భారతీయ జనతా పార్టీ చరిత్ర పాఠ్యాంశాల్లో మతతత్వాన్ని చొప్పించింది. భారతీయ సంస్కృతికి తలమానికమైనది ఆర్య సంస్కృతేననీ, ఆర్యులే నికరమైన స్వదేశీయులనీ, దాదాపు 2200 సంవత్సరాల క్రితమే భారతదేశపు వ్యాపారం ప్రపంచం నాలుగు చెరుగులా వ్యాపించిందనీ, ఒకచేత కత్తీ, మరోచేత ఖురాన్‌ను పట్టుకొని భారతదేశంలో ప్రవేశించిన ముస్లింలు హిందువులను బలవంతంగా ముస్లింలుగా మార్చివేశారనీ, సముద్రగుప్తుడు కుతుబ్‌మీనార్‌ను నిర్మించాడనీ, దానిని విష్ణు స్తంభం అంటారనీ ఇలా అనేక రకాలైన అవాస్తవాలను చరిత్రగా చెప్పింది. పై మూడు రాష్ట్రాల్లోనే సంఘపరివార్ ఆధ్వర్యంలో ఇరవైవేలకు పైగా సరస్వతీ శిశుమందిర్‌లూ, సరస్వతీ విద్యాలయాలను ప్రైవేట్ రంగంలో నెలకొల్పారు. వీటన్నింటిలో చరిత్రపేరుతో చేసే బోధన హిందూమతోన్మాదాన్ని రంగరించిపోసేదిగా / ప్రోదిచేసేదిగా ఉంది.[16] హిందూత్వ భావజాలానికి అనుగుణంగా సాంఘికశాస్త్ర పరిశోధనలను, ముఖ్యంగా చారిత్రక పరిశోధనలను, ప్రభావితం చేసేందుకై ఐసిఎచ్ఆర్, ఐసిఎస్ఎస్ఆర్, ఎన్‌సిఈఆర్‌టి, ఐఐఎఎస్ వంటి జాతీయ సాంఘిక శాస్త్ర పరిశోధనా సంస్థలను సంఘ పరివార్ శక్తులతో నింపివేసింది. హిందూత్వ అజెండాకు తీవ్ర ప్రతిబంధకంగా ఉన్న కారణంగా ప్రఖ్యాత చరిత్రాకులైన కె.ఎన్.పణిక్కర్, సుమిత్ సర్కార్‌ల సంపాదకత్వంలో వెలువడాల్సి ఉండిన 'టువార్డ్స్ ఫ్రీడమ్' ప్రాజెక్ట్ సంపుటాలు ముద్రణకు నోచుకోకుండా అడ్డుకుంది. మానవ వనరుల శాఖామంత్రి అయిన మురళిమనోహర్ జోషీ “చరిత్రను వక్రీకరించింది మార్క్సిస్టు మేధావులే”ననీ, వారు చరిత్రను “బానిస స్థాయికి దిగజార్చారు”నీ మార్క్సిస్టు చరిత్రకారులను విచక్షణారహితంగా తూలనాడారు. జోషి శిష్యరత్నమూ, ఎన్‌సిఇఆర్‌టి మాజీ డైరెక్టరూ అయిన జె.ఎస్. రాజ్‌పుత్ వామపక్ష చరిత్రకారులను ఆడిపోసుకోవడంలో ఒక వంద ఆకులు ఎక్కువే నమిలాడు. వామపక్షమేధావులు తమ 'సంకుచిత రాజకీయ అజెండా' ను సాధించుకోవడానికి 'జాతిని అస్థిరపరిచే పాపకార్యానికి ఒడిగడుతున్నార'ని ఆరోపించడం మొదలుపెట్టాడు. ఈ మొత్తం సాంస్కృతికోగ్రవాద వ్యవహారంతో ప్రేరణపొందిన కొంతమంది ఆర్యసామాజికులు జోషీని కల్సి లౌకిక వాద చరిత్రకారులైన రొమిలా థాపర్, ఆర్.ఎస్. శర్మ, అర్జున్‌దేవ్‌లను అరెస్ట్ చేయాలని డిమాండ్ చేసేంతవరకూ వెళ్లారు.[17] తమ హిందూత్వ అజెండా సాధనా ప్రయాణంలో భాగంగా దాదాపు డెబ్బై సంవత్సరాలుగా చరిత్రరంగంలో కృషిచేస్తున్న అఖిల భారత చరిత్ర కాంగ్రెస్ (ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్) ను స్వాధీనం చేసుకోవడానికి సహస్రవిధాలా ప్రయత్నించి దారుణంగా విఫలమైన సంఘ పరివార్ శక్తులు దీనికి పోటీగా 'భారతీయ ఇతిహాస సంకలన సమితి' అనే సంస్థనేర్పరచాయి. దేశం మొత్తం మీద నాలుగువందలకు పైగా శాఖలను కలిగిన దీని దుష్టకార్యక్రమాల్లో వక్రీకృత చరిత్రలను జిల్లాలవారిగా ప్రచురించడం ఒకటి.[18]

ఈ కాషాయీకరణ క్రమంలోనే 2002 సెప్టెంబర్-నవంబర్ మధ్య పూర్తిగానో, పాక్షికంగానో చరిత్రకు సంబంధించిన నాలుగు పుస్తకాలను ఎన్‌సిఇఆర్‌టి ప్రచురించింది. ఆర్.ఎస్.ఎస్.తో సంబంధం కల్గిన మఖన్‌లాల్ వంటివారితో రాయించిన ఈ పుస్తకాల్లో, పాఠ్య పుస్తకాల్లో ఉండకూడని అన్ని రకాల తప్పులూ ఉన్నాయి. ఈ పుస్తకాలు చారిత్రకవాస్తవాలను తప్పుగా ఇవ్వడంలోనే కాకుండా భావవ్యక్తీకరణలో సైతం ఎంతో లోపభూయిష్టంగా ఉన్నాయి. అంతాకన్నా ముఖ్యంగా వీటిలోని చాలావిషయాలు సంఘపరివార్ మతోద్రేక భావజాలాని కనుగుణంగానూ, ఇంకా చెప్పాలంటే సంఘ్ ప్రచారాస్త్రాల్లా నూ

ఉన్నాయి. భారతదేశం ఆర్యుల జన్మస్థలమని చెప్పడమూ, భారతీయ నాగరికత మూలాలు వేదనాగరికతలోనే ఉన్నాయనడమూ, సింధూనాగరికతను సింధూ–సరస్వతి నాగరికతనగా పిలవడమూ, హిందూమతం మిగిలిన మతాలకన్నా ఉత్కృష్టమైనదనడమూ, సతీ, జౌహార్ లాంటి దురాచారాలపట్ల ఆరాధనాభావాన్ని వ్యక్తం చేయడమూ, భారతదేశం నాగరికతను ప్రపంచదేశాలకు నేర్పిందనీ, విదేశాల నుండి తానేమీ నేర్చుకోలేదని చెప్పడమూ, అణచివేత, దేవాలయాల విధ్వంసం తప్ప భారతదేశానికి ముస్లింలు మరేవిధమైన సేవా చేయలేదనడమూ, భారతదేశ ఉమ్మడి సంస్కృతిని దురుద్దేశ్యపూర్వకంగా విస్మరించడమూ, కబీరు లాంటి వాళ్ల గూర్చి ఒకే ఒక్క వాక్యంలో మాత్రమే చెప్పడమూ, గురుగోవింద్‌సింగ్‌ను చండిదేవత భక్తునిగా చూపడమూ, ఆధునిక భారతదేశ చరిత్రలో ముస్లిం వేర్పాటువాదాన్ని భూతద్దంలో చూపించి, హిందూమతతత్వం గూర్చి కనీసం ప్రస్తావించకపోవడమూ, భారత జాతీయోద్యమ సమయంలో లౌకిక, ప్రజాస్వామ్య విలువలను ప్రతిబింబించిన నాయకులను తూలనాడ్డమూ, హిందూసాంస్కృతిక జాతీయవాద పెరుగుదలకు వారిని అడ్డంకిగా పేర్కోవడమూ, జవరహర్ లాల్ నెహ్రూను, అంతకన్నా ముఖ్యంగా కమ్యూనిస్టులనూ అత్యంత నీచంగా చిత్రీకరించడమూ లాంటివి వీరు చేసిన హిందూత్వానుకూల వక్రీకరణల్లో కొన్ని మాత్రమే. ఈ పాఠ్యపుస్తకాల్లోని అనేక లోపాలను, ప్రఖ్యాత చరిత్రకారులైన ఇర్ఫాన్ హబీబ్, సువీరా జైస్వాల్, ఆదిత్య ముఖర్జీలు వెలికితీసి, కూలంకషంగా చర్చించి, వీటి వెనుక ఉన్న హిందూత్వ అజెండాను విశదం చేశారు.[19]

ప్రభుత్వ పాఠ్యపుస్తకాల ద్వారా వక్రీకృత చరిత్రను పిల్లల మెదళ్లలోకి ఇన్జెక్ట్ చేయడం ఒకవైపు దారుణంగా జరుగుతోండగా, ఇంకోవైపు అనేక ప్రైవేట్ ప్రచురణలద్వారా సంఘపరివార్ శక్తులు తప్పుడు చరిత్రను ప్రచారం చేస్తోన్నాయి. కరుడుగట్టిన హిందూత్వవాదులు రచించిన వక్రీకృత చరిత్రను వివిధ భారతీయ భాషల్లోకి అనువదించడం, ఆయా పుస్తకాల ధరలను తక్కువగా ఉంచడం ద్వారా మతతత్వ భావాలను ప్రచారం చేయడం ముమ్మరంగా సాగుతోంది.

మతతత్వ దృక్పథంతో చరిత్ర రచన లేదా క్రోడీకరణ ద్వారా సమాజంలో విద్వేష విషాన్ని పిచికారీ చేసే ప్రయత్నాలు ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లో కూడా ముమ్మరమయ్యాయి. అలాంటి చరిత్రకారుల్లో(?) కొమర్రాజువారి 'హిందూ మహాయుగము' లో 'ఒక అదృష్టం' శీర్షికన పిచ్చిరాతలు రాసిన ఎం.వి.ఆర్. శాస్త్రి ఒకరు. "వెయ్యేళ్ల విదేశీ దాష్టీకం నుంచి జాతి బయటపడ్డా బానిస మనస్తత్వం మేధావులను వీడలేదు" అనీ, "విదేశీయుల కళ్లతో దేశ చరిత్రను తిలకించి, పగవారి రాతలను కూతలనూ పరమప్రమాణంగా పరిగణించి, నికృష్టపు వాదాలతో జాతి ఉత్కృష్టతను ఈసడించే పెడధోరణిని సోకాల్డ్ మేధావి వర్గం వీడలే"దనీ ఇంకా ఇలా అనేక అవాకులు చెవాకులు పేలిన శాస్త్రిగారు 'రచించిన'(?) చరిత్రలను, సందర్భం వచ్చింది కాబట్టి, ఒకసారి క్లుప్తంగా పరిశీలిద్దాం. 'ఆంధ్రభూమి' దినపత్రిక సంపాదకులైన శాస్త్రిగారు 2003లో *ఏది చరిత్ర?* (అజో–కం–విభొ ఫౌండేషన్, హైదరాబాద్) నూ, 2005లో *ఇదీ చరిత్ర* (దుర్గా పబ్లికేషన్స్, హైదరాబాద్) నూ వెలువరించారు. *ఏదీ చరిత్ర?* లో కొట్టొచ్చినట్టు కనిపించే విషయాల్లో ఒకటి శాస్త్రిగారు సర్ ఎచ్.ఎమ్. ఇలియట్, జాన్ డౌసన్ ల *ది హిస్టరీ ఆఫ్ ఇండియా యాజ్ టోల్డ్ బై ఇట్స్ ఓన్ హిస్టారియన్స్*' నుండి విస్తృతంగా ఉల్లేఖించడం. "తెల్లవాడు కట్టిన మాసికగంతల" తోనే, "విదేశీయుల కళ్లతో"నే "కొద్ది బుద్ధులు" అయిన "కుహనా మేధావులు" ఇంకా దేశచరిత్రను ఆలకిస్తున్నారని పిచ్చి పిచ్చిగా ఆగ్రహిస్తున్న శాస్త్రిగారు "విదేశీయులు", "పాశ్చాత్యులు", "పగవారు" అయిన ఇలియట్ అండ్ డౌసన్ ల చరిత్రలను ఎందుకంత తమకంతో ఆలింగనం చేసుకుంటున్నారు? ఏ ప్రయోజనాలనాశించి వారి వాల్యూమ్స్ నుండి అడుగడుగునా ఉల్లేఖించినట్లు? దీన్నికొంచెం వివరంగా పరిశీలిస్తే శాస్త్రిగారి విశ్వరూపం సాక్షాత్కరిస్తుంది. ◆

(ముగింపు వచ్చే సంచికలో)

**అంత్యసూచికలు**

12. అక్కిరాజు రమాపతిరావు (సంకలనం), *నేటి భారతదేశ చరిత్ర : ప్రముఖ చరిత్ర విద్వాంసుల విశ్లేషణ, సుపథ ప్రచురణలు, హైదరాబాద్. జూలై 2004,* పు.vi

13. వి. రామకృష్ణ, 'కాషాయీకరణ (చరిత్ర, విద్య, సాంస్కృతిక రంగాలు)', *అరుణతార,* జూలై – సెప్టెంబర్ 2002, పు. 8. ఈ విషయాన్ని గూర్చి విపులమైన చర్చకై చూడండి బాలగోపాల్, *చరిత్ర పాఠాలపై కాషాయం నీడ,* పి.డి.ఎస్.యు. *ప్రచురణ, హైదరాబాద్, డిసెంబర్ 1999,* హనుమంతరెడ్డి, *అబద్ధాలే ఆయుధాలుగా విద్యారంగం మీద మతవాదం దాడి,* పి.డి.ఎస్.యు ప్రచురణ, హైదరాబాద్, డిసెంబర్ 1999.

14. వి. రామకృష్ణ, 'కాషాయీకరణ', పై.ఉ. పు. 7. ఇంకా చూడండి భూపేంద్ర యాదవ్, 'హిస్టరీ ఆఫ్ ది అన్‌డూయింగ్ ఆఫ్ హిస్టరీ', *ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ* జనవరి 19, 2002, పు. 192

15. భూపేంద్ర యాదవ్, 'హిస్టరీ ఆఫ్ ది అన్‌డూయింగ్ హిస్టరీ' పు. 192

16. వి. రామకృష్ణ, 'కాషాయికరణ', పు. 7–8

17. భూపేంద్ర యాదవ్, పై.ఉ.

18. వి. రామకృష్ణ, 'కాషాయీకరణ' పు. 8

19. ఎన్‌సిఇఆర్‌టి చరిత్ర పాఠ్యాంశాల్లోని వివిధలోపాలను సమగ్రంగా తెలుసుకునేందుకై చూడండి : ఇర్ఫాన్ హబీబ్, సువీరా జైస్వాల్, ఎట్. ఆల్. హిస్టరీ ఇన్ ది న్యూ ఎన్‌సిఇఆర్‌టి టెక్స్ట్ బుక్స్ – ఎ రిపోర్ట్ అండ్ యాన్ ఇండెక్స్ ఆఫ్ ఎర్రర్స్ ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్, కోల్‌కత, 2003. సంఘపరివార్ శక్తులు పాఠ్యపుస్తకాలపై తమదాడిని సమర్థించుకనేందుకే ఎన్ని రకాలుగా బొంకుతున్నారో తెలుసుకోవడానికే చూడండి : 'హిస్టరీస్ న్యూ రెలెవెన్స్' ఇన్ జె.ఎస్. రాజ్‌పుత్, డైమెన్షన్స్ ఆఫ్ కర్రిక్యులమ్ చేంజ్, ఎన్‌సిఇఆర్‌టి, న్యూఢిల్లీ,2002, పు. 163–168

**వచ్చే సంచికలో...**
- ❖ **ఫోకస్ - ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య - పరిష్కారాలు**
- ❖ **అరవై ఏళ్ల స్వాతంత్ర్యంపై కె.జి. కన్నబిరాన్, వరవరరావు తదితరులు**
- ❖ **తెలంగాణా సాగునీటి సమస్యలు - సూక్ష్మ సేద్యం - యం. కోదండరాం, కె. సీతారాంరావు**
- ❖ **సమ్మిళిత అభివృద్ధి అంటే ఏమిటి? - వి. చలపతిరావు**

శాసనమండలి చరిత్రను, ఎన్నిక విధానాన్ని వివరించి ప్రస్తుత శాసనమండలి ముందున్న కర్తవ్యాలను సూచిస్తున్నారు **పి. శ్రీనివాసరావు, పుల్లా శ్రీనివాస్, భూక్యా శ్రీనివాస్**

# శాసనమండలి - ఒక పరిశీలన

1956 డిసెంబర్ 4న రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి శాసనమండలి ఏర్పాటు కోసం తీర్మానాన్ని ప్రవేశపెడుతూ 'ఈ తీర్మానాన్ని బలపరుస్తూ నేను ప్రత్యేకంగా ఉపన్యాసం చేయవలసిన అవసరం లేదనుకొంటాను. ఈ తీర్మానం గుణగుణాలను, ఆవశ్యకతను ఇప్పుడు చర్చించవలసిన అవసరంలేదు. ఎగువసభ ఉండటం అవసరమా, కాదా అనే సమస్యను దేశం మొత్తం మీద ఆలోచించి అన్ని రాష్ట్రాలకు వర్తించే విధంగా ఒక నిర్ణయానికి వచ్చే వరకు మన రాష్ట్రంలో కూడ ఒక ఎగువ శాసనసభ అవసరం అనే కారణం వల్ల ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నాను. చాలా కాలంగా మద్రాస్, బొంబాయి రాష్ట్రాలలో ఎగువసభ ఉన్నప్పటికీ ఆంధ్ర రాష్ట్రంలో, వెనుకటి హైదరాబాద్ రాష్ట్రంలో లేదు. హైదరాబాద్ అసెంబ్లీలో పి.డి.ఎఫ్., ఆంధ్రరాష్ట్ర శాసనసభలో కమ్యూనిస్టులు ఈ తీర్మానాన్ని వ్యతిరేకించారు. ఇప్పుడు ఈ రెండు రాష్ట్రాలు కలిసి ఒక పెద్ద రాష్ట్రంగా ఏర్పడింది కాబట్టి, ఎగువసభ అవసరమని భావిస్తున్నాను. ఆయా సమస్యలపైన ఎంతో విజ్ఞానాన్ని సంపాదించిన పెద్దలు చాలా మంది రాజకీయాల్లో ప్రవేశానికి, ఎన్నికల్లో పోటీ చేయడానికి ఇష్టపడరు. ఇలాంటి వారికి ప్రతినిధులుగా ఈ రెండవసభ సలహాలు మాత్రమే ఇస్తుంది. అనుభవజ్ఞుల సలహాలు ఎంతవరకు మేలు చేస్తాయో తెలియదు కాని, చెరుపు మాత్రం ఉండదు... అధికమైన అధికారాలు లేకపోయినా ఎగువసభ ఉండటం మంచిదని భావించి అందుకు పూనుకొన్నాం" అన్నారు.

1985లో శాసనమండలి అనవసరమంటూ అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు రద్దు చేయటం జరిగింది. ఇరవై ఒక్క సంవత్సరాల తర్వాత రాష్ట్రంలో శాసనమండలి మళ్లీ ఏర్పాటైంది. 1985లో రద్దయినప్పుడు ఏ రూపంలో ఉందో అదే రూపంలో ఎలాంటి మార్పు చేర్పు లేకుండా ఇప్పుడు మళ్లీ ఏర్పాటయిందనేది జగద్విదితం. ఈ రెండు దశాబ్దాలలో ప్రపంచంలో, ఆంధ్రప్రదేశ్‌లో వచ్చిన పరిణామాలు కొత్త కౌన్సిల్ మీద ఎలాంటి ప్రభావం చూపలేకపోయాయి. జనాభా విపరీతంగా పెరిగింది. సాంకేతిక విప్లవాలొచ్చాయి, అక్షరాస్యత విస్తరించింది. ఇవన్నీ తీసుకువచ్చిన ఆర్థిక పరిణామాలు ఆంధ్రప్రదేశ్‌ను పూర్తిగా మార్చేశాయి. కొత్తగా కౌన్సిల్‌ను ఏర్పాటు చేస్తున్నప్పుడు వీటిని పరిగణనలోకి తీసుకోవాలని రాష్ట్ర ప్రభుత్వం భావించకపోవడం విచిత్రం.

### ఏ కోటాలో ఎంతమంది?

శాసనమండలి శాశ్వతసభ. ఈ సభలో సభ్యులుగా మేధావులు, వివిధ రంగాల అనుభవజ్ఞులుండడంవల్ల పెద్దల సభ అని గౌరవించేవారు. విధాన సభలో 295 మంది సభ్యులు ఉంటారు. రాజ్యాంగ నిబంధన ప్రకారం వీరి సంఖ్యలో మూడవ వంతు మేరకు విధాన పరిషత్ (శాసనమండలి) సభ్యులుండాలి. ఈ మేరకు 90 మంది సభ్యులను ఎన్నుకోవలసి ఉంటుంది. ఈ సభ్యులలో మూడవ వంతు విధాన (శాసన) సభ సభ్యులు ఎన్నుకుంటారు. మూడవ వంతు స్థానిక సంస్థలు ఎన్నుకొంటాయి. 12వ వంతు – 8 మంది సభ్యులను పట్టభద్రులు, 12వ వంతు – 8 మంది సభ్యులను ఉపాధ్యాయులు ఎన్నుకొంటారు. ఆరవ వంతు – 12 మంది సభ్యులను మంత్రిమండలి సిఫార్సు మేరకు గవర్నర్ నామినేట్ చేస్తారు. ఈ కోటాలో మేధావులను, కళాకారులను నియమిస్తారు. శాసనమండలి సభ్యులకు 30 సంవత్సరాలు నిండి ఉండాలి. మండలి సభ్యులకు కూడా శాసనసభ్యుల తరహాలోనే ప్రతి నెలా వేతనాలు, భత్యాలుగా రు.50 వేల వరకు లభిస్తాయి.

### ఎన్నిక విధానం

ఎన్నికల్లో నలుగురు నిలబడితే ఎవరికి ఎక్కువ ఓట్లు వస్తే వారు విజేతగా నిలవడం సాధారణ ఎన్నికల్లో అత్యంత సహజమైన విషయం. మొత్తం ఓట్లలో 25 శాతం ఓట్లు వచ్చినా విజేతగా నిలిచిన అభ్యర్థులు ఉన్నారు. కాని శాసనమండలిలో అలా కుదరదు. పోటీలో ఉన్న అభ్యర్థుల్లో అందరికంటే ఎక్కువ ఓట్లు రావడం మాత్రమే ముఖ్యం కాదు. ఇందుకోసం కోటా ఓట్లు పూర్తి చేసుకోవాలి. ముఖ్యంగా స్థానిక సంస్థలు, పట్టభద్రులు, ఉపాధ్యాయ నియోజకవర్గాల నుంచి పోటీ చేస్తున్న అభ్యర్థుల కోటా నిర్ణయం ప్రకారం చెల్లిన ఓట్లలో కనీసం 51 శాతం ఓట్లను సంపాదించాలి. ఓట్ల లెక్కింపు కూడా సాధారణ ఎన్నికల మాదిరిగా ఒకేసారి పూర్తికాదు. ఓటు బదలాయింపు పద్ధతులతో పాటు గణిత సమీకరణాన్ని కూడా జోడించి విజేతను ప్రకటించాలి. అందుకే ఈ ఎన్నికల్లో ఓట్లు వేయడానికి ఎంత విజ్ఞత ప్రదర్శించాలో ఓట్లు లెక్కించడానికి అంతే మెళకువ అవసరం. ఫలితాల సరళిని అధ్యయనం చేయడం కూడా మామూలు విషయమేమీ కాదు. ముఖ్యంగా శాసనమండలి ఓట్ల లెక్కింపులో 'కోటా'కు అత్యంత ప్రాధాన్యత ఉంది. కోటాను నిర్ణయించేందుకు ఈ కింది గణిత సమీకరణాన్ని ఉపయోగించాల్సి ఉంటుంది. కోటా = చెల్లిన ఓట్ల మొత్తం విలువ / ఎన్నుకోవాల్సిన అభ్యర్థుల సంఖ్య + 1.

### సభ్యుల కాలపరిమితి నిర్ణయం

ఎన్నిక కావడం తోటే శాసనమండలి సభ్యులకు గండం

గడిచినట్లుకాదు. ఎన్నికైన సభ్యులలో ప్రతికోటా నుంచి మూడవ వంతు సభ్యులకు రెండేళ్లు, మరో మూడవ వంతు సభ్యులకు నాలుగేళ్లు, మిగతా మూడవ వంతు వారికి ఆరేళ్ల పదవీ కాలం లభిస్తుంది. అయితే వీరందరిలో ఎవరు ఎన్నేళ్లు అధికారంలో ఉండాలనేది నిర్ణయించేది లాటరీ పద్ధతి. ఒక బాక్సులో సభ్యుల పేర్ల రాసిపెట్టి మరో బాక్సులో పదవీకాలం ఎంతో రాసి చిట్లు పెడతారు. రెండు బాక్సుల నుంచి రెండు చిట్లు తీస్తారు. ఒకటి పేరు – మరొకటి కాలపరిమితి ఎవరికి ఏ చిట్ వస్తే వారు అంతకాలం పదవిలో కొనసాగటం జరుగుతుంది.

## అనుమానాలకు ఆస్కారం

ఒక వ్యవస్థ బలహీనంగా ఉంటే అనుమానాలకు, అపోహలకు తావిస్తుందనేది యథార్థం. ఇప్పుడు కొత్తగా ఏర్పడిన రాష్ట్ర శాసనమండలి పుట్టుకతోనే రకరకాల బలహీనతలను తెచ్చుకొన్నది. కాలంతోపాటు రావలసిన మార్పులను విస్మరిస్తే ఏ సంస్థ అయినా ప్రశ్నార్థకమవుతుంది. టీచర్ల నియోజకవర్గాలు చాల ఎక్కువగా ఉన్నాయి. టీచర్లంతా ఒకటికాదు. అందువల్ల టీచర్ నియోజకవర్గాలను ఇటు పాఠశాల టీచర్ల నుంచి అటు ప్రొఫెసర్ల వరకు కేటాయించి ఉంటే బాగుండేది. ఆంధ్రప్రదేశ్‌కు ఎంతో ప్రతిష్ఠ తెచ్చి పెట్టిన సారా వ్యతిరేక ఉద్యమం, పొదుపు మహిళా సంఘాలలో గ్రామీణ మహిళలు ఉన్నారు. వీరికి ఒకటిరెండు నియోజకవర్గాలు కేటాయించి ఉంటే శాసనమండలి సంస్కరణలలో ఆదర్శవంతంగా ఉండేది. సాఫ్ట్‌వేర్ రంగం ఈ రోజు రాష్ట్ర ఆర్థిక రంగాన్ని శాసించే రంగాలలో ఒకటి. ఇప్పుడు కనీసం 20 లక్షల మంది ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఈ రంగం మీద ఆధారపడి ఉన్నారు. ఈ రంగ నిపుణులకు శాసనమండలిలో చోటు కల్పించడం విప్లవాత్మక చర్య అయి ఉండేది. అదే విధంగా ఆర్థికరంగం ప్రాముఖ్యాన్ని విస్మరించారు. సహకార బ్యాంకులు, సహకార సంఘాలు, చార్టర్డ్ అకౌంటెంట్లు, ఇతర ఆర్థిక వ్యవహారాల సంస్థలు ఇప్పటి ఆర్థిక రంగంలో కీలక పాత్ర వహిస్తున్నాయి. రాష్ట్రంలోని వైద్య, విద్య, ఔషధ రంగానికి, వ్యవసాయం, చేనేత, తదితర వృత్తులకు ప్రాతినిధ్యం కల్పించవలసిఉంది.

## వికలాంగులను విస్మరించిన పార్టీలు

రాజకీయ అధికారం మాస్టర్ కీ అని అంబేద్కర్ చెప్పారు. రాజకీయ అధికారం ఎవరి చేతుల్లో ఉంటుందో వారే అన్ని రంగాల్లో అభివృద్ధి సాధించే అవకాశం ఉంటుంది. ఇది అందరికి తెలిసిన నగ్న సత్యమే. మన దేశంలో ప్రజాస్వామ్యం కులస్వామ్యంగా వర్ధిల్లుతున్న స్థితిలో రాజకీయ రంగంలో ప్రవేశానికి నోచుకోని అణగారిన వికలాంగులు చట్టసభల్లో ప్రవేశించటమనేది ప్రస్తుతం అత్యంత కీలకమైన ప్రశ్నగా మిగిలిపోయింది. సకలాంగులతో పోటీ పడి ప్రత్యక్ష ఎన్నికల ద్వారా చట్టసభల్లో ప్రవేశించటం అసాధ్యమని తేలిపోయింది. ఈ క్రమంలో వికలాంగులకు ఒక ఆశాకిరణంగా 21 సంవత్సరాల తర్వాత ఏర్పడిన విధాన మండలిలోనైనా అవకాశం కల్పించివుంటే జనాభాలో పది శాతం ఉన్న వికలాంగులకు సామాజిక, రాజకీయ న్యాయం చేసిన వారై ఉండేవారు. రాజకీయ ప్రక్రియలో ప్రజలందరికి భాగస్వామ్యం కల్పించాలనేది ప్రజాస్వామ్య మౌలిక సూత్రమని తెలిసిన అధికార పార్టీ కాంగ్రెస్ గాని ఇతర పార్టీలైన తెలుగుదేశం, సిపిఎం, సిపిఐ, టిఆర్ఎస్‌లు గాని విస్మరించటం విచారకరం.

రాజ్యసభ, శాసనమండలి అభ్యర్థులను ఎంపిక చేసే సమయంలో రాజకీయ పార్టీలన్నీ కొంత విజ్ఞత ప్రదర్శించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఎగువసభలకు యోగ్యులను నామినేట్ చేయడం వల్ల సభ ప్రతిష్ఠ, పార్టీ ప్రతిష్ఠ పెరుగుతాయనేది వాస్తవం. శాసన నిర్మాణాన్ని సుసంపన్నం చేసే మేధో వర్గాలు రాజకీయాల వెలుపల చాలా ఉన్నాయి. వారికి ప్రాతినిధ్యం కల్పించడానికే గవర్నర్ నామినేట్ చేసే పద్ధతి. కాని అలా జరిగినట్టు మచ్చుకైనా కనిపించిన దాఖలాలు లేవు.

ప్రస్తుతం శాసనమండలి ఏర్పడే సమయానికి పట్టభద్రులకు, ఉపాధ్యాయులకు ఈ కింది తక్షణ సమస్యలున్నాయి.

## పట్టభద్రుల సమస్యలు – డిమాండ్లు

పట్టభద్రులందరికీ నిరుద్యోగ భృతి చెల్లించాలి. ప్రభుత్వ ఉద్యోగాలలో తగినంత ప్రాధాన్యత ఇవ్వాలి. సొంతకాళ్లపై బతికేందుకు వివిధ వృత్తులలో శిక్షణ ఇవ్వాలి. ప్రభుత్వ పథకాలలో తగిన రిజర్వేషన్ కల్పించాలి. పట్టభద్రుల సంక్షేమానికి మండలి అభ్యర్థులు పెద్ద పీటవేయాలి. స్వయంఉపాధి పథకాలను తగిన షూరిటీ లేకుండా వర్తింపజేయాలి. ప్రతి గ్రామంలో నిరుద్యోగం కమిటీ ఏర్పాటు చేసి ఉపాధి అవకాశం మెరుగుపర్చాలి. కాంట్రాక్ట్ ఉద్యోగాలలో పట్టభద్రులకు తగినంత గుర్తింపు ఇవ్వాలి.

## ఉపాధ్యాయుల సమస్యలు

ఏకీకృత సర్వీస్ నిబంధనలు పునరుద్ధరించాలి. డిఎస్సీ – 2006 టీచర్లకు పోస్టింగ్, మరల నోటిఫికేషన్ ఇవ్వాలి. 1998 డిఎస్సీ సెలక్టెడ్, క్వాలిఫైడ్‌లకు వెంటనే పోస్టింగ్‌లు ఇవ్వాలి. అప్రెంటిస్ టీచర్లకు రెండు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలి. డిఎస్సీ 2002–2000 టీచర్లకు పాత పెన్షన్ విధానం వర్తింపజేయాలి. అంతర్ జిల్లా బదిలీలు చేపట్టాలి. 6–15 వరకు సిఎల్‌లను పెంచాలి. కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన వెంటనే రాష్ట్ర ప్రభుత్వం ఉద్యోగులకు డిఎ పెంచాలి.

## స్థానిక సంస్థల సమస్యలు

రాజ్యాంగం సూచించిన 29 అంశాలను, నిజమైన అధికారాలు, విధులు, సిబ్బందితో అధికారాలు బదలాయించాలి. 29 అంశాలకు సంబంధించిన అన్ని ప్రభుత్వ శాఖలను జిల్లా పరిషత్ అధీనంలోకి తీసుకురావాలి. జిల్లా ప్రణాళిక కమిటీ ఏర్పాటు చేసినందున ఈ ప్రణాళిక కమిటీలు రూపొందించే జిల్లా ప్రణాళిక గ్రామ, మండల, పట్టణ ప్రణాళికలు కార్యరూపం ధరించడానికి వీలుగా రాష్ట్ర ప్రభుత్వం కేటాయించాలి. రాష్ట్ర వార్షిక బడ్జెట్‌లో జిల్లా వారీగా బడ్జెట్‌ను వేరుగా చూపించి నిధులను అందించాలి. జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థను వేరుగా నిర్వహించడానికి బదులుగా జిల్లా పరిషత్‌లోనే విలీనం చేయాలి. కేంద్ర ఆర్థిక కమిషన్ సిఫారసులను యూనియన్ ప్రభుత్వం యథాతథంగా ఆమోదిస్తున్న సంప్రదాయాన్నే రాష్ట్ర ప్రభుత్వం పాటించాలి. గ్రామ, మండల, పట్టణ స్థాయిలలో అభివృద్ధి ప్రణాళికల రూపకల్పనకు నిర్దిష్టమైన మార్గదర్శకాలు, సాంకేతిక నిపుణుల తోడ్పాటు, స్వచ్ఛంద సంస్థల సహకారానికి వీలుకల్పిస్తూ ఒక కార్యాచరణ ప్రణాళికను రూపొందించి అన్ని స్థాయిలలో అవసరాలకు తగిన ప్రణాళికలు రూపొందించడానికి తగు చర్యలు తీసుకోవాలి. ◆

## తెల్గీ ఒక్కడేనా దోషి?

సుమారు 33 వేల కోట్ల రూపాయల స్టాంప్‌పేపర్ కుంభకోణానికి బాధ్యులలో ఒకడైన అబ్దుల్ కరీం తెల్గీకి జైలు శిక్ష పడింది. పశ్చాత్తాపం, నేర అంగీకారం, అనారోగ్యం (ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుడు) కారణాలతో శిక్ష కొంతమేరకు తగ్గింది. వందకోట్ల జరిమానాకు సమానంగా మూడేళ్ల మూడు నెలల అదనపు జైలు శిక్షను న్యాయస్థానం లెక్కకట్టింది. మొత్తంగా 13 ఏళ్ల జైలు శిక్ష పడింది. అధికారగణం, మాఫియా మధ్య పొత్తు ఎంత బలంగా వేళ్లూనుకుందో నకిలీస్టాంప్‌ల కుంభకోణం కళ్లకుకట్టినట్లు చెబుతోంది. తెల్గీకి దేశవ్యాప్తంగా 155 కార్యాలయాలు ఉన్నాయని దర్యాప్తు సంస్థల ద్వారా తెలుస్తోంది. ఈ కుంభకోణంలో 17 రాష్ట్రాలకు చెందిన మంత్రులు, ఐ.ఏ.ఎస్‌లు, ఉన్నతాధికారుల ప్రమేయం, పాత్ర ఉన్నట్లు మీడియా ద్వారా తెలిసిందే. మహారాష్ట్ర ఉపముఖ్యమంత్రి ఛగన్ భుజ్‌బల్, కర్ణాటక మంత్రి రోషన్‌బేగ్, ఆంధ్రప్రదేశ్ మాజీమంత్రి కృష్ణయాదవ్ (తెలుగుదేశం) వంటి వారితో సహా, ముంబాయ్, చెన్నై, బెంగళూరులో అనేకమంది మాజీ పోలీస్, ఉన్నతాధికారుల పదవులు ఊడిపోయాయి.

పాత్రధారికి శిక్షపడినా, ప్రధాన సూత్రధారులు తప్పించుకోవడం గమనార్హం. అయినా ఏలికలు 'చట్టం తనపని తాను చేసుకు పోతుందని' ప్రజలని మళ్లీ మళ్లీ నమ్మమంటారు.

## విసిగి వేసారిన పూజలెందరో

భర్త, అత్తింటి వారి వరకట్న వేధింపులకు విసిగివేసారిన పూజ (22), పోలీసులకు ఎన్నిసార్లు ఫిర్యాదు చేసినా పట్టించుకోక పోవడంతో అర్థనగ్నంగా రాజ్‌కోట వీధుల్లో నడిచి తన నిరసన దేశానికి తెలిపింది. ఆమెకు రెండేళ్ల పాప ఉంది. పోలీసులు కనీసం ఎఫ్.ఐ.ఆర్. అయినా నమోదు చేయని కారణంగానూ, వారి నిర్లక్ష్యం కారణంగానూ తానీ చర్యకు పూనుకున్నట్లు పూజ పేర్కొన్నారు. ఇప్పుడింత గొడవజరిగాకే పోలీసులు ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేసి ఆమె భర్తను, అత్తను, మరో ఇద్దరు బంధువులను అరెస్ట్ చేశారు. పూజ దేశవ్యాప్తంగా ఉన్న ఎందరో మహిళల స్థితికి అద్దం పడుతుంది. తమ లోపాన్ని కప్పిపుచ్చుకోవడానికి పూజకు మతిస్థిమితం లేదని పోలీసులు ఆరోపిస్తున్నారు. అంతేకాదు రక్షణ కల్పించడానికిబదులు 'అసభ్యంగా' ప్రవర్తించిందన్న నెపంతో అరెస్ట్ చేయడం గమనార్హం.

## తాజ్‌మహల్ పేరిట వ్యాపారమెంత?

ప్రేమకు చిహ్నంగా పేర్కొనే తాజ్‌మహల్ మళ్లా మీడియా సంచలన మైంది. స్విట్జర్లాండ్‌కు చెందిన రచయిత, దర్శకుడు వెబర్ నెలకొల్పిన సంస్థ 'న్యూసెవెన్ వండర్స్ ఫౌండేషన్' ఆధ్వర్యంలో ఏడు వింతల ఎంపిక కార్యక్రమాన్ని లిస్బన్‌లో నిర్వహించారు. దీనివల్ల సామాన్యులకు జరిగిన మేలేమీ లేదు గానీ సెల్‌ఫోన్ కంపెనీలకు ఇబ్బడిముబ్బడిగా ఎస్.ఎం.ఎస్‌ల వలన కోట్లాది రూపాయల వ్యాపారం చేకూరింది.

## తొలి మహిళా రాష్ట్రపతి



దేశం అరవై ఏళ్ల స్వాతంత్ర్య సంబరాలు జరుపుకోబోయే తరుణంలో పన్నెండవ రాష్ట్రపతిగా ప్రతిభా పాటిల్ ఎన్నికయ్యారు. మహిళా రిజర్వేషన్ బిల్లుతో మొదలుకొని స్త్రీలకు సంబంధించి ఎన్నో చట్టాలు అమలుకావటం లేదు. దేశంలో స్త్రీలపై జరుగుతున్న వివిధరకాల అత్యాచారాలు, వరకట్న హత్యలు, భ్రూణహత్యలకు కొదవలేదు. రాష్ట్రపతి అంటే రబ్బరుస్టాంప్ కాదనీ, సొంత వ్యక్తిత్వంతో వ్యవహరిస్తారనీ నిరూపిస్తారా వేచి చూడాలి.

## ఓటు స్వేచ్ఛ!

ఓటు వెయ్యడం, వెయ్యకపోవడం అనేది ఈ దేశ పౌరులందరికీ రాజ్యాంగం కల్పించిన హక్కు. ఒక వ్యక్తి తన అభిప్రాయానికి నచ్చినట్లు తన ఓటు హక్కును వినియోగించుకోవడం, వినియోగించకపోవడం అనేది నిజమైన అర్థంలో అమలు జరిగినప్పుడు ప్రజాస్వామ్యం వికసిస్తుంది. రాష్ట్రపతి ఎన్నికల్లో యు.ఎన్.పి.ఎ. కూటమి ఎం.ఎల్.ఎ.లు, ఎం.పి.లు ఓటింగ్‌లో పాల్గొనలేదు. అదే స్వేచ్ఛ సామాన్యులకున్నప్పుడు మాత్రమే ప్రజాస్వామ్య వ్యవస్థ బలపడుతుంది. సగానికి పైగా ప్రజలు ఇప్పటికీ ఈ 'ప్రజాస్వామ్య' ప్రక్రియకు దూరంగా ఉంటున్నారనేది చేదు నిజం.

## హ్యారీ పోటర్

పుస్తకాలు లక్షలాది కాపీలు అమ్ముడవడం, కోట్ల రూపాయల వ్యాపారం జరగడం రచయిత్రికి మరింత పేరు డబ్బు సంపాదించి పెట్టడంలో హ్యారీ పోటర్ విశేషంగా విజయం సాధించింది. జె.కె.రౌలింగ్ రచించిన హ్యారీ పోటర్ చివరి భాగం (ఏడవ సంపుటి) ఇటీవలే లండన్‌లో విడుదలయింది. ఆలోచించాల్సినదే మిటంటే ఈ కాల్పనిక సాహిత్యం పాఠకుడికి కొత్త దృష్టిని ఏమన్నా ఇచ్చిందా, వ్యక్తిత్వాన్ని వికసింపజేయడానికి ఏమైనా దోహదపడిందా, ఆలోచనా స్థాయిని ఏమైనా పెంచిందా, కాలానికి నిలుస్తుందా అనేవే ప్రశ్నలు. మంచి సాహిత్యం ఒక స్థలకాలాల్లోని జీవితాన్ని ప్రతిబింబించ డమే కాక భవిష్యత్తుకు మార్గదర్శి అవుతుంది. ఆ రకంగా చూసినప్పుడు హ్యారీ పోటర్ స్థానం మనకు అర్థం అవుతుంది.

## మావోయిస్టుల ఆర్థిక దిగ్బంధం

మావోయిస్టులు ఇచ్చిన రెండు రోజుల (జూలై 25-26) దేశవ్యాప్త ఆర్థిక దిగ్బంధం పిలుపునకు మిశ్రమ స్పందన వచ్చింది. ప్రభుత్వ ఆర్థిక విధానాలను, ప్రత్యేక ఆర్థిక మండలులను (సెజ్‌లను) వ్యతిరేకిస్తూ ఈ దిగ్బంధానికి పిలుపునిచ్చారు. పలుచోట్ల ప్రభుత్వ ఆస్తులపై దాడులు చేశారు. బీహార్, జార్ఖండ్, ఛత్తీస్‌గడ్ రాష్ట్రాల్లో పలుచోట్ల సాధారణ జనజీవనం స్తంభించింది. ◆

## పాకిస్తాన్‌లో ప్రజాభిప్రాయం గెలుపు

పాకిస్తాన్‌లో దాదాపు నాలుగు నెలలుగా ముషర్రఫ్ ప్రభుత్వానికీ, ప్రధాన న్యాయమూర్తి ఇఫ్తికార్ చౌధురి, ఆయన అనుచరులకూ మధ్య జరుగుతున్న పోరాటం జూలై 20న, ఇఫ్తికార్ చౌధురికి అనుకూలంగా ఇచ్చిన తీర్పుతో ముగిసింది. పాకిస్తాన్‌లో ఈ మధ్యకాలంలో ఇంత తీవ్రమైన ప్రజానిరసనను లేవనెత్తిన సంఘటన మరొకటి లేదు. జస్టిస్ చౌధురికి వ్యతిరేకంగా పాకిస్తాన్ అధ్యక్షుడు ముషర్రఫ్ మార్చ్ 9 నుండి తీసుకుంటున్న నిర్ణయాలన్నింటిని సుప్రీంకోర్టు 10-3 మెజారిటీతో తోసిపుచ్చింది. పాకిస్తాన్ అరవై ఏళ్ల చరిత్రలో సుప్రీంకోర్టు ఒక మిలిటరీ నాయకుడి నిర్ణయాన్ని వ్యతిరేకించడం ఇదే మొదటిసారి. జస్టిస్ చౌధురికి జరుగుతున్న అన్యాయాన్ని వేలాదిమంది పాకిస్తానీ ప్రజలు ప్రతి ముఖ్యపట్టణంలోనూ ప్రతిఘటించారు. పోరాట బాట పట్టినవారిలో న్యాయవాదులు, ప్రతిపక్ష పార్టీలు, విద్యార్థులు, సాధారణ పౌరులు అందరూ ఉన్నారు. జస్టిస్ చౌధురి ఏ నగరానికి వెళ్లినా కొన్ని వేలమంది ప్రజలు ఆయనకి స్వాగతం పలికారు. ఈ తీవ్ర, సుదీర్ఘ ప్రజా నిరసన సుప్రీంకోర్టు తీర్పుపై ప్రభావం చూపిందనడంలో సందేహమేమీ లేదు.

## లాల్‌మసీదు పై దాడి

ఇస్లామాబాద్‌లోని లాల్‌మసీదు, దాని పక్కనే ఉన్న మదరసా జామియా హఫ్సాపై పాకిస్తాన్ భద్రతా బలగాలు పెద్ద ఎత్తున దాడి చేసి మసీదులో ఉన్నవారిలో దాదాపు 50 మందిని తీవ్రవాదులనే పేరుతో చంపేసారు. చనిపోయిన వారిలో మత నాయకుడు అబ్దుల్ రషీద్ ఘాజీ కూడా ఉన్నాడు. దాదాపు ఏడెనిమిది రోజులుగా లాల్ మసీదు లోపల స్థావరం ఏర్పరుచుకున్న మిలిటెంట్లకు, పాకిస్తాన్ సైన్యానికి మధ్య సాగిన పోరు చివరికి విషాదాంతం అయింది. జామియా హఫ్సాలో చదువుతున్న యువతులు కొన్ని నెలలుగా వాళ్లకి అసభ్యకరంగా తోచిన వృత్తులపై, మనుషులపై, ఆచార వ్యవహారాలపై, ప్రదేశాలపై దాడులు చేస్తూవచ్చారు. లాల్ మసీదు పక్కనే ఉన్న ఈ మదరసాపై అబ్దుల్ రషీద్ ఘాజీ ప్రభావం చాలా ఉండేది. అధికారిక లెక్కల ప్రకారమే మృతుల సంఖ్య యాభై దాటినా ఈ సంఘటన వెనుక కేవలం ముస్లిం తీవ్రవాదాన్నే చూస్తే అసలు కారణాలని అర్థం చేసుకోవడం, ఇలాంటి 'తీవ్రవాదాన్ని' పెంచి పోషిస్తున్న పరిస్థితులని సరిచేయడం సాధ్యపడదు. షరియాని, ఇస్లాం మతతత్వాన్ని సమర్థించిన ఘాజీ, పాకిస్తాన్ రాజకీయ, ఆర్థిక, సైనికరంగాలలో ఉన్న అవినీతిని, రోజురోజుకు పెరిగిపోతున్న ఆర్థిక అసమానతలని, అత్యధిక ప్రజలకు అందని సామాజికన్యాయాన్ని తీవ్రంగా విమర్శించే వాడు. ఈ సమస్యలన్నింటినీ పరిష్కరించకుండా పాకిస్తాన్‌లోనే కాదు, ఏ దేశంలోనూ ఏ సమాజంలోనూ 'తీవ్రవాదాన్ని' అరికట్టలేమనేది వాస్తవం.

## తీవ్రవాదంపై యుద్ధం పేరుతో

జూలై మొదటివారంలో బ్రిటన్‌లోని గ్లాస్గోలో జరిగిన తీవ్రవాదుల దాడికి బాధ్యులుగా బ్రిటిష్, ఆస్ట్రేలియా ప్రభుత్వాలు అరెస్ట్ చేసిన వారిలో ముగ్గురు భారతీయులు కఫీల్ అహ్మద్, సబీల్ అహ్మద్ వారికి దూరపు బంధువైన మహమ్మద్ హనీఫ్ ఉన్నారు. మహమ్మద్ హనీఫ్‌ని ఆస్ట్రేలియా పోలీసులు అరెస్ట్ చేసి, ఎటువంటి నేరారోపణ చెయ్యకుండా పన్నెండు రోజులు తమ కస్టడిలో పెట్టుకుని, చివరికి ఉగ్రవాదులకి సహాయం చేసాడనే నేరం మోపారు. హనీఫ్ ఉగ్రవాదులకి చేసిన సాయం ఎటువంటిది? దాదాపు సంవత్సరం కిందట బ్రిటన్ నుండి ఆస్ట్రేలియాకి వచ్చేస్తున్నప్పుడు తన మొబైల్ ఫోనులో సిమ్ కార్డ్‌ని వాళ్లకి అందచేసాడు హనీఫ్. ఈ సాయం చేసిందెవరికి? అతనికి దూర బంధువులైన సబీల్, కఫీల్ అహ్మద్‌లకి. వేరే దేశానికి వెళ్తున్నప్పుడు తన సిమ్‌కార్డ్ ఆ దేశంలో పనికిరాదు కాబట్టి తన బంధువులైనా దాన్ని వాడుకొంటారులే అని చాలా మామూలుగా హనీఫ్ చేసినది చివరికి అతనికి 'ఉగ్రవాది' అనే పేరు తెచ్చిపెడుతుందని అతనే కాదు ఇంకెవరూ కూడా అనుకోలేరు. ఐతే మనం బతుకున్నది మామూలుకాలంలో కాదు – 'వార్ ఆన్ టెర్రర్' పేరుతో అన్ని దేశాల్లోనూ ప్రజల హక్కులనీ, న్యాయాన్నీ కాలరాస్తున్న కాలంలో. అందుకనే ఎటువంటి కచ్చితమైన ఆధారాలు లేకుండా, కేవలం తన సిమ్‌కార్డ్ దూరపు బంధువులకి అందచేసాడనే ఒకే ఒక్క ఆధారం మీద, అదీ ముస్లిం అయినందుకే ఒక భారతీయ పౌరుడు ఆస్ట్రేలియా పోలీసుల నిర్బంధంలో ఉన్నాడు. ఆస్ట్రేలియాలోని మానవ హక్కుల, న్యాయవాదుల సంఘాలు ఈ సంఘటన పట్ల, ఆస్ట్రేలియా ప్రభుత్వ తీరుపట్ల తెలుపుతున్నపాటి నిరసన కూడా మరి భారత ప్రభుత్వం తెలపలేదు. ఆఫ్ఘనిస్తాన్‌లో భారతీయ పౌరులు తాలిబాన్ చెరలో ఉన్నప్పుడు భారత ప్రభుత్వం ప్రవర్తించిన తీరుకు, ప్రస్తుత ప్రవర్తనకు తేడా గమనించవలసి ఉంది. ◆

### మీకు తెలుసా ?

**మత విశ్వాసాల ఆధారంగా ప్రపంచ జనాభా**

| | | శాతం (%) లో |
|---|---|---|
| 1. | క్రిస్టియన్‌లు | 33.06 |
| 2. | ముస్లింలు | 20.28 |
| 3. | హిందువులు | 13.33 |
| 4. | చైనీస్ యూనివర్సలిస్టులు | 6.27 |
| 5. | బుద్ధిస్టులు | 5.87 |
| 6. | ఎత్నో రిలిజనియిస్టులు | 1.68 |
| 7. | సిక్కులు | 0.39 |
| 8. | యూదులు | 0.23 |
| 9. | స్పిరిటిస్టులు | 0.20 |
| 10. | బహాయ్స్ | 0.12 |
| 11. | కన్‌ఫ్యూషియనిస్టులు | 0.10 |
| 12. | జైనులు | 0.07 |
| 13. | షింటోఇస్టులు | 0.04 |
| 14. | జొరాస్ట్రియన్లు | 0.04 |
| 15. | ఇతర మతాలవారు | 0.02 |
| 16. | మతరహితులు | 11.92 |
| 17. | నాస్తికులు | 2.35 |

(2006 నాటికి జనాభా కోట్లలో : ఆసియా – 391.4; ఆఫ్రికా – 89.14; యూరోప్ – 72.93; ఉత్తరమెరికా – 51.24; దక్షిణ అమెరికా – 37.13, ఆస్ట్రేలియా – 3.3; అంటార్కిటికా – 0)

# అసహజ మరణాల సూచి

సంకలనం : **రాంకి, వై. రామచంద్రం**

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 24.6.07 నుండి 30.6.07 | 12 | – | 10 | – | – | – | 1 | 6 | – | – | 12 | 9 | – | – | – | – | – | – |
| 1.7.07 నుండి 7.7.07 | 13 | – | 17 | 1 | – | – | 11 | 4 | – | 2 | 10 | 30 | 1 | 1 | – | – | – | – |
| 8.7.07 నుండి 14.7.07 | 6 | – | 19 | 1 | – | – | 5 | 6 | – | 1 | 14 | 21 | 2 | – | – | – | 5 | – |
| 15.7.07 నుండి 20.7.07 | 6 | – | 10 | – | – | – | 8 | 1 | – | 2 | 17 | 18 | 4 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | 3 | – | 20 | – | – | – | 13 | 10 | – | 2 | 26 | 35 | 34 | – | – | – | 4 | 1 |
| మెదక్ | 7 | – | 32 | – | – | – | – | 3 | 1 | 5 | 38 | 3 | – | – | – | – | – | – |
| మొత్తం | **47** | **-** | **108** | **2** | **-** | **-** | **38** | **30** | **1** | **12** | **117** | **116** | **41** | **1** | **-** | **-** | **9** | **1** |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ – డి. విజయభాస్కర్; మహబూబ్‌నగర్ – రవికుమార్; మెదక్ – కె. రాజు

గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.

RNI Regn. No. APTEL/2003/11482 Published on 27-07-07 PRINTED BOOK








# తొలి అడుగు విజయవంతం!
# మూడేళ్ళ అడుగులు ప్రగతికి అంకితం!!





## ఇవన్నీ వినూత్న పథకాలే -
## ముఖ్యమంత్రి ఆశయానికి చిహ్నాలే

- జలయజ్ఞం - 52 భారీ, మధ్యతరహా ప్రాజెక్టుల ద్వారా 1 లక్ష కోట్ల రూపాయలతో కోటి ఎకరాలకు సాగునీరు
- 'ఇందిరమ్మ' - గ్రామాలకు, పట్టణాలకు మౌలిక వసతులు కల్పించి, నిర్ణీత సమయంలో ఆదర్శ గ్రామాలుగా తీర్చిదిద్దడం
- 'ఆరోగ్యశ్రీ' - పేదవారికి ఆరోగ్య బీమా మూడు జిల్లాల్లో ప్రారంభం
- ఉచిత విద్యుత్ - వ్యవసాయానికి 7 గంటల విద్యుత్ సరఫరా
- 'ఇందిరా క్రాంతి పథం' - స్వయం సహాయక బృందాలలోని మహిళలకు పావలా వడ్డీకే రుణాలు
- 'ఉపాధి హామీ పథకం' - గ్రామీణ ప్రాంతాల నిరుపేదలకు ఒక్కొక్కరికి ఏటా కనీసం 100 రోజుల పనిదినాలతో క్రామిక ఉపాధిని కల్పించడం
- రాజీవ్ పల్లెబాట, రాజీవ్ నగరబాట, ప్రజాపథం కార్యక్రమాల ద్వారా ప్రజా సమస్యలకు తక్షణ పరిష్కారం
- 'ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ' - 2006-2007 సం॥లో రూ.17,529 కోట్ల IT/ITES ఎగుమతులతో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా ఉండటం
- 'రాజీవ్ గృహకల్ప' - దేశంలోనే మొట్టమొదటిసారిగా పట్టణ నిరుపేదలకు గృహ సౌకర్యం
- 'రాజీవ్ స్వగృహ' - దేశంలోనే మొట్టమొదటిసారిగా మధ్య తరగతి ప్రజలకు గృహ సౌకర్యం
- 'పేదలకు భూమి పంపిణీ' - ఎస్.సి., ఎస్.టి., బి.సి.లకు చెందిన 3,14,685 లక్షల మంది నిరుపేదలకు 4,37,019.86 ఎకరాల భూమిని మూడు విడతలుగా పంపిణీ జరిగింది
- 'ఇందిర ప్రభ' - రూ.500 కోట్లతో ఎస్.సి., ఎస్.టి.,బలహీన వర్గాలకు చెందిన బంజరు భూమి అభివృద్ధి.

**పేద గుండెకు అండగా! ప్రగతి సాధనే ధ్యేయంగా!!**

R.O.No. 215/Sou/Advt.I/2007-08

Printed, published and owned by V. Hanumantha Rao and Printed at Charita Impressions for Nutan Art Printers, 11-5-417-420, Red Hills, Lakdi-ka-pool, Hyderabad - 500 004 and published at 8-3-898/22, Nagarjun Nagar, Hyderabad - 500 073. Editor : V. Hanumantha Rao

VEEKSHANAM
301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayatnagar, Hyd-29.